జూన్ 4 శ్రీ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం జన్మదిన సందర్భంగా
సంగీత ప్రియులందరి తరఫున శుభాకాంక్షలతో...

హాసం





హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు



# హాస్యం - సంగీతం














హాస్య చిత్రాలకు ప్రత్యేకమైన ఒరవడిని దిద్దిన ప్రముఖ దర్శకుడు ఇవివి సత్యనారాయణగారి పుట్టినరోజు(జూన్ 10)ని పురస్కరించుకుని హాస్య ప్రియులందరి తరుపున ఆయనకు శుభాకాంక్షలను అందిస్తూ అతి త్వరలో ఆయనపై ఓ వెరైటీ ఆర్టికల్‌ని పాఠకులకు అందించగలమని నమ్ముతూ... హాసం





సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'శ్రీరామ్'
'కనులుమూసినా నీవాయే'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో




అనుబంధంగా ఆరుద్ర, ఇళయరాజా, యస్వీ కృష్ణారెడ్డి పాటలు...71,15,54 పేజీలలో

ముఖచిత్రం: గజాలా 'అదృష్టం' చిత్రంలో



# ప్రియా జనవాక్యం

పాతతరం మాణిక్యాలు మట్టిలో కలసి పోకుండా ఈ తరం వారికి పరిచయం చేస్తున్న మీ కృషి సర్వదా అభినందనీయం. అన్నింటికన్నా నన్ను ఆకట్టుకున్నది నటగాయని కన్నాంబ గారి మీద రాసిన వ్యాసం. ఇంకా మా తరం రుచి చూసిన కమ్మని గాత్రాలెన్నో వున్నాయి. పి.శాంతకుమారి, టంగుటూరి సూర్యకుమారి, రఘురామయ్య, రావు బాలసరస్వతీదేవి, పుష్పవల్లి, పి.భానుమతీ రామకృష్ణ వంటి నటగాయనీ గాయకుల గురించి 'హాసం' ద్వారా తెలుసుకోవాలని నా ఆకాంక్ష.

**-జి.ఎస్.జి.రావు, మద్రాసు**

తేలికైన పదాలతో లోతైన అర్థాలతో గొప్పగా వుండే ఆత్రేయ పాటల నిధిని అందించి సాహితీ ప్రియులను ఉల్లాసపరిచారు. అలాగే శ్రీశ్రీ నిధిని కూడా అందిస్తే ధన్యులవుతారు.

**-జి.శ్రీశైలం, హైదరాబాద్ 72**

**(జనవరిలో ఆయన పుట్టినరోజు సందర్భంగా అందించగలం.)**

'హాసం'ను గత ఆరు సంచికల నుంచి చదువు చున్నాను. చక్కని వ్యాసములు, చిత్రములు, విశేషములతో పంచామృతమువలెనున్నది. మే నెల సంచిక అలరించినది. పతీ రక్కుబాయి కథ పరమాన్నంలో పచ్చిమిరపకాయ వలె, విందు భోజనములో వేపగింజ వలె గోచరించింది. పేరును బట్టి కథ వ్రాయుట ఆషామాషీ కాదు. గతంలో ప్రచురించిన ఆదివిష్ణు, ఇలపావులూరి, సూరేపల్లి విజయగార్ల కథలు నవ్వుల విందులు కురిపించాయి. ఆ స్థాయి కథలను అందివ్వ మనవి. కంఠాభరణం, భైరవదోషం నవ్వుల పంటలు పండిస్తున్నాయి. పాత సినిమాల చరిత్రలు ఛాయా చిత్రములతో వివరంగా అందించడం విస్తుగొలుపుతున్నది. ఇంతకు ముందెన్నడూ చూచి ఎరుగని చిత్రములు మీరు అందించుట మీ సంకల్ప శుద్ధికి నిదర్శనము.

**-శ్రీ భాష్యం జగన్నాధాచార్యులు, హైదరాబాద్**

'హాసం' పత్రికలన్నీ ఒక్కటీ వదలకుండా చదువుతున్నాము. పాత తరం అయిపోయింది. కొత్త తరం వచ్చేసింది అని అందరూ నీరసించే తరుణంలో 'హాసం' నెలకొల్పి 'హాసం' ద్వారా కొత్త పాత తరాలను ఆకట్టుకునే విధంగా మీరు ప్రచురిస్తున్నవి ప్రశంసనీయం. కన్యాశుల్కం, అలనాటి నటి కన్నాంబ, మనసుకవి ఆత్రేయ వంటి వారి గురించి ముద్రించి పాత తరాల వారిని, ఈనాటి తరానికి సంబంధించి పాటలు, అన్ని తరాల వారికోసం సీరియల్స్ పిల్లలకోసం పలు కార్టూన్లు ప్రచురిస్తున్నందుకు మీకు ధన్య వాదాలు. ఆత్రేయ పుట్టిన రోజు రాశారు. వర్ధంతి రాయటం మరిచారు. రాస్తే జయంతి - వర్ధంతి కార్యక్రమాలు నిర్వహించే అదృష్టం కలుగుతుంది. మా వంటి కళా సంస్థలకి.

**-చెన్నా తిరుమలరావు, విశాఖపట్నం**

కంపల్లె రవిచంద్రన్ గారి 'కన్నాంబ' పై వ్యాసం పత్రికకి హైలైట్. ఒకనాటి ఆంధ్రుల ఆరాధ్య దేవత ఆవిడ. ఆత్రేయ వర్ణచిత్రం బాగుంది. 'హాసం' మొత్తం మీద పూర్తి తృప్తినిచ్చింది.

**-ముసునూరి రామచంద్రమూర్తి, విజయవాడ**

శాంతకుమారిగారి గురించిన వ్యాసం చదివేక రాయాలనిపించింది. ప్రతిరోజు సి.నారాయణరెడ్డి గారి పాట ఏదైనా వినందే నాకు నిద్ర పట్టదు. అవన్నీ వివిధ రకాల పాటలు. కానీ శాంతకుమారి గారు ఆలపించిన "తల్లా పెళ్ళామా" లోని 'మమత లెరిగిన తండ్రి' అనే ఒకే ఒక్క పాటను గత ఇరవై సంవత్సరాల నుండి ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఒక్కసారైనా వింటాను. ఆ లెక్కన ఈ పాటను కనీసం పదివేల సార్లయినా వింటాను. ఎన్ని సార్లు విన్నా, విన్న ప్రతీసారీ చివర్లో ఒక్కకన్నీటి చుక్కైనా రాలుతుంది. ఆ అభినయం కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. 'కలిసొచ్చిన అదృష్టం'లో 'అమ్మానువ్వు' పాటలో 'బాబూ' అని శాంతకుమారి దుఃఖిత గాత్రంతో అంటున్నప్పుడు రాతిమనిషైనా విలపించక తప్పదు. అమ్మ పాత్రలో అలాంటి నటీమణి నభూతో నభవిష్యతి. మరో మధురగాయని నటీమణి యస్.వరలక్ష్మి గురించి ఒక వ్యాసం ప్రచురిస్తారని ఆశపడు తున్నాను.

**-ఇలపావులూరి మురళీమోహనరావు**
**హైదరాబాద్**

'హాసం 16-31' మే సంచిక జన్మదినాల స్పెషల్‌గా వచ్చింది. శాంతకుమారి, జమునారాణి, సిరివెన్నెల సీతారామశాస్త్రి, అన్నమయ్య, ఎన్టీరామారావు, కోటి, ఎల్.బి.శ్రీరామ్ వంటి ప్రముఖులు ఈ పక్షం రోజుల్లోనే పుట్టటం నిజంగా విశేషమే.

భైరవదోషం స్కిట్‌లో దాగిన అసలు దోషం (కుక్కకంచం)అత్యద్భుతంగా ఉంది. ఎల్.బి. శ్రీరామ్‌గారి రచన ఆయన మాటల లాగానే నవ్వించింది. సీతారామశాస్త్రి గారి పాటలు, కోటి స్వరపరిచిన పాటలు, జమునా రాణిగారి గీతాలు చాలా చాలా ఇచ్చి 'హాసం' హాస్యానికే కాదు సంగీతానికే పెద్దపీట వేసిందనిపించింది. "రోజులు మారాయి" పాటలకు రాజాగారి వ్యాఖ్యానం ఆయా పాటలను ఎలివేట్ చేశాయి. ప్రత్యేకంగా 'ఏరువాకా సాగారో' అన్న పాటలో డప్పులను గురించి వ్యాఖ్యానం బర్మన్‌దా కూడా వేణుగారి ప్రభావంలో పడ్డాడు అన్నవి ఆకర్షించాయి.

కన్నాంబగారి గురించి చూచాయిగా వినుండ డమే తప్ప 'హాసం' వివరించినంత విపులంగా ఎప్పుడు చదవలేదు. ఆ మహానటి మృతదేహానికి కట్టిన పట్టుచీర మాయమయిందని మీరు వ్రాసింది చదివి చాలా బాధ గల్గింది. పోతే ఈ సంచికకు తల మానికం అనండి! ఇంకేమయినా అనండి! అది ఆత్రేయ గారిని గురించిన వ్యాసాలు, వారు రచించిన ఆణి ముత్యాల్లాంటి పాటలు.

**-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్**

'హాయ్' చిత్రంలో రాజేష్, నికిత ముఖ చిత్రంతో సర్వాంగ సుందరంగా వుంది. ముఖ్యంగా ఎడిటోరియల్ 'వేసవి సెలవులు' సద్వినియోగం చాలా ఉపయోగకరమైన మాటలు వ్రాసారు. ఇష్టమైన శీర్షిక 'ఇష్టపది' అంటూ ఇష్టమైన వారికోసం పరిచయం మాకు ఆనందదాయకంగా వుంది. ఎల్లెల్లవయ్యా ఎల్లుబీ సీరామూ శీర్షిక కడుపుబ్బ నవ్వించింది. పదిహేను రోజులు హాసం కోసం వెయిట్ చేయటం చాలా కష్టంగా వుంది. బాబ్బాబు దయుంచి హాసం వీక్లీ చేసెయ్యరాదూ! చౌ చౌ చౌరస్తా శీర్షికలో చిలిపికవిత, చిలిపిలిపి, పేరు-రిపేరు బావుంటున్నాయి. పాఠకులు చాలా ఇష్టపడే సీరియల్ 'సద్దాం ఆంటీ ఇంటి కథ'. 10/-రూ...లతో పదే పదే చదివే శీర్షికలతో హాస్యం సంగీతం, పాటల పుస్తకాలు, వేరేగా మార్కెట్లో కొనక్కరలేకుండా మాకు అందిస్తున్నందులకు ఎడిటర్ గారికి మా అభినందనలు.

**-రఫీ, రెహనా, తన్వీర్, రాజాం.**

సంపుటి :1 సంచిక: 17

1 - 15 జూన్ 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 17

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు తనను 'కష్టపడి పని చేసే ముఖ్యమంత్రి'గానే అభివర్ణించుకుంటారు గానీ కళాభిజ్ఞుడిగా, కళాభిమానిగా చాటుకోరు. అయినా ఇటీవల సంగీతానికి సంబంధించి రెండు చక్కటి పనులు, కనులతోబాటు గుండె కూడా చెమర్చే పనులు చేశారు.

ఒకటి ఉస్తాద్ బిస్మిల్లాఖాన్‌కి సంబంధించినది. నిర్వాహకుల మధ్య సమన్వయలోపం వలన ఒక వృద్ధ కళాకారుడు వ్యథార్త హృదయంతో భాగ్యనగరం నుంచి మరలి వెళ్లిపోయే సమయంలో అధికార సంప్రదాయాలను, ఆర్భాటాలను పక్కన బెట్టి - నేరుగా, స్వయంగా వెళ్లి ఆయనను సమాధానపరచి వచ్చారు. విజ్ఞతతో, సమయస్ఫూర్తితో ఒక మహోన్నత సంగీతకారుడు తెలుగుజాతిని శపించుకుంటూ వెళ్లే పరిస్థితిని చక్కదిద్దారు.

రెండవది అలనాటి గాయనీమణి జిక్కి పట్ల కనబరచిన అనుకంపన, అందించిన ఆర్థిక సాయం. జిక్కి ఒకప్పటి ప్రఖ్యాత గాయకురాలే కానీ ప్రస్తుతం క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ, చికిత్స చేయించుకోవడానికి ఆర్థికంగా ఇబ్బంది పడుతున్నారు. అయినా ఆమె సాయం కోసం అర్థించలేదు. అభ్యర్థించలేదు. నెల రోజుల క్రితం శ్రీమతి ఎస్.జానకి హైదబాదు వచ్చి ఓ సంగీత కార్యక్రమంలో ప్రస్తావించడంతో ఆ సంగతి వెల్లడయింది.

సంగీతం గురించి సంగీతకారుల గురించి అన్ని సంగతులూ సాకల్యంగా చర్చించే 'హాసం' తన సంచికలో ఈ వార్తను ప్రముఖంగా ప్రచురించింది.

'తారా' స్థాయిలో ఉండగా విలాసవంతమైన జీవితం గడిపో, సినిమా నిర్మాణంలోకి దిగి చేతులు కాల్చుకునో ఆర్థికంగా చితికిపోయాక - ప్రభుత్వమో, ప్రజలో తమను ఆదుకుని కళామతల్లికి సేవ చేసినట్లు భావించాలని విజ్ఞప్తులు చేసే కళాకారుల కోవకు చెందిన వ్యక్తి కాదు జిక్కి. అందువల్లనే ఆ వార్త చదివిన 'హాసం' పాఠకులెందరో మాకు ఫోన్లు చేసి తమ సానుభూతిని తెలిపారు.

కొందరు కార్యదీక్షాపరులు జిక్కి, జమునారాణిల సంగీత విభావరి ఏర్పాటుచేసి వారిని నగరానికి ఆహ్వానించారు. వారి రాక సందర్భంగా 'ఈనాడు' 'క్యాన్సర్ గుప్పిట్లో రాగాల కోయిల' అనే పేర వార్త రాసి జిక్కి అనారోగ్యాన్ని లక్షలాది పాఠక శ్రోతలకు వెల్లడి చేసింది. ఆ వార్త విని స్పందించిన వదాన్యులలో శ్రీ చంద్రబాబు ఒకరు. ఆమె కాన్సర్ చికిత్సకు అయ్యే ఖర్చు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భరిస్తుందని ప్రకటించి ఇతరులకు స్ఫూర్తినిచ్చారు. ఆర్.పి.పట్నాయక్ వంటి వారు తమ విరాళాలను అందచేశారు. ఆర్థిక సాయం కంటే అభిమానుల ఆదరాభిమానాలు జిక్కిని ఎక్కువగా కదిలించాయి. 'మీరందరూ వచ్చారు అదే చాలు' అన్నారామె.

నవంబరు 1 నుండి సంగీత పరిశ్రమ హైదరాబాదుకు తరలివచ్చే సూచనలు కనబడుతున్న ఈ తరుణంలో ముఖ్యమంత్రి సంగీతకారుల పట్ల తమ గౌరవాన్ని ఈ రెండు సంఘటనల ద్వారా చాటుకున్నారు. కొత్త ప్రాంతానికి తరలిరావడానికి సంకోచించే మ్యూజిక్ టెక్నీషియన్స్‌కు ఈ స్పందన, ఈ చర్యలు ధైర్యాన్ని, స్థైర్యాన్ని కలగజేస్తాయి. హైదరాబాదులో మ్యూజిక్ పరిశ్రమ బలంగా వేళ్లానుకోవడానికి ఇదెంతో దోహదం చేస్తుంది. "హాసం" ఈ పరిణామాలను హృదయపూర్వకంగా అభినందిస్తోంది, ఆహ్వానిస్తోంది.





# టెలీ స్నేహం

ఐ.ఎ. నరసింహం

**"ఏమండోయ్ ఇందాక శాస్త్రిగారొచ్చి వెళ్ళారు. మధ్యగదిలో ఈ మూలకి ఫోన్ పెట్టమన్నారు. ఇలా పెడితే ఫోన్‌లో అన్నీ శుభవార్తలే వినొచ్చునట. ఉదయం నుండి ఈ మూల సామాన్లన్ని మరోచోట మార్చేసరికి నా నడుం పడిపోయిందనుకోండి!" బయటకు వెళ్ళి హడావుడిగా ఇంట్లోకి ప్రవేశిస్తున్న ఏకదంతంతో అంది అతని భార్య నీలవేణి.**

**"అదిసరే గానీ తొమ్మిది గంటల నలభై ఆరు నిముషాలకి ముహూర్తమట. అప్పుడే తొమ్మిదిన్నర దాటింది" అంటూనే "ఫోన్ రంగులో కలిసి పోయినట్టు ఆ టేబుల్ మీద ఆ పచ్చ క్లాతేంటి? అది తీసి మరో రంగుది వెయ్యి. ఈలోగా శాస్త్రిగారొచ్చేస్తారు" అన్నాడు ఏకదంతం అంతే హడావుడితో.**

**నీలవేణి ఆశ్చర్యపోయింది. "అదేమిటి ఇప్పుడు శాస్త్రిగారెందుకు?" అంది.**

**"ఓసి పిచ్చి మొహమా ఈ పల్లెటూళ్లో ముందు మన ఒక్కరికే ఫోనొచ్చింది. ఈ శుభ సందర్భంలో చిన్న విఘ్నేశ్వరపూజన్నా చేసుకోమా...." దీర్ఘం తీశాడు - ఏకదంతం. అలా అంటూనే చేతితో పట్టుకొచ్చిన మామిడి కొమ్మలను ఇంటి ద్వారాలకి పెట్టాడు. వెంటనే ఓ పళ్ళెంలో కొంచం పసుపు కుంకుమ, అగరొత్తులు, అరటి పళ్ళు వంటి పూజా ద్రవ్యాలను అమర్చి తెచ్చింది నీలవేణి.**

శాస్త్రిగారొచ్చారు.

నీలవేణి ఏకదంతం తూర్పు ముఖంగా కూర్చున్నారు. ఉత్తర ముఖంగా శాస్త్రిగారు కూర్చుని వారికి మధ్యలో ఫోన్‌పెట్టి, దానిముందు దీపం పెట్టి ఇన్ని అగరొత్తులు వెలిగించి వారిద్దరి చేత సంకల్పం చేయించి విఘ్నేశ్వర పూజ చేసి ఇంగ్లీష్‌లో ఉన్న ఫోన్ నామధేయాన్ని సంస్కృతంలోకి తర్జుమా చేసి "దూర్వాణి యంత్రపూజం కరిష్యే" అంటూ వారిద్దరి చేత ఓ చెంబు నీళ్ళలో వేళ్ళు ముట్టించాడు. తరువాత ఫోన్‌కి పసుపురాసి - కుంకుమ బొట్లు పెట్టి ఓ పూలదండ చుట్టి ఓ కొబ్బరికాయకొట్టి పూజ ముగింప జేశారు. ఒక్కసారి ఎడమచేతి ముందు భాగానికి కట్టుకున్న వాచీవంక చూసి - "అయ్యో టైము కావస్తోంది. ఇంక ఫోన్‌ను టేబులు మీద పెట్టి కనెక్షనిచ్చి ఎవరో ఒకరికి 'హలో' అనండి" అన్నారు శాస్త్రిగారు.

అంతే.

ఏకదంతం, నీలవేణి కలిసి జాగ్రత్తగా ఆ ఫోన్‌ను మీదకెత్తుతుంటే




"దూర్వాణి పేటి కాయాం ఉన్నతాసన మావాహయామి స్థాపయామి" అంటూ శాస్త్రిగారు మంత్రాలు చదివారు.

"ఏమండీ!" అంది నీలవేణి

"ఏమిటి?" అన్నాడు ఏకదంతం

"ఫస్ట్ ఫోన్ మా పిన్నికి చేస్తానండి!" అంది.

ఏకదంతం ఆలోచనలో పడ్డాడు. టౌన్‌లో ఉన్న తన స్నేహితుడు వరదరాజుకి ఫస్ట్‌ఫోన్ చేస్తానని నిన్ననే వాగ్దానం చేశాడు - ఆ మాటే చెప్పాడు భార్యతో.

నీలవేణి ముఖం మాడ్చుకుంది.

ఏకదంతం బాధపడ్డాడు. ఓ రెండు నిముషాల తరువాత "సరే అలాగే చెయ్యి" అన్నాడు.

సరిగ్గా అప్పుడే....

ఫోన్ రింగవటం ప్రారంభించింది.

నీలవేణి, ఏకదంతం, శాస్త్రిగారు ఆశ్చర్యపోయారు.

"అయ్యో గొప్ప శుభ శూచకం సరిగ్గా సమయానికే మీకెవరో ఫోన్ చేస్తున్నట్టున్నారు. అలా అందుకోవడం కూడా మంచిదే. కానివ్వండి" అన్నారు శాస్త్రిగారు.

ఏకదంతం రిసీవరందుకని చెవికి మూతికి కనెక్షనిచ్చాడు.

"హలో" అవతలినుండో స్త్రీ గొంతు.

"హలో!" అన్నాడు ఏకదంతం ఉత్సాహంగా.

"హలో" అందాగొంతు మళ్ళీ.

"హలో చెప్పండి! ఎవరు కావాలి?" అన్నాడు ఏకదంతం.

"హలో సార్ మీరేమీ అనుకోకపోతే ఒక్కసారి మీ యింటి ప్రక్కనున్న అచ్యుతరావుగారితో - పుట్టింటికెళ్ళిన వారి భార్య ఉరిపోసుకుని

చచ్చిపోయిందని అర్జంటుగా తనను బయలుదేరి రమ్మని చెప్పగలరా...." అంది గాభరాగా.

ఏకదంతం గుండె గుభేల్‌మంది. ప్రారంభంలోనే ఈ చావు వార్తేమిటిరా బాబు అనుకుంటూనే ముఖం మీద ముసురుకుంటున్న చెమట్లు తుడుచుకుంటూ "హలో యింతకీ - మీరెవరు?" అన్నాడు.

"నన్నడుగుతారేం ఇంతకూ మీరెవరు? మీ ఫోన్ నెంబరెంత?" అవతలి గొంతు చెవిలో ఖంగ్‌మంది.

"నా నెంబరు మాటకేం గానీ మీకే నెంబర్ కావాలో చెప్పండి" మళ్ళీ అన్నాడు ఏకదంతం.

"అయ్యో ఇది త్రీ ఫోర్ సిక్స్ వన్ ఫైవ్ కాదా"

అంతే-

ఏకదంతం ఒకసారి తన ఫోన్ వంక చూసి "తల్లీ ఇది సిక్స్ వన్ త్రీ ఫోర్ ఫైవ్" అన్నాడు.

''రాంగ్ నంబరా'' అంటూ ఆ స్త్రీ కట్ చేసింది.

"ఏం జరిగింది ఎవరు ఫోన్ చేశారు? మనకి ఫోనొచ్చిందని అప్పుడే అందరికీ ఎలా తెలిసి పోయింది." నీలవేణి ప్రశ్నలు.

''అయ్యో శుభ వార్త విన్నట్టేనా?'' శాస్త్రి గారడిగారు.

ఆయన వేపు, భార్య వేపు జాలిగా చూసి - "మొదట్లోనే చావు వార్త వినవలసి వచ్చిందండి బాబు!'' అన్నాడు ఏకదంతం.

''అయ్యో కంగారు పడకండి! అసలీ పెట్టెల ప్రభావమే అంత. సరే ఆదోష పరిహార్థం మీరే ఏవరికో ఫోన్ చేసి ఓ మంచి మాట చెప్పమనండి" అన్నారు శాస్త్రిగారు.



ఆ ఆలోచన బాగున్నట్టే అనిపించింది ఏకదంతానికి వెంటనే వరదరాజుకి ఫోన్ చేశాడు.

"హలో" అవతలిగొంతు.

"హలో వరదా" ఉత్సాహంగా అడిగాడు.

"కాదండి! వారబ్బాయిని మాట్లాడుతున్నాను. మా నాన్నగారి ఫ్రెండెవరో స్కూటరేక్సిడెంట్‌లో పోయారట - ఇప్పుడే వెళ్ళారు. మీరెవరు? ఏం చెప్పమంటారు?" అనగానే ఫోన్ పెట్టేశాడు ఏకదంతం. విచారవదనంతో ఈ సంగతి చెప్పాడు శాస్త్రిగారికి.

శాస్త్రిగారికి భయమేసింది. పూజ అయిన తరువాత యింకా ఆ దంపతుల చేత తాంబూలం పుచ్చుకోలేదు. సాధారణంగా ఇలాంటి వాటికి ఎవరూ పూజలు చెయ్యరు. ఏకదంతానికి కొంచం చాదస్తం ఎక్కువ గనుక రెండు రోజుల క్రితం ముహూర్తానికని తన దగ్గరకొస్తే ఇలా ఫోన్‌కి పూజ చేసి వాడమని తనే సలహా ఇచ్చాడు. ఇంతవరకూ సవ్యంగానే జరిగింది. ఎంత హీనపక్షంగానైనా ఓ నూట పదహార్లు ఇవ్వకపోతాడా అన్న ఆలోచనలో వుంటే ఈ చావు వార్తల ప్రభావంతో ఓ పావలా కాసన్నా - ఇచ్చేట్టు కనిపించలేదు. అనుకుంటూనే-

"అయ్యో మీరాగండి! ఓసారి మీ శ్రీమతిగారిని ఫోన్ చెయ్యమనండి!" అన్నారు శాస్త్రిగారు.

వెంటనే నీలవేణి వాళ్ళ పిన్ని నెంబరుకు డయల్ చేసి "హలో" అంటూ తన పేరు చెప్పింది.

"హలో నీలూ నువ్వా! ఎక్కడినుండి?" అవతలి కంఠం

"చెప్పుకో చూద్దాం" అంది నీలవేణి ముసిముసిగా నవ్వుతూ.

"బట్టల షాపునుంచా?"

"కాదు"

"ఆఁ తెలిసింది తిరుపతి నుండి కదూ.... నువ్వా మధ్య వెళ్ళానన్నావ్ - అక్కడినుండేనా?"

"తిరుపతి నుండి కాదు"

"కాదా... మరెక్కడినుండబ్బా!"

"నువ్వే చెప్పు చూద్దాం"

"ఏమిటి?.... ఎవరు? ఎవరితో మాట్లాడుతున్నావ్" ఏకదంతం అడిగాడు.

"మనింటికి ఫోనొచ్చిందని తెలీదుకదాండి. నేనెక్కడినుండి మాట్లాడుతున్నానో తెలుసుకోలేక పోతోంది. పాపం" అంది నీలవేణి.

ఏకదంతం కళ్ళు తిరిగాయి. "సరే నువ్వే చెప్పేసెయ్. అలా ఫోన్లలో గంటల తరబడి పజిల్స్ నిర్వహిస్తే ఎలా?" అన్నాడు చిరాగ్గా.

"అబ్బ! అలాగేనండి! మీరెవరితోనన్నా ఎంత సేపన్నా మాట్లాడొచ్చు నేను మాత్రం వెంటనే



ముగించేయాలి" రుస రుసలాడింది నీలవేణి.

ఏకదంతం మరి మాట్లాడలేదు. ఆ తరువాత మరో ఐదు నిముషాలు నీలవేణి మాట్లాడి తనింటికి ఫోన్ పెట్టించామని చెప్పి, నెంబరిచ్చి తనింట్లో ఎక్కడెక్కడ ఏ వస్తువు లున్నాయో, తన కట్టుకున్న చీర రంగేంటో చెప్పి ఆవిడ ద్వారా నల్లేరు వడియాలు ఎలా పెట్టాలో తెలుసుకుని ఫోన్ పెట్టేసింది.

"అయ్యా! మరిక నేవెళ్ళొస్తాను" శాస్త్రి గారనగానే అతనికి తాంబూలంలో ఓ నోటు పెట్టి నమస్కరించాడు ఏకదంతం.

"ఏమండి!" అంది నీలవేణి.

"ఏమిటి?"

"అదేనండి! ఈ శుభ సందర్భంగా ముత్తయిదువులందరికీ పేరంటం ఏర్పాటు చేశాను. వారికి తాంబూలాలు ఇవ్వడం జరిగింది. వారందరూ వారి వారి బంధువులకి ఒక్కో ఫోన్ చేసి వెళ్తారు" అంది.

గుండె జారిపోయింది ఏకదంతానికి.

"నీకేం పిచ్చా? మనకోసం కొన్ని ఫ్రీ కాల్సుంటాయి. అవి ఒక్కరోజే వాడేస్తే ఎలా?" అన్నాడు ఏకదంతం మెల్లగా.

నీలవేణి వినలేదు. తరువాత భర్తకేదో నచ్చచెప్పి ఆ మహిళా మణులందరికీ గ్రీన్ సిగ్నలిచ్చింది.

అంతే-

ఊరు ఊరంతా తన ఫోన్ మీద దాడి చేసి - ఆ ఫోన్ నెంబరుకు ఏ అవసరమొచ్చినా ఫోన్ చెయ్యమని చెప్పి అందరూ నిష్క్రమించారు.

****

రాత్రి పదకొండు గంటలు దాటింది.

ఏకదంతం నీలవేణి గాఢంగా నిద్రపోతున్నారు.

ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్....

ఏకదంతానికి మెలకువ వచ్చింది. భార్య వేపు చూశాడు. పగలంతా పనితో అలిసిపోయిన నీలవేణి నిద్రపోతూనే ఉంది.

మెల్లగా లేచి రిసీవరందుకుని "హలో" అన్నాడు.

"అయ్యా ఇది దంతంగారిల్లేనా?" అడిగారెవరో

ఒళ్ళు మండిపోయింది ఏకదంతానికి. "పగలంతా అడ్డమైన వాగుడూ వాగి అవసరమైన పేరు పెట్టి పిలవడంలో మాత్రం కొందరు పొదుపు పాటిస్తారు. దంతం ఏమిటి దంతం...." గొణుక్కున్నాడు.

"అయ్యా మీరు గొణుక్కోవటం వినిపిస్తోంది. సాధారణంగా మనిషికి ముప్పై రెండు దంతాలుంటాయి. మీకు మరీ ఏకదంతం అంటే బావుండదేమోనని..."

"సరిసరే విషయం చెప్పండి"

"మరేం లేదు. మీ యింటికి ఆరో యింట్లో మా మేనల్లుడు పురుషోత్తం ఉంటాడు. రాత్రి పదకొండు తరువాత ఫోన్ చేస్తే డబ్బులు తగ్గుతాయి కాబట్టి ఇప్పుడు చేస్తున్నాను. ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. నేను రేపు మళ్ళీ ఇదే టైముకి ఫోన్ చేస్తాను. కాస్త ఫోన్ దగ్గరుండమని చెప్పగలరా?" అంటూ కట్ అయింది.

ఏకదంతానికి తల తిరిగి పోయింది.

కొన్ని అనుబంధాలకి కొన్ని అత్యవసరాలకి ఫోన్ చాలా ఉపయోగపడ్తుందని భావించి ఫోన్ వేయించాడు. యింట్లో అటు చెంబు ఇటు పెట్టని మనిషి ఈ ఫోన్ల తాకిడితో ఎవరెవరికో ఏ రాత్రి వేళ సమాచారం అందించవలసి వస్తోంది. ఆఫీసు నుండి రాగానే కాసేపు విశ్రాంతి తీసుకునే వాడు ఇప్పుడు అవకాశం కూడా లేకుండా ఊరందరూ ఫోనొస్తుందని కుర్చీలు సోఫాలే కాకుండా మంచం మీద కూడా కూర్చుండి పోతున్నారు. ఈ ఫోన్ తన కంటే ఇతరులకే ఎక్కువ ఉపయోగపడుతున్నట్టుంది అన్న ఆలోచనతో రిసీవరు తీసి బైట పెట్టి హాయిగా నిద్రపోయాడు ఏకదంతం.

తెల్లవారింది.

బాత్రూంలో ఉన్న ఏకదంతానికి రింగ్ వినిపించింది.

ఎంగిలి బ్రష్ ఒక చేత్తో పట్టుకుని మరో చేత్తో రిసీవరెత్తి "హలో" అన్నాడు.

అట్నుంచి ఏం సమాచారం వచ్చిందో మరి వెంటనే ఫోన్ కనక్షను తీసి, నూతన గృహ ప్రవేశ సమయంలో వాకిట్లో దిష్టి గుమ్మడికాయలు పగల కొట్టినట్టు నేలకేసి కొట్టాడు.

సరిగ్గా అప్పుడే-

"ఏమండోయ్ నిన్న సాయత్రం మీరు లేనప్పుడు మీ ఎం.డి.గారు ఫోన్ చేశారు. ఇవాళ ఎనిమిది గంటలకి ఫోన్ దగ్గరుండమన్నారు. ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలట" వంటింట్లోంచి అంది నీలవేణి.

# కుటుంబంలో-

# కైఫీ ఆజ్మీ



**సాహిర్ లుధియాన్వీతో 'ప్యాసా' వంటి కళాఖండాన్ని నిర్మించిన గురుదత్ అతనితో విడిపోయాక తన తర్వాతి చిత్రం 'కాగజ్ కే ఫూల్'కు గీత రచయితగా ఎంచుకున్నది ఎవరిని? - కైఫీ ఆజ్మీని.**

**చేతన్ ఆనంద్ వంటి ప్రపంచశ్రేణి నిర్మాత-దర్శకుడు తన చిత్రాలకు పాటలను రాసేందుకు ఎన్నుకున్నది ఎవరిని? -కైఫీ ఆజ్మీని.**

**కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా, వాసికెక్కిన ఉర్దూకవిగా, భావగర్భితమైన సినీగీత రచయితగా కైఫీ ఆజ్మీ సుప్రసిద్ధుడు.**

**ఆయన సతీమణి షౌకత్ రంగస్థల కళాకారిణి.**

**కూతురు షబానా ఆజ్మీ సినీనటి. కొడుకు బాబా ఆజ్మీ సినీ ఛాయాగ్రాహకుడు. కోడలు తన్వీ కూడా నటీమణియే.**

ఇంతమంది కళాకారులున్న కుటుంబంలో ఒకరితో ఒకరికి గల సంబంధ బాంధవ్యాలు ఎలా ఉంటాయి? కుటుంబ పెద్దగా కైఫీ ఇతరులతో ఎలా మెలిగేవారు?

కైఫీ పూర్తిస్థాయి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త. బొంబాయిలో ఇల్లు కూడా లేదు. పార్టీ ఆఫీసులో ఒకే ఒక్క గదిలో యావన్మంది కుటుంబ సభ్యులూ నివసించేవారు. ఆ ఆఫీసులో పని చేసే ఇతర కామ్రేడ్స్‌కీ అదే పరిస్థితి. బాత్‌రూమ్‌లు, టాయిలెట్‌లు అందరూ ఉమ్మడిగా వాడుకోవలసినదే. వారందరూ ఆడవాళ్ళను కూడా ఉద్యోగాలు చేయమని ప్రోత్సహించేవారు. ఇంట్లో ఎవరికి తీరిక ఉంటే వారు పిల్లల్ని చూసేవారు. తన భార్య పృథ్వీ థియేటర్స్ వారి నాటకాల్లో నటిస్తూ ఊళ్ళు తిరుగుతుండే రోజుల్లో - కైఫీ పిల్లలిద్దరి ఆలనా, పాలనా చూసేవారు.

కైఫీ భార్య ఉద్యోగం చేయడానికి ఓ కారణం ఉంది. పార్టీకి పనిచేసే రోజుల్లో కైఫీకి వచ్చేది నెలకు 40 రూ॥లు మాత్రమే. దాంతో తిండి గడవక నాటక రంగాన్ని ఆశ్రయించిందామె. షబానాకు తొమ్మిదేళ్ళ వయస్సు వచ్చేసరికి వాళ్ళ పరిస్థితులు మెరుగుపడ్డాయి- పార్టీ ఆఫీసు నుండి జానకీ కుటీర్‌కి నివాసం మార్చారు. ఆమె ఉద్యోగం చేయకపోయినా ఫర్వాలేదన్న స్థాయి వచ్చినా నాటకరంగంపై మక్కువతో నటించడం కొనసాగించింది.

కైఫీ ఉత్తరప్రదేశ్‌లోని అజమ్ గఢ్ జిల్లాకు చెందినవాడు. భార్యది హైదరాబాదు. వాళ్ళ పెళ్ళయి అర్ధశతాబ్ది దాటినా ఆవిడ హైద్రాబాదు వంట ఈయనకు నచ్చదు. ఎప్పటికీ ఆయనకి యూపీ స్టయిల్లో విడిగా వండి పెట్టాల్సిందే! ఆయన స్వంత ఊరు మిజ్వాన్ లోని బంధువులందరూ దేశ విభజన తర్వాత పాకిస్తాన్ వెళ్ళిపోవడంతో ఆయనకు ఊరితో సంబంధాలు తెగిపోయాయి. 1973లో బ్రెయిన్ హెమరేజి వచ్చినప్పుడు మాత్రం ఆ ఊరిపేరు పలవరించినప్పుడు ఆయన ఇంకా ఆ ఊరిని మరవలేదని అర్థమయింది. డాక్టర్లు వద్దంటున్నా అక్కడకు తీసుకెళ్ళవలసి వచ్చింది కుటుంబసభ్యులకు!

షౌకత్ ముందు కైఫీ కవిత్వంతో ప్రేమలో పడింది. తర్వాత ఆయనతో పడింది! పడింది అనటం కన్నా వేగింది అనడం సబబేమో! కైఫీ వంటి కవికి అనేక మంది అభిమానులు! అందునా ఆడ అభిమానులు మరింత! వాళ్ళందరితో కలిసి భర్తను పంచుకోవడం ఎవరికైనా ఇబ్బందే! కానీ ఆమె దానికి అలవాటుపడింది. ఓ చిన్న సంఘటన ఆమె సహనాన్ని చూపుతుంది- కైఫీ తన భార్య అందాన్ని పొగుడుతూ ఆమెపై ఒక పద్యాన్ని రాశారు. ఒక ముషాయిరాలో ఆయన ఆ పద్యాన్ని చదువుతూండగా ఓ హై-క్లాసు సోషలైట్ లేడీ లేచి నిలబడి 'మీకు తెలుసా? కైఫీ సాబ్ ఈ కవితను నామీదే రాసారు' అని గొప్పలు చెప్పుకోసాగింది. కైఫీ చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు కానీ ఆమెను ఖండించలేదు. చిన్నారి షబానా మాత్రం ఊరుకోలేక పోయింది. 'నీ మీద కాదు, మా అమ్మమీద రాశారు' అని అరిచింది. దాంతో అందరూ చుప్ అయిపోయారు- ఆ లేడీతో సహా! షౌకత్ కూతుర్ని ఇంటికి వచ్చి ముద్దాడినా, అక్కడ మాత్రం 'తప్పు, అలా మాట్లాడకూడదు!' అని మందలించింది.





శోక సముద్రంలో కూతురు, అల్లుడు, భార్య, కోడలు

షబానా ఆజ్మీకి చిన్నప్పుడు వాళ్ళ నాన్నలో గ్లామరేమీ కనబడలేదు. తన స్కూల్లో పిల్లలందరి తండ్రులూ ప్యాంటూ, షర్టు వేసుకుంటూంటే ఈయనేమిట్రా ఇరవై నాలుగ్గంటలూ కుర్తా పైజమా వేసుకుని తిరుగుతాడనిపించేది. వాళ్ళందరికి ఏదో ఉద్యోగమో, వ్యాపారమో ఉంటే తన తండ్రి



అంతిమ యాత్ర

మాత్రం - కవిట! అంటే ఏ పనీ, పాటా లేకుండా గాల్లోకి చూస్తూ కూర్చోడమనా? అని అనిపించేదామెకు. కైఫీ సినిమాలకు పాటలు రాయడం మొదలు పెట్టాక ఆయన పేరు పేపర్లో పడింది. అప్పుడు మాత్రమే షబానాకు వాళ్ళ నాన్న గొప్పవాడనిపించింది. అవును మరి, తన నలభై మంది క్లాసుమేట్స్‌లో తండ్రిపేరు పేపర్లో పడినవాళ్ళు ఎవరూ లేరు!

షబానా చదివిన స్కూల్లో ఓ రూలేమిటంటే తల్లితండ్రులిద్దరికీ ఇంగ్లీషు వచ్చి వుండాలి. కైఫీకి రాదు. ఆయన భార్యకూ రాదు. (ఇంట్లో డాడీ, గీడీ జాన్తానై, 'అబ్బా' అని పిలవడమే) అందువల్ల సర్దార్ జాఫ్రీ భార్య సుల్తానా షబానా తల్లిగానూ, కైఫీ మిత్రుడు మునీష్ నారాయణ్ సక్సేనా షబానా తండ్రిగానూ నటించి ఆమెను స్కూల్లో చేర్చారు. షబానా 10వ తరగతిలో ఉండగా ఓ ఉపద్రవం జరిగింది. వాళ్ళ వైస్ ప్రిన్సిపాల్ ఓ ముషాయిరాకి వెళితే అక్కడ అసలు కైఫీ ఆజ్మీ కనబడ్డాడు. అంతకు ముందు 'పేరెంట్స్‌డే'కు వచ్చిన షబానా తండ్రి (మునీష్ నారాయణ్) వేరేలా ఉన్నాడు. మర్నాడు ఆ ప్రిన్సిపాల్ షబానాను పిలిచి ఆ సంగతే అడిగేసింది. షబానాకు ఏం చెప్పాలో తెలియలేదు. "టైఫాయిడ్ వచ్చి మా నాన్న చిక్కి పోయి మారిపోయాడండీ" అనేసింది - టైఫాయిడ్ వల్ల ఓ పూటలోనే మనుష్యులు మారిపోతారన్నట్టు! ఆ వైస్ ప్రిన్సిపాల్‌కి కవిత్వం పిచ్చి ఉండడంతో షబానా బతికి పోయింది!

షబానా పెద్దయ్యాక జావేద్ అఖ్తర్‌ను పెళ్ళాడింది. జావేద్ అప్పటికే వివాహితుడు. అతని మొదటి భార్య జీవించే ఉంది. ఒక ప్రగతివాది కైఫీ దీనిని ఎలా సమర్థించారన్న ప్రశ్న అందర్నీ వేధిస్తూవుంటుంది. ఓ సందర్భంలో షబానా ఆ విషయం గురించి వివరించింది.- "జావేద్‌తో నా ప్రేమ వ్యవహారం మా అమ్మకు సుతరామూ ఇష్టంలేదు. అతనికి దూరంగా ఉండమని బంధువులందరూ నాపై ఒత్తిడి తెచ్చారు. మా నాన్న ఆమోదం పొందగలిగితే నేను వాళ్ళందరినీ ఎదిరించగలను, కానీ ఆయన కూడా వద్దంటే?గుండెలు చిక్కబట్టుకుని ఓ రోజు అడిగాను, "నాన్నా... జావేద్‌కీ నాకూ సరిపడదంటావా?" అని "జావేద్‌తో కాదు, అతని పరిస్థితులతో సరిపడదంటాను" అన్నాడాయన క్లుప్తంగా. "నిజంగా చెబుతున్నాను నాన్నా, నేను పరిచయం కావడానికి ముందే జావేద్ వైవాహిక జీవితం భగ్నమయిపోయింది" అన్నాను.

ఆయనేమీ మాట్లాడలేదు. నేను నిజం చెబుతున్నానా, అబద్ధం చెబుతున్నానా అని కూపీలు తీయడానికి ప్రయత్నించలేదు. నా మాట నమ్మి నా పెళ్ళికి సమ్మతించారు"

దటీజ్ కైఫీ ఆజ్మీ.... ద ఫాదర్!

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

## కైఫీ జీవిత విశేషాలు

- 1915లో ఉత్తరప్రదేశ్‌లోని ఆజంగఢ్ జిల్లా మిజ్వాన్‌లో జననం.
- అసలు పేరు అఖ్తర్ హుస్సేన్ రిజ్వీ
- 11వ యేట తొలి కవిత
- 19వ యేట కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం
- 28వ యేట ముంబాయి నగరంలో కాలుమోపి, 'మజ్దూర్ మొహల్లా' అనే ఉర్దూ పేపరుకు సంపాదకత్వం, 'కామీజంగ్' అనే పత్రికలో కూడా ఉద్యోగం.
- 1943లో తొలి కవితా సంకలనం 'ఝంకార్' విడుదల
- షహీద్ లతీఫ్ 'బుజ్‌దిల్ (1948) 'రోతే రోతే గుజర్ గయీ రాత్ రే...' పాటతో సినీరంగ ప్రవేశం.
- 'మంథన్'కు డైలాగులు 'గరమ్ హవా'కు స్క్రీన్‌ప్లే, డైలాగులు (జాతీయ బహుమతి గెలుచుకున్నారు) సమకూర్చారు.
- విశ్వభారతీ విశ్వ విద్యాలయం, సాహిత్య ఎకాడెమీ, ఆఫ్రో-ఏషియన్ ఫెలోషిప్‌లు, సోవియట్ ల్యాండ్ నెహ్రూ రివార్డ్, పద్మశ్రీ (తిరిగి ఇచ్చేశారు) ఇలా ఎన్నో సత్కారాలు.
- ఇప్టా (ప్రజానాట్యమండలి)కు స్థాపకులు, అధ్యక్షులు
- బాబ్రీ మసీదు కూల్చివేతపై సయీద్ మీర్జా తీసిన 'నసీమ్'లో పాత్రధారణ
- 82వ యేట ఆస్తమా, గుండె వ్యాధులతో 10-05-02న ఉ॥6-40 గం॥లకు కన్నుమూత.

## ఉర్దూ కవిగా



కైఫీ ఆజ్మీ ఉర్దూ అభ్యుదయ కవుల్లో అగ్రగామి.

తన పందొమ్మిదో ఏటనే కమ్యూనిజాన్ని ఆవాహన చేసి జీవితాంతం కమ్యూనిస్టుగానే కొనసాగిన సిద్ధాంత భీష్ముడు. తూర్పు యూరప్‌దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాల పతనం ఆయనలో ఏ మార్పూ కలిగించ లేకపోయింది. సుమారు నాలుగు సంవత్సరాల క్రితం ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో కమ్యూనిజాన్ని వదిలిపెట్టే ప్రసక్తే లేదని ఘంటాపథంగా తేల్చి చెప్పారు.

ఆయన సినిమా కవిగా ఎంత ప్రసిద్ధుడో అంతకు పదిరెట్లు అభ్యుదయ ఉర్దూ కవిగా లబ్ధ ప్రతిష్టులు. ఝంకార్, ఆఖిర్ - ఇ - షాబ్, ఆవారా సిజ్దే సర్మాయా అనే నాలుగు కవితా సంకలనాలను వెలువరించారు. హిందూస్తాన్ హమారా అనే వివిధ కవుల కవితా సంకలనంలో ఆయనవే ఎనిమిది కవితలు చోటుచేసుకున్నాయి. ఆయనకు పేరు తెచ్చిన ఉర్దూ కవితల్లో 1)ఖిలాఅహ్మద్ నగర్ 2) కిరణ్ (గాంధీ నెహ్రూల భేటీ) 3) ఆఖిరీ మర్‌హలా 4) బుత్‌షికనీ 5) ఫర్జ్ 6) సరోజినీ నాయుడు 7) మసీహా ముఖ్యమైనవి.

మసీహా తత్వవేత్తల గురించి - ముఖ్యంగా సోక్రటీసు గురించి రాసినది. బాబ్రీ మసీదు కూల్చి వేతకు గురయినపుడు రాముడు రెండవసారి వనవాసం వెళ్ళాడు అంటూ (దూస్‌రా బన్‌వాస్) ఒక కవిత రాశాడు. ఆయనకు హిందూ మిథాలజీ కూడా బాగా తెలుసు. బహురూపిణి కవిత

## కైఫీ ఆజ్మీ సినిమా పాటలు కొన్ని...

| పాట | సినిమా |
|---|---|
| 1. వక్త్ నే కియా క్యా హసీన్ సితమ్ | కాగజ్ కే ఫూల్ (1959) |
| 2. హోకే మజ్‌బూర్ ముఝే | హకీకత్ (1954) |
| 3. ఏ రాత్ హై ప్యాసీ ప్యాసీ | ఛోటీ బహు (1971) |
| 4. మిలేనా ఫూల్ | అనోఖీరాత్ (1968) |
| 5. జానేక్యా ఢూంఢ్‌తీ రహతీ హై | షోలా ఔర్ షబ్నమ్ (1961) |
| 6. చల్తే చల్తే | పాకీజా (1971) |
| 7. బదల్ జాయే అగర్ మాలీ | బహార్ ఫిర్ ఆయేగీ (1971) |
| 8. తుమ్ బిన్ జీవన్ కైసా జీవా | బావర్చీ (1972) |
| 9. ఆజ్‌కీ కాలీ ఘటా | ఉస్కీ కహానీ (1966) |
| 10. నజావో సయ్యా | సాహిబ్ బీబీ ఔర్ గులామ్ (1962) |
| 11. ఏ దునియా ఏ మహఫిల్ మేరే కామ్ కీ నహీ! | హీర్ రాంఝా (1970) |
| 12. బహారోం మేరా జీవన్ సవారో | ఆఖ్రీ ఖత్ (1966) |
| 13. యే నయన్ డరే డరే | కోహ్రా (1964) |
| 14. తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో | అర్థ్ (1983) |
| 15. ధీరే ధీరే మచల్ | అనుపమ (1966) |

మిథోపొయిట్రీ ప్రక్రియకు ఉదాహరణగా చెప్పొచ్చు. భగవద్గీతలో శ్రీకృష్ణ ఉవాచ కొంచెం వ్యంగ్యంగా తడిమారు.

నజరానా అనే కవిత ఉర్దూలో ఇలా ప్రారంభమవుతుంది:

తుమ్ పరేషాన్ నహో బాబ్‌కరమ్ వా నకరో
ఔర్ కుఛ్‌దేర్ పుకారూంగా చలే జావూంగా
ఇసీ కూచేమే జహా చాంద్ ఉగా కర్తే హై
షబె తారీఖ్ గుజారూంగా
చలా జావూంగా.

అంటే "వ్యధ చెందకు. కర్మ ప్రారబ్దం అనే మరో అధ్యాయాన్ని తెరవకు. మరికొంతసేపు ఇలా అరిచి అరిచి నా దారిన నేను వెళ్ళిపోతాను. చంద్రుడుదయించే ఈ మురికి వాడల్లో, సందుల్లో, గొందుల్లో చీకటి రాత్రులను గడిపి నిష్క్రమిస్తాను". ఆయన చెప్పుకోదగ్గ ఇతర రచనలు ఆఖిర్ - ఏ - షబ్, ఆవారా సిజ్‌దే, సర్మాయా.

సాంఘిక సమస్యలపై 'ఔరత్', 'మకాన్', 'తెలంగాణా', 'బంగ్లాదేశ్', 'మాస్కో' కవితలు రాసారు. కైఫీ కవితల ఇంగ్లీషు అనువాదాన్ని పెంగ్విన్‌వారు ప్రచురించగా ఐ.కె.గుజ్రాల్ ఆవిష్కరించారు.

ఇటీవలే ఆయన రాసి, ఖయ్యాం సంగీతం సమకూర్చిన 'షగుఫ్తగీ' కాసెట్‌ను మ్యూజిక్ టుడేవారు విడుదల చేసారు.

ఆయన గౌరవార్థమై ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం సుల్తాన్‌పూర్ నుండి ఫూల్‌పూర్‌కి వెళ్ళే దారికి 'కైఫీ ఆజ్మీ హైవే' అని నామకరణం చేసింది. కవిగా ఆయన పొందిన గౌరవం అటువంటిది.

-ఎస్.కె. రామారావు

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. నెత్తావి (బావామరదళ్ళు... నీలిమేఘాలలో)
   ఎ) కొత్త బి) తియ్యని
   సి) తాజా డి) సువాసన
2. ఎల (దేశద్రోహులు... జగమే మారినది)
   ఎ) ఎగిరే బి) భూమి
   సి) కోమలమైన డి) ఆడజాతి
3. భోజ్యం (పవిత్రబంధం - గాంధిపుట్టిన దేశమా)
   ఎ) భుజింపదగినది బి) భోగిందగినది
   సి) భాగింపదగినది డి) ఈయదగినది
4. నిశీథి (దేవదాస్ - ఇది నిశీథి సమయం)
   ఎ) నిరాశపడే బి) నాశనమయే
   సి) ఓడిపోయే డి) రాత్రి
5. యీసు (లేతమనసులు - పిల్లలూ దేవుడూ)
   ఎ) పొగరు బి) కోపము
   సి) ఐశ్వర్యము డి) బలము
6. తారాడు (సితార.. జిలిబిలి పలుకులు)
   ఎ) ప్రేలాడు
   బి) శబ్దము చేయు
   సి) మెరయు
   డి) అటూఇటూ తిరుగు
7. క్రీనీడ (సితార, జిలిబిలి పలుకుల)
   ఎ) క్రిందినీడ బి) క్రీడించునీడ
   సి) నల్లటి నీడ డి) పొడుగైన నీడ
8. అలరులు (సాగర సంగమం... తకిటతధిమి)
   ఎ) పువ్వులు బి) పాటలు
   సి) వానచినుకులు
   డి) అలంకారములు
9. మరీచిక (గీతాంజలి... ఆమని పాడవే)
   ఎ) మాయలేడి బి) ఎండమావి
   సి) కల డి) గాలి
10. తటిల్లత (జగదేకవీరుడు - అతిలోక సుందరి - అందాలలో)
   ఎ) వడ్డాణం బి) ఒడ్డున పెరిగే మొక్క
   సి) మెరుపు డి) దండ

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

జూన్ 2న ఇళయరాజా 60వ ఏట ప్రవేశిస్తున్న సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసం



## "ఆయన లేకుంటే ఆ సినిమా లేదు - ఆ సినిమా లేకుంటే నేను లేను"

# ఇళయరాజా గురించి దర్శకుడు వంశీ

సితార, అన్వేషణ, ప్రేమించు-పెళ్లాడు, లేడీస్ టైలర్, మహర్షి, శ్రీకనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్, ఆలాపన, చెట్టుకింద ప్లీడరు, ఏప్రిల్ ఒకటి విడుదల, డిటెక్టివ్ నారద ఇవన్నీ వంశీ సినిమాలని చెప్పటం అనవసరం. వీటికి సంగీత దర్శకుడు ఇళయరాజా అని ప్రత్యేకంగా చెప్పటం అంతకంటే అనవసరం.

'సీతాకోక చిలుక' సినిమా 'మ్యూజిక్ సిట్టింగ్స్'లో ఉండగా మొదటసారి వంశీ ఇళయరాజాను చూశారు. సినిమాకి వంశీ అసోసియేట్ డైరెక్టర్. అప్పటికే ఇళయరాజాను ఎంతో ఆరాధిస్తున్న వంశీకి ఆయనతో పరిచయ భాగ్యం జరిగింది. ఆ పరిచయాన్ని మరిక వదులు కోలేదు. గట్టిగా పట్టుకున్నారు. పట్టుబట్టి తన సినిమాలకు పాటలు చేయించుకున్నారు.

ఇళయరాజా-వంశీలది ఇరవై రెండు సంవత్సరాల అనుబంధం. వంశీకి ఇళయరాజా అంటే భక్తి. ఇళయరాజాకు వంశీ అంటే వాత్సల్యం. ఆ ఇద్దరి మధ్య అనుబంధం సంగీతమయం. వంశీ ఆత్మను ఇళయరాజా గ్రహించినంతగా మరెవ్వరూ గ్రహించలేదనిపిస్తుంది. రీ రికార్డింగ్ జరుగుతున్నప్పుడు వంశీ ఏం మాట్లాడకపోయినా అతనికి ఏం కావాలో కచ్చితంగా అదే మ్యూజిక్ ఇచ్చేవాడట ఇళయరాజా.

'నువ్వేం చెప్పక్కర్లేదు. నీకేం కావాలో రీల్ చెబుతోంది' అనే వాడట.

తెలుగు సినిమాల్లో ఇంత పొయెటిక్ పార్ట్నర్‌షిప్ ఏర్పడటం బహు అరుదు.

ప్రకాష్ స్టూడియోలో సంగీత దర్శకుడు 'చక్రి'ని 'హాసం' ఇంటర్వ్యూ చేస్తుండగా లోపలికి వచ్చి తనకు తానుగా 'హాసం' పత్రికపట్ల

తనకున్న అభిమానాన్ని వ్యక్తపరిచిన భేషజం లేని దర్శకుడు వంశీ!

ఇళయరాజా జన్మదినం గురించి చెప్పగానే "ఒక్క అరగంట టైమిస్తారా" అంటూ వెంటనే ఇంటికివెళ్లి వెతికి కొన్ని పేపర్లు పంపించారాయన. తరాల తరబడి దాచుకోదగ్గ ఆ విశేషాలు.. ఇదిగో మీ ముందు... వంశీ మాటల్లోనే...

ఇళయరాజాది మధురైకు వంద కిలోమీటర్ల దూరంలో ఉండే పండాపురం అనే చిన్న గ్రామం. ఒక పెద్దకొండ అంచున ఆ ఊరు ఉంటుంది. ఆ కొండ అవతలి పక్క నుండి కేరళ రాష్ట్రం. ఇళయరాజాతో పాటు వెళ్లి ఆ ఊరు చూసొచ్చాను. ఆ ఊరికి కొంతదూరంలో ఉండే మరో పల్లెను చూపిస్తూ 'ఇది భారతీరాజా ఊరు. ఇదిగో ఇక్కడే మేమిద్దరం చిన్నప్పుడు కలిసి తిరిగేవాళ్లం' అని చూపించారు ఇళయరాజా.

ఇళయరాజాది నిరుపేద కుటుంబం. ఆయన తల్లి చక్కగా పాడేదిట. అందువల్ల ఆమెకు పుట్టిన నలుగురు అన్నదమ్ములకు సంగీతం అబ్బింది. ఇళయరాజా మూడోవాడు. పెద్దన్నయ్య పావలర్ వరదరాజన్. కమ్యూనిస్టు భావాలు ఉన్నవాడు. అక్కడి జానపద గీతాలలో విప్లవ సాహిత్యాన్ని అల్లి ఊరూరు తిరిగి పాడేవాడు. ఆయనతో పాటు ముగ్గురు సోదరులు కూడా సైకిళ్ల మీద తిరుగుతుండే వాళ్లు. ఒక్కో పూట ఒక్కో ఊరిలో ఆగడం, పాడటం. వాళ్లిచ్చిన ఐదో పదో సంపాదించుకోవడం ఇదీ పని. ఆ కచేరీల్లో ఇళయరాజా హార్మోనియం వాయించేవాడు. రెండో అన్నయ్య భాస్కర్ డోలక్ వాయించేవాడు. తమ్ముడు గంగై అమరన్ దరువు వేసేవాడు.

అలా కొంతకాలం గడిచాక, అప్పటికే మద్రాస్‌కు వచ్చి సినిమా ప్రయత్నాలు చేస్తున్న భారతీరాజా దగ్గరకు వచ్చారు నలుగురు అన్నదమ్ములూ. భారతీరాజా ఉంటున్న గదికి వాళ్లందరూ రిక్షాలో వెళ్లారట. సినిమాల్లో పనిచేయాలని ఉందని చెప్పారట.

'సినిమాల్లో మ్యూజిక్ అంటే ఒట్టి హార్మోనియం వాయించడం కాదు. చాలా ఇన్‌స్ట్రుమెంట్స్ ఉంటాయి. వాటిలో ఏదైనా నేర్చుకో' అని ఇళయరాజాకు సలహా ఇచ్చాడు భారతీరాజా.

అప్పుడు ఇళయరాజా బాగా ఆలోచించి గిటార్ నేర్చుకోవడం మొదలుపెట్టాడు. అప్పటికే ఆయన జి.కె.వెంకటేష్ దగ్గర కుదురుకున్నాడు.

'పొద్దున నుంచి సాయంత్రం వరకు రికార్డింగ్స్ దగ్గర ఉండేవాణ్ణి. ఎనిమిది గంటలకు ఇల్లు చేరుకొని పన్నెండు దాకా పడుకొని రాత్రి ఒంటి గంట నుంచి తెల్లవారే వరకు గిటార్ వాయించడం ప్రాక్టీసు చేసేవాణ్ణి. చిన్న గది కదా. పైగా రాత్రి పూట సాధన అంటే అందరికీ ఇబ్బంది.

అందుకని వాయించడం మానేసి నొటేషన్ రాయడం మొదలుపెట్టాను అన్నాడాయన.

అలా నొటేషన్ రాయడాన్ని సాధన చేసిన ఇళయరాజా ఆ తర్వాత నొటేషన్ రాయడంలో ఎంత ఖ్యాతి గడించారో అందరికీ తెలిసిందే. పదిహేను నిమిషాల్లో ట్యూన్, అరగంటలో నొటేషన్. నలభై అయిదు నిమిషాల్లో పాట. అంతేకాదు. అలా అర్ధరాత్రుల్లు చేసిన గిటార్ సాధనతోనే ఆయనకు ప్రఖ్యాతమైన ట్రినిటీ మ్యూజిక్ ఆఫ్ లండన్ వారి గోల్డ్‌మెడల్ దక్కింది.

అన్ని విధాలా ఆదరిస్తున్న జి.కె.వెంకటేష్ ఉన్నా, సినిమా సంగీతం మీద బాగా అవగాహన ఉన్నా అవకాశాలు మాత్రం రాలేదు ఇళయరాజాకి. అప్పుడాయన ఒకసారి నిర్మాత 'పంజు అరుణాచలం'ను కలిశాడు. అవకాశం ఇస్తే తన సత్తా చూపిస్తానని చెప్పాడు. పంజు అరుణాచలంకు నమ్మకం కుదిరింది. కానీ సినిమా ఇచ్చే ధైర్యం కలుగలేదు. అయినప్పటికీ తన సొంత డబ్బుతో ఒక కళ్యాణ మండపం బుక్ చేసి, ఫుల్ ఆర్కెస్ట్రాను ఇళయరాజాకు ఇచ్చి ఒక మ్యూజికల్ ప్రోగ్రామ్ ఏర్పాటు చేశారు. దానిని ఇళయరాజా కండక్ట్ చేసిన తీరు చూశాక, ఎవరు ఎన్ని అడ్డంకులు కొట్టినా కాదనకుండా తన సినిమాలో అవకాశం ఇచ్చారు. దాని పేరు 'అన్నకిళి'. తొలి సినిమాతోనే ఇళయరాజా ఒక ప్రభంజనమై తమిళనాడును ఒక ఊపు ఊపేశాడు. అప్పటివరకు ఆయన నిర్మాతల వెంట తిరిగాడు. ఆ తర్వాత నిర్మాతలు ఆయన వెంట తిరగడం మొదలు పెట్టారు.



నేను 'మంచుపల్లకి' తీశాను. ఆడింది. కానీ గొప్పగా ఆడలేదు. పేరొచ్చింది. కానీ వెంటనే అవకాశాలు రాలేదు. ఇంకో సినిమా వరకే ఛాన్స్. అది సక్సెస్ కాకపోతే మళ్లీ ఎవరి దగ్గరో అసిస్టెంట్‌గా కుదిరిపోక తప్పదు. అలాంటి పరిస్థితిలో 'సితార' తీసే అవకాశం వచ్చింది. తీశాను. నా సర్వశక్తులు పెట్టి జాగ్రత్తగా తీశాను. డబుల్ పాజిటివ్ తయారయ్యింది. రీ రికార్డింగ్ జరగడానికి మూడు రోజుల ముందు సురేష్‌మహల్‌లో అందరం కూర్చొని చూశాం. పూర్తయ్యేసరికి చాలామంది ముఖంలో ఎక్స్‌ప్రెషన్ లేదు. కొంతమంది పెదవి విరిచారు.

సినిమాల్లో సంభాషణలే లేవు

సైలెన్స్ ఎక్కువగా ఉంది

దాంతో బోర్‌కొడుతోంది.... రకరకాలుగా...

నిర్మాత ఏడిద నాగేశ్వరరావుగారు కూడా డల్ అయిపోయారు. 17 లక్షల పెట్టుబడి, సినిమా అటు ఇటు అయితే మొత్తం గోవింద. డబ్బు కంటే ముఖ్యంగా 'శంకరాభరణం', 'సాగరసంగమం'లతో వచ్చిన పేరుకు నష్టం. ఇదంతా గమనించిన నాకు ఆ రాత్రి నిద్ర లేదు. ఏంటి పరిస్థితి? ఏంటి ఇలాంటి కామెంట్స్ వస్తున్నాయి? బాగా తీయలేదా అని ఒకటే బెంగ. రేపు రీరికార్డింగ్ జరుగుతుందనగా ఇవాళ ఇళయరాజా డబుల్ పాజిటివ్ చూశాడు. చూస్తున్నంత సేపు ఏమీ మాట్లాడలేదు. మొత్తం అయ్యాక నన్ను బయటకి పిలిచి షేక్ హ్యాండ్ ఇచ్చాడు. "బ్రహ్మాండంగా తీశావు, చూడు దీనికి మ్యూజిక్ ఎలా చేస్తానో?" అన్నాడు సవాలుగా.

సాధారణంగా ఆయన ఆ మాట అనడట. అలా ఆయన ఆమాట అనడంతో నా ప్రాణం లేచొచ్చింది. నిర్మాత మొఖంలో వెలుగొచ్చింది. ఆ మరుసటి రోజు నుంచి ఒకో రీలు రీ రికార్డింగ్ జరుగుతుంటే ఒక అద్భుతం తెర మీద సాక్షాత్కరిస్తున్నట్టు అందరూ నోరు తెరిచి చూస్తుండి పోయారు. మద్రాసులో టాక్ ఆఫ్ ది టౌన్ అయ్యిందా సినిమా. రిలీజయ్యాక అంతే సంచలనం సృష్టించింది. నిజానికి ఇళయరాజా లేకపోతే ఆ సినిమా లేదు. ఆ సినిమా లేకపోతే నేను లేను.

అప్పట్నించి ఇళయరాజా నన్ను ఇష్టపడ్డాడు. వ్యక్తిగా కంటే టెక్నీషియన్‌గా. ఆయన నా కంటే కూడా నాలోని టెక్నీషియన్‌కే మంచి స్నేహితుడు. నన్ను ఒరే అనేవాడు. ఏమప్పా అని పిలిచేవాడు. ఎంత ప్రేమించాడంటే 'అంధా కానూన్' నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావుకు పరిచయం చేసి, ఇతడు హిందీలో కూడా మంచి సినిమా తీయగలడు అని రెకమండ్ చేసి వాళ్ల ఆఫీసుకు పంపించాడు. అంతేకాదు తను నిర్మాతగా 'ఇళయరాజా పిక్చర్స్' బ్యానర్ మీద ఒక సినిమా తీయడానికి నన్ను దర్శకుడిగా పెట్టుకున్నాడు. వాళ్లన్నయ్య భాస్కర్‌చేత అడ్వాన్స్ కూడా ఇప్పించాడు. ఆ సినిమా పేరు 'సౌందర్యలహరి'. దురదృష్టం. ఆ రెండు ప్రాజెక్ట్‌లూ వర్కవుట్ కాలేదు.

'సితార' తర్వాత ఫారెస్ట్ బ్యాక్ డ్రాప్‌తో ఒక సినిమా తీయాలనుకున్నాను. అరకులో కూర్చుని పదిహేను రోజుల పాటు స్క్రిప్ట్ రాసుకున్నాను. పచ్చటి ఫైల్‌లో ఆ కాగితాలు పెట్టుకున్నాను. మద్రాసు రాగానే ఇళయరాజా డేట్సు వెంటనే దొరకడం వల్ల ఇద్దరం కలిసి మధురై వెళ్లాం. ఆ ఊరికి దూరంగా ఉండే 'హోటల్ తమిళనాడు'లోని ఒక సూట్ ఇళయరాజాకు ఇష్టం. అందులోనే మ్యూజిక్ సిట్టింగ్స్‌కి కూర్చుందామని అనుకున్నాం. హోటల్ చేరుకున్నాక ఆ ఉదయం నా రూములో విశ్రాంతిగా పడుకొని ఉంటే రాజాగారి అసిస్టెంటు వచ్చాడు.

"ఏంటి పడుకున్నావు. ఆయన హార్మోనియం పెట్టెను ముందేసుకొని కూర్చుని ఉన్నాడు. నిన్ను రమ్మంటున్నాడు" అన్నాడు.

ఉలిక్కిపడి లేచి సిద్ధమయ్యాను. పెట్టె తెరిచి చూస్తే గుండె ఆగినంత పని. స్క్రిప్ట్ ఫైల్ లేదు. పచ్చటి ఫైలే పెట్టుకున్నాముగానీ అదీ ట్రీట్‌మెంట్ ఫైలు. అసలు ఫైలు అరకులో మర్చిపోయాను. సరే ఏమైతే అదవుతుందని వెళ్లాను.

కథ చెప్పు అన్నాడు.

నోటికొచ్చింది చెప్పాను.

ఏమిటో కాస్త గందరగోళంగా ఉంది. సిట్యుయేషన్స్ చెప్పు అన్నాడు.

నోటికొచ్చినవి చెప్పాను.

ఒక్కో సిట్యుయేషన్‌కీ ఒక్కో అద్భుతమైన ట్యూన్ కట్టాడు. మహాభాగ్యం అనుకున్నాను.

మద్రాసు వచ్చేశాం. అది ఇందిరాగాంధీ చనిపోయిన టైము. షూటింగులు జరగడం లేదు. కొంత టైము దొరికింది. ఆ టైములో కూర్చుని ఆయన కట్టిన ట్యూన్‌లకు అనుగుణంగా తిరిగి కథ రాసుకున్నాను. ఆ సినిమా పేరు 'అన్వేషణ'. ఇదీ ఆ సినిమా పాటల వెనకున్న కథ.

చాలామందికి ఇళయరాజా అగ్నిహోత్రుడు. నాకు మాత్రం వెలుగు వెన్నెల గోదావరి. 'ప్రేమించు - పెళ్లాడు' సినిమా ఒప్పుకున్నాను. కానీ చివరి నిమిషం వరకూ మ్యూజిక్ డైరెక్టర్ ఖరారు కాలేదు. నిర్మాతగారేమో ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంను గానీ, సత్యంనుగానీ పెట్టమని అడిగారు. నేనేమో ఇళయరాజానే కావాలని పట్టుపట్టాను. ఈ గొడవలో టైము దగ్గర

పడిపోయింది. చివరకు నా మాటే నెగ్గింది. ఇళయరాజా పేరు ఖరారయ్యింది. కానీ ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇళయరాజా దొరకడు గదా. దొరికించుకోవడానికి వెళ్లాను. తప్పనిసరిగా నాకోసం చేయాలి అన్నాను. ఎక్కడికీ వెళ్లేంత టైము లేదు. మద్రాసులోనే కూర్చున్నాడాయన. మొత్తం నలభై అయిదు నిమిషాల్లో ఆ పాటల ట్యూన్లు కట్టాడు. వాటిని విన్నవాళ్లు ఎవరూ ఆ విషయం నమ్మలేదు. ఇది నిజం. ఈ ట్యూన్లన్నీ రెప్పపాటు కాలంలో రెడీ అయినవే. నా సినిమాలన్నింటిలో ఈ సినిమా పాటలు బెస్ట్ అని అనుకుంటూ ఉంటాను.

ఇళయరాజా తక్కువ మాట్లాడుతాడు . సాత్విక ఆహారం భుజిస్తాడు. భక్తి ఎక్కువ. ఇరువై నాల్గుగంటలూ బిజీగా ఉంచే సినిమా లోకం నుంచి విముక్తి కోసం ప్రతి పౌర్ణమి నాడు తిరువణ్ణామలై వెళతాడు. ఆ రోజంతా అక్కడే ప్రశాంతంగా గడుపుతాడు. మళ్లీ మరుసటి రోజు నుంచి రికార్డింగ్స్‌కు ఫ్రెష్‌గా హాజరవుతాడు. ఆయనేదైనా సినిమా మ్యూజిక్ చేస్తున్నప్పుడు ఆ సినిమా తనకు నచ్చకపోతే సినిమా బాగాలేదు అనేవాడు కాదు. స్క్రిప్ట్ బాగా లేదు అనేవాడు. స్క్రిప్ట్ బాగాలేనప్పుడు సినిమా ఎలా బాగుంటుంది? నేను తీసిన డిటెక్టివ్ నారద డబుల్ పాజిటివ్ చూస్తూ - 'ఫలానా చోట ఫలానా షాట్ తీశావే.... ఆ ఒక్క షాట్ మీదే సినిమా మొత్తం తీయొచ్చు. అదొక్కటే నాకు నచ్చింది' అన్నాడు.

ఇళయరాజా కుటుంబ సభ్యులందరూ నాకు బాగా పరిచయం. ఆయన ఇద్దరబ్బాయిలు, అమ్మాయి భవతారిణి నన్ను గౌరవించేవారు. ఇళయరాజా ఒకర్ని గౌరవిస్తున్నాడంటే అతడు అందరూ గౌరవించదగ్గ మనిషని వాళ్ల భావం. ఒకసారి వాళ్ల ఇంటికి వెళ్లాను. ఇది చాలా ఏళ్ల క్రితం మాట. ఆయన దగ్గర ఒక పెద్ద ఆడియో సిస్టమ్ ఉండేది. చెయ్యెత్తు స్పీకర్లు. అప్పట్లోనే రిమోట్‌తో ఆపరేట్ చేసే సౌకర్యం ఉండేది. లక్ష రూపాయలు పెట్టి కొన్నాడట. 'చాలా బాగుందే' అన్నాను. 'తీసుకోమ్మా' అని వెంటనే వాళ్ల బావమరిది చేత మా యింటికి పంపాడు. ఇళయరాజా హాబీ ఫొటోగ్రఫీ. ఆయన దగ్గర విలువైన కెమెరాలు ఉండేవి. ఏదైనా 'కెమెరా బాగుందే' అంటే ఇచ్చేసేవాడు. నేను ఏదడిగినా కాదనేవాడు కాదు. ఒకోసారి దర్శకుడిగా, ఒకోసారి తమ్ముడిగా, ఒకోసారి చిన్నపిల్లాడిగా నేనాయనకు కనిపించేవాణ్ణేమో...

'చెట్టు కింద ప్లీడరు'లో రాజేంద్రప్రసాద్ దగ్గర ఒక డొక్కు కారుంటుంది. అది ఆగినప్పుడల్లా పాత సామాన్లు కొనేవాడొకడొచ్చి వేధిస్తూ ఉంటాడు. వాడెప్పుడో ఊడి పడతాడో తెలియదు. ఒకసారి హీరో హీరోయిన్లు దూర ప్రయాణం చేస్తుంటే కారాగిపోతుంది. కూలీలు రోడ్డేస్తుంటారు. పాత సామాన్ల వాడు ఎప్పుడొస్తాడో అన్న భయం. 'అక్కడొక పాట పెడితే ఎలా ఉంటుంది' అన్నాను. ఇళయరాజా ఎంత ఎగ్జయిట్ అయ్యాడో చెప్పలేను. 'భలే తమాషా సిట్యుయేషన్. మంచి పాట పెడదాం' అన్నాడు. ఆ పాట ఎంత హిట్ అయ్యిందో తెలుసుకదా.

ఆ 'చలీకానామ్ గాడీ' పాటలో కూలీలు రోడ్డేసే దృశ్యాలకు అనువుగా ఇళయరాజా ఇచ్చిన బీట్‌ను ఎవరు మర్చిపోగలరు...!?

నేను ఇళయరాజాను నా సినిమాలు చేసేటప్పుడు మాత్రమే కలవను. ఇతరుల సినిమాలు చేసేటప్పుడు కూడా కలుస్తాను. ఆయన రీరికార్డింగ్‌లోని ఏదైనా థీమ్ మ్యూజిక్ నాకు నచ్చితే గుర్తుపెట్టుకొని ఆ ట్యూన్‌లో పాట కట్టించుకునే వాణ్ణి. 'స్వాతిముత్యం'లోని థీమ్ మ్యూజిక్‌తో శ్రీ కనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్‌లో ఒక పాట చేయించుకున్నాను.

(ఈసారి స్వాతిముత్యం చూసేటప్పుడు థీమ్ మ్యూజిక్‌ను గమనించండి. ఆ తర్వాత శ్రీ కనకమహాలక్ష్మి డాన్స్ ట్రూప్‌లోని 'ఏనాడు విడిపోని ముడివేసెనో' పాట వినండి. రెండూ ఒకటే అని మీకు తెలుస్తాయి.)

ఇళయరాజా నాకు చేసిన పాటలు కొన్ని మీరు వినలేదు. ఎందుకంటే వాటిని నా సినిమాల్లో వాడలేదు కాబట్టి. 'మహర్షి' కోసం ఆయన చేసిన రెండు మంచి పాటలు నా దగ్గర అలాగే ఉండిపోయాయి. 'ఆలాపన' కోసం చేసిన ఒక అద్భుతమైన పాట కూడా అలాగే ఉంది. బాలూగారు గానం చేసిన తన పాటల్లో అది బెస్ట్ సాంగ్ అని ఇళయరాజా మెచ్చుకునేవాడు.

ఇళయరాజాకు నా మీద ప్రత్యేక అభిమానం ఉందనడానికి యింకో ఉదాహరణ చెబుతాను. ఒకసారి ఏదో క్రికెట్ మ్యాచ్ చూడటానికి మద్రాస్ వచ్చారు లతా మంగేష్కర్. ఆ సంగతి ఇళయరాజాకు తెలిసింది. వెంటనే



నన్ను పిలిపించి - లతాజీ ఇక్కడే ఉన్నారు. వెంటనే ఏదైనా సినిమా ఉంటే చెప్పు. పాటలు కంపోజ్ చేసి పాడిద్దాం. చాలా ఏళ్ల క్రితం ఆమె తెలుగులో పాడారు. మళ్లీ నీ సినిమాలో పాడితే బాగుంటుంది అన్నాడు. ఆ సలహాకు నేను తబ్బిబ్బై నేను తీయాలనుకున్న 'గాలికొండపురం రైల్వేగేటు'కు రెండు పాటలు రికార్డు చేయించాను. ఆ సినిమా తీయలేదు కాబట్టి వాటిని వినే అవకాశం శ్రోతలకు రాలేదు. ఇది జరిగిన కొంత కాలం తర్వాత 'ఆఖరి పోరాటం'లో ఆమె పాడిన వేరే పాటను వినగలిగారు మన వాళ్లు.

తన పల్లెలో ఉన్నప్పుడు ఇళయరాజా ఒక మురళీగానం వినేవాడట. అబ్బ ఎంత గొప్పగా ఉంది ఈ మురళీ గానం - ఎప్పటికైనా నేనిలా వాయించగలనా అని అనుకునేవాడట. ఆయన మద్రాసు వచ్చి పెద్ద మ్యూజిక్ డైరెక్టర్ అయ్యాక మళ్లీ తన ఊరు వెళ్లినప్పుడు తిరిగి అదే మురళీగానం విన్నారట. అబ్బ.... ఏమిటి యింత తప్పుగా వాయిస్తున్నాడు అని ఆశ్చర్యపోయాడట. వాస్తవానికి అతడి మురళీనాదంలో మార్పులేదు. మార్పల్లా ఇళయరాజాలోనే. ఆయన ఎదుగుదలలోనే. ఎవరికైనా ఆత్మికమైన ఎదుగుదల ముఖ్యం అని రాజా భావిస్తాడు.

ఇళయరాజాకు సెంటిమెంట్స్ ఎక్కువ. ముహూర్తాలను, శకునాలను నమ్ముతాడాయన. అలాగే తనకిష్టమైన వాటిని వదులుకోడు. ఒకసారి ఇళయరాజా గారి అబ్బాయి చిన్న పిల్లాడిగా ఉన్నప్పుడు రికార్డింగ్ థియేటర్‌కు వచ్చి పొరపాటున రాజాగారి 'హార్మోనియం పెట్టెను కాలితో నెట్టాడట. అది చూసి ఇళయరాజా నొచ్చుకుంటూ 'అలా చేయకూడదమ్మా. చాలా ఏళ్ల క్రితం రెండు వందలు పెట్టి కొన్న హార్మోనియం పెట్టె అది. కన్నతల్లి లాంటిది' అన్నాడట. ఇప్పటికీ రాజా ఆ హార్మోనియం పెట్టె మీదే బాణీలు వినిపిస్తాడు. ఆయన సెంటిమెంట్ అలాంటిది.

నాకు సలిల్‌చౌదరి అంటే ఇష్టం. ఎస్.పి.కోదండపాణి అంటే ఇష్టం. వీళ్లిద్దరికన్నా ఇళయరాజా అంటే ఇంకా ఇష్టం. నేనొక సినిమా చేస్తున్నానంటే ఇళయరాజా ఉంటేనే చేయగలను. 'జోకర్' సినిమా తీస్తున్నప్పుడు నా పరిస్థితి వేరు. అప్పటికే ఫ్లాప్స్ ఇచ్చాను. అంతేగాక జోకర్‌కు పెద్ద బడ్జెట్ లేదు కూడా. ఇళయరాజా డిమాండ్ చేసే రెమ్యూనరేషన్‌ను తట్టుకునే పరిస్థితిలో నిర్మాత లేడు. ఆయన లేక, వేరేవాళ్లతో చేయలేక ఇక తప్పనిసరి పరిస్థితిలో నేనే సంగీత దర్శకుడిగా మారాను. ఇప్పటికే కాదు ఎప్పటికైనా నా పాటలు అంటే ఇళయరాజా పాటలే. నా సినిమా అంటే ఇళయరాజా సినిమానే' అంటూ ముగించారు వంశీ.

## సితార

రచన : వేటూరి గానం : జానకి,బాలసుబ్రహ్మణ్యం

ఆ: జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓ మైనా మైనా
కిలకిల నగవుల వలపులు చిలికిన ఓ మైనా మైనా
మిలమిల మెరిసిన తార మిన్నుల విడిన సితార ॥మిల॥
మధువుల పెదవుల మమతలు విరిసిన ఓ మైనా ఓ మైనా
కలలను పెంచకు కలతను దాచకు
ఏమైనా ఓమైనా ॥జిలిబిలి॥
అ: అడగనులే చిరునామా ఓమైనా ఓమైనా
చిరునవ్వే పుట్టిల్లు నీకైనా నాకైనా
తారలకే సిగపువ్వా తారాడే సిరిమువ్వ ॥తారలకే॥
హరివిల్లు రంగుల్లో వర్ణాలే
చిలికిన చిలకవు ఉలకవు పలకవు
ఓమైనా ఏమైనా ॥జిలిబిలి॥
ఆ: ఉరుములలో అలికిడిలా వినిపించే ఏమైనా
మెరుపులలో నిలకడగా కనిపించే ఏమైనా
ఎండలకే అల్లాడి వెన్నెలలో క్రీనీడ ॥ఎండలకే॥
వినువీధి వీణల్లో రాగంలా
ఆశల ముంగిట ఊహల ముగ్గులు నిలిపేనా ఏమైనా
అ: జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా మైనా
ఆ: తొలకరి వయసుల మిణుగురు సొగసులదీ మైనా మైనా
అ: మిలమిల మెరిసిన తార మిన్నుల విడిన సితార
ఆ: గుడికే చేరని దీపం పడమటి సంధ్యారాగం
అ: మధువుల పెదవుల మమతలు విరిసిన ఓమైనా ఓమైనా
ఆ: చుక్కలు అందక దిక్కుల దాగిన
నేనేలే ఆ మైనా ॥జిలిబిలి॥

## ఓ పాపాలాలి

రచన : రాజశ్రీ గానం : బాలు

ప: మాటేరాని చిన్నదాని కళ్ళు పలికే ఊసులూ
అందాలన్ని పల్లవించి ఆలపించే పాటలూ
ప్రేమే నాకు పంచే జ్ఞాపకాలురా
రేగే మూగ తలపే వలపు పంటరా ॥మాటే॥
చ: వెన్నెలల్లె పూలు విరిసి తేనెలు చిలికెను
చెంతచేరి ఆదమరిచి ప్రేమలు కొసరెను
చందనాలు జల్లు కురిసె చూపులు కలిసెను
చందమామ పట్టపగలే నింగిని పొడిచెను
కన్నెపిల్ల కలలే నాకిక లోకం
సన్నజాజి కళలే మోహనరాగం
చిలకల పలుకులు అలకల ఉలుకులు
నాచెలి సొగసులు నన్నే మరిపించే ॥మాటే॥
చ: ముద్దబంతి లేత నవ్వులు చిందేను మధువులు
ఊసులాడు మేనివగలు వన్నెల జిలుగులు
హరివిల్లులోని రంగులు నాచెలి సొగసులు
వేకువల మేలుకొలుపే నా చెలి పిలుపులు
సందెవేళ పలికే నాలో పల్లవి
సంతసాల సిరులే నావే అన్నవి
ముసిముసి తలపులు తరగని వలపులు
నాచెలి సొగసులు అన్నీ ఇక నావే ॥మాటే॥

## అన్వేషణ

రచన : వేటూరి గానం : బాలు, జానకి

ఆ: సా...నిసరీసాని...సా నిసమగామరి
పదసా...నిసరీసాని...సా...నిసమగామరి
పదససనని రిరిరిస గగగరి మమమగ పా...
సా ని ద ప మ గ రి స ని...
ఆ: కీరవాణి.... చిలకల కొలికిరో పాడవేమే
వలపులే తెలుపగా విరబూసిన ఆశలు
విరితేనెలు జల్లగ అలరులు కురిసిన ఋతువుల
తడిసిన మధురసవాణి.... కీరవాణి ॥చిలకల॥
అ: గరిస పమగ పాని సరిగ రిగస నీద...
ఈ పూలలో అందమై ఈ గాలిలో గంధమై
నా తోటలో చైత్రమై ఈ బాటనే నడచిరా
ఆ: నీ గగనాలలో నే చిరుతారనై
నీ అధరాలలో నే చిరునవ్వునై
స్వరమే లయగా ముగిసే....
సలలిత కలరుత స్వరనుత గతియుత
గమకము తెలియకనే...కీరవాణి
చిలకలా కలకల పాడలేదు - వలపులే తెలుపగా
ఇలరాలిన పూవులు వెదజల్లిన తావుల
అలకిడి ఎరుగని పిలుపుల అలిగిన మంజులవాణి
॥కీరవాణి॥
అ: నీ కన్నుల నీలమై నీ నవ్వుల వెన్నెలై
సంపెంగలా గాలినై తారాడనా నీడనై
ఆ: నీ కవనాలలో నే తొలి ప్రాసనై
నీ జవనాలలో జాజుల వాసనై
ఎదలో ఎదలా కదిలే
పడుచుల మనసుల పంజర
శుకముల పలుకుల తెలియకనే ॥కీరవాణి॥

## సాగరసంగమం

రచన : వేటూరి గానం : బాలు

ప: తకిట తధిమి తకిట తధిమి తందాన
హృదయలయల జతుల గతుల తిల్లానా ॥తకిట॥
తడబడు అడుగుల తప్పని తాళానా
తడిసిన పెదవుల రేగిన రాగానా ॥తడబడు॥
శృతిని లయని ఒకటి చేసి ॥తకిట॥
చ: నరుడి బ్రతుకు నటన ఈశ్వరుడి తలపు ఘటన
ఆ రెంటి నట్టనడుమ నీకెందుకింత తపన ॥నరుడి॥
తెలుసా మనసా నీకిది తెలిసీ అలుసా
తెలిసీ తెలియని ఆశల వయసీ వరసా ॥తెలుసా॥
ఏటిలోని అలల వంటి కంటిలోని కలలు కదిపి
గుండియలను అందియలుగ చేసి ॥తకిట॥
చ: పలుకు రాగ మధురం నీ బ్రతుకు నాట్య శిఖరం
సప్తగిరులుగా వెలిసే సుస్వరాల గోపురం ॥పలుకు॥
అలరులు కురియగ ఆడెనదే
అలకల కులుకల అలమేల్మంగా ॥అలరులు॥
అన్న అన్నమయ్య మాట అచ్చ తేనె తెనుగుపాట
పల్లవించు పదకవితలు పాడీ.... ॥తకిట॥

## గీతాంజలి

రచన : వేటూరి గానం : చిత్ర

ప: జల్లంత కవ్వింత కావాలిలే ఒళ్ళంత తుళ్ళింత రావాలిలే (2)
ఉరుకులో పరుగులో
ఉడుకు వయసు దుడుకుతనము నిలవదు
తొలకరి మెరుపులా ఉలికిపడిన కలికి సొగసు
కొండమ్మ కోనమ్మ మెచ్చిందిలే
ఎండల్లో వెన్నెల్లు తెచ్చిందిలే (2)
చ: వాగులూ వంకలూ గలగలా చిలిపిగా పిలిచినా
గాలులూ వానలూ చిటపటా చినుకులే చిలికినా
మనసు ఆగదూ ఇదేమి అల్లరో
తనువు దాగదూ అదేమి తాకిడో
కోనచాటు కొండమల్లి దేహమంత ముద్దులాడి
వెళ్ళడాయె పనుల్లేని దేవుండెందుకోమరి ॥జల్లంత॥
చ: సందెలో రంగులే నొసటిపై తిలకమే నిలుపగా
తెలితెలి మంచులే తెలియని తపనలే తెలుపగా
వానదేవుడే కళ్ళాపి చల్లగా వాయుదేవుడే ముగ్గేసి వెళ్ళగా
ఈలకొట్టి గుండెలోని ఊసులన్ని తెలుసుకున్న
కొత్తపాట పుట్టుకొచ్చె ఎవరికోసమో ॥జల్లంత॥

## స్వాతిముత్యం

రచన : సి.నారాయణ రెడ్డి గానం : బాలు, జానకి

అ: ఆ...
ఆ: నిసరిమ పనిసరి నిరిరిస నిమపని సా నిపమరిమరి నీసా...
తాననినా...తానాన...తదరీ...నా...
ప/అ:సువ్వి సువ్వి సువ్వాలమ్మా... సీతాలమ్మ...
గువ్వ మువ్వ సవ్వాడల్లే నవ్వాలమ్మ ॥సువ్వీ॥ ఆ: ॥సువ్వి॥
అ: అండదండా ఉండాలని కోదండరాముని నమ్ముకుంటే
ఆ: ॥అండ॥
అ: గుండెలేని మనిషల్లే నిను కొండా కోనలకొదిలేసాడా
ఆ: గుండెలేని మనిషల్లే... అ: ॥గుండె॥
అ: అగ్గిలోన దూకి పువ్వు మొగ్గలాగా తేలిన నువ్వు
నెగ్గేవమ్మా ఒక నాడు నింగీనేల నీతోడు
ఆ: ॥నెగ్గేవమ్మా॥ ॥సువ్వీ॥
అ: చుట్టూ వున్నా చెట్టూ చేమ తోబుట్టువులింకా నీకమ్మా(2)
ఆగక పొంగే కన్నీళ్లే నీ ఆకలి దప్పులు తీర్చేనమ్మా (2)
పట్టిన గ్రహణం విడిచి, నీ బతుకున పున్నమి పండే ఘడియ
వస్తుందమ్మ ఒకనాడు చూస్తున్నాడు పైవాడు
ఆ: వస్తుందా ఆనాడు? చూస్తాడా ఆ పైవాడు
అ: సువ్వీ ... సువ్వీ... సువ్వీ

## ఆదిత్య 369

రచన : వేటూరి గానం : బాలు, జిక్కి, శైలజ

ప: నెరజాణవులే వర వీణవులే కిలికించితాలలో అహహహో...
జాణవులె మృదుపాణివిలె మధు సంతకాలలో
కన్నులలో సరసపు వెన్నెలలే సన్నలలో గుసగుస తెమ్మెరలే
మోవిగని మొగ్గగని మోజు పడిన వేళలో ॥జాణవులె॥
చ: మోమటుదాచి మురిపెము తెంచే లాహిరిలో
అహహ హో... ఒహో హో...
మూగవుగానే మురళిని ఊదే వైఖరిలో
చెలి ఒంపులలో హంపి కళ ఊగే ఉయ్యాల
చెలి పైయ్యదలో తుంగ అలా పొంగే ఈ వేళ
మరియాదకు విరిపానుపు సవరించవేమిరా ॥జాణవులె॥
అ: చీకటి కోపం చెలిమికి లాభం కౌగిలిలో
అహహో హహహో... ఓహోహో హోహోహో
వెన్నెల తాపం వయసుకు ప్రాణం ఈ చలిలో
చెలి నారతిలా హారతిలా నవ్వాలీ వేళ
తొలి సోయగమే ఓ సగము ఇవ్వాలీ వేళ
పరువానికి పగవానికి ఒక న్యాయమింక సాగునా ॥జాణవులే॥

## సీతాకోకచిలక

రచన : వేటూరి గానం : సుశీల, బాలు

ఆ: సాగర సంగమమే ప్రణయ సాగర సంగమమే (2)
కలలే అలలై ఎగసిన కడలికి (2)
కలలో ఇలలో(2)
దొరకని కలయిక ॥సాగర॥
అ: కన్యాకుమారి నీ పదములు నేనే... ఆ... ॥కన్యా॥
కడలి కెరటమై కడిగిన వేళ
సుమ సుకుమారి నీ చూపులకే
తడబడి వరములు అడిగిన వేళా...
ఆ: అలిగిన నా కొల అలుకలు నీలో పులకలురేపి
పువ్వులు విసిరిన పున్నమి రాతిరి నవ్విన వేళా ॥సాగర॥
అ: భారత భారతి పద సన్నిధిలో...
కుల మత సాగర సంగమశృతిలో
నారతి నీవని వలపుల హారతి
హృదయము ప్రమిదగ వెలిగిన వేళా...
ఆ: పరువపు ఉరవడి పరువిడి
నీ ఒడి కన్నుల నీరిడి కలిసిన మనసున
సందెలు కుంకుమ చిందిన వేళా... ॥సాగర॥

## గీతాంజలి

రచన : వేటూరి గానం : బాలు

ప: ఆమని పాడవే హాయిగా
మూగవై పోకు ఈవేళా
రాలేటి పూలా రాగాలతో పూచేటి పూలా గంధాలతో
మంచు తాకి కోయిలా మౌనమైన వేళలా ॥ఆమని॥
చ: వయస్సులో వసంతమే ఉషస్సులా జ్వలించగా
మనస్సులో నిరాశలే రచించెలే మరీచిక
పదాల నా యెద స్వరాల సంపద
తరాల నా కథ క్షణాలదే కదా
గతించిపోవు గాథ నేననీ ॥ఆమని॥
చ: శుకాలతో పికాలతో ధ్వనించిన మధూదయం
దివీభువీ కలా నిజం స్పృశించిన మహోదయం
మరో ప్రపంచమే మరింత చేరువై
నివాళి కోరిన ఉగాది వేళలో
గతించిపోని గాథ నేననీ ॥ఆమని॥

## అభిలాష

రచన : వేటూరి గానం : బాలు, జానకి

ప: యురేకా... తార తతార తతారత్తా...
నవ్వింది మల్లెచెండు నచ్చింది గర్ల్ ఫ్రెండు
దొరికెరా మజాగ ఛాన్సు జరుపుకో భలే రొమాన్సు
యురేకా సకమిక... నీ ముద్దు తీరేదాక ॥నవ్వింది॥
చ: లవ్వు సిగ్నల్ నాకివ్వగానే నవ్వుకున్నాయ్ నా యవ్వనాలే
ఆ నవ్వుతోనే కదిలెయ్యగానే నాటుకున్నయ్ నవనందనాలే
ఓహో చూపుల్లో నీ రూపం కనురెప్పల్లో నీ ప్రాణం
కన్నుకొట్టి కమ్ముకుంట
కాలమంత అమ్ముకుంట రవ్వ (4)
కన్నె ఈడు జున్నులన్నీ జుర్రుకుంటా ॥నవ్వింది॥
చ: కస్సుమన్న ఓ కన్నెపిల్ల యస్సు అంటే ఒక కౌగిలింత
కిస్సులిచ్చి నే కాగిలిస్తే అరె తీరిపోయే నాకున్న చింత
నేను పుట్టిందే నీ కోసం ఈ జన్మంతా నీ ధ్యానం
ముద్దు పెట్టి మొక్కుకుంట మూడు ముళ్ళు వేసుకుంట
ఏడు జన్మలేలుకుంట నేను జంటగ ॥నవ్వింది॥

## జగదేకవీరుడు - అతిలోక సుందరి

రచన : వేటూరి గానం : జానకి, బాలసుబ్రహ్మణ్యం

ఆ: అందాలలో అహో మహోదయం భూలోకమే నవోదయం
పువ్వూ నవ్వూ పులకించే గాలిలో
నింగీ నేలా చుంబించే లాలిలో
ఆనందాల దారే విహారమే
అ: అందాలలో అహో మహోదయం నా చూపుకే శుభోదయం
ఆ: లతా లతా సరాగమాడే సుహాసినీ సుమాలతో
అ: వయస్సుతో వసంతమాడి వరించెలే సరాలతో
ఆ: మిలా మిలా హిమాలే జలా జలా ముత్యాలుగా
అ: తళతళా గళాన తటిల్లతా హారాలుగా
ఆ: చేతులు తాకిన కొండలకే చలనము వచ్చెనులే
అ: ముందుకు సాగిన ముచ్చటలో మువ్వలు పలికెనులే
ఆ: ఒక స్వర్గం తల వంచి ఇలచేరే క్షణాలలో ॥అందాల॥
ఆ: సరస్సులో శరత్తు కోసం తపస్సులే ఫలించగా
అ: సువర్ణికా సుగంధమేదో మనస్సునే హరించగా
ఆ: మరాళినై ఇలాగే మరీమరీ నటించనా
అ: విహారినై ఇవాళే దివీ భువీ స్పృశించనా
ఆ: గ్రహములు పాడిన పల్లవికే జాబిలి వూగెనులే
అ: కొమ్మలు తాకిన ఆమనికే కోయిల పుట్టెనులే
ఆ: ఒక సౌఖ్యం తనువంతా చెలరేగే క్షణాలలో ॥అందాలలో॥

## ఒక రాధ ఇద్దరు కృష్ణులు

రచన : రాజశ్రీ గానం : బాలు, జానకి

ఆ: మధుర మురళి హృదయ రవళి
అధర సుధల యమునపొరలి పొంగే ఎద పొంగే
ఈ బృందావిహారలలోనా నా అందాలు నీవేరా కన్నా ॥ఈ॥
అ: మధుర మురళి హృదయ రవళి ఎదలు కలుపు
ప్రణయ కడలి సాగే సుడిరేగే
ఈ బృందా విహారలోన ఎవరున్నారు రాధమ్మ కన్నా ॥ఈ॥
చ॥ఆ: గోధూళి వేళల్లో గోపెమ్మ కౌగిట్లో
లేలేత వన్నె చిన్నెదోచే వేళల్లో
అ: పున్నాగ తోటల్లో సన్నాయి సందిట్లో
నాజూకులన్నీ నాకే దక్కే వేళల్లో
ఆ: పగలో అవతారం రాత్రోశృంగారం ఎదలో తారంగంశ్రీవారికి
అ: రాగాలెన్నైనా వేణువు ఒకటేలే
రూపాలెన్నైనా హృదయం ఒకటేలే
ఆ: నాదే నీ గీతమూ ఇక నీదే ఈ సరసాల సంగీతం ॥మధుర॥
చ॥ఆ: హేమంత వేళల్లో లేమంచు పందిట్లో
నా వీణ ఉయ్యాలుగే నీలో ఈనాడే
ఆ: కార్తీక వెన్నెల్లో ఏకాంత సీమల్లో
ఆరాధనేదో సాగే అన్నీ నీవాయె
అ: ముద్దేమందారం మనసేమకరందం
సిగ్గే సింధూరం శ్రీదేవికి
ఆ: అందాలెన్నైనా అందేదొకటేలే
ఆరు ఋతువుల్లో ఆమని మనదేలే
అ: పాటే అనురాగమూ మనబాటే
ఓ అందాల అనుబంధం ॥మధుర॥

## శివ

రచన : సీతారామశాస్త్రి గానం : బాలు, శైలజ

ప॥అ: బాటనీ పాఠముంది మ్యాటనీ ఆట ఉంది దేనికో ఓటు చెప్పరా
హిస్టరీ లెక్చరుంది మిస్టరీ పిక్చరుంది సోదరా ఏది బెస్టురా
బాటనీ క్లాసంటె బోరుబోరు హిస్టరీ రొష్టు కన్న రెష్టమేలు
పాటలూ ఫైటులున్న ఫిలిము చూడు
బ్రేకులుడిస్కోలు చూపుతారు
కో: జగడ జగడ జగడ జగడ జాం ॥4॥
చ॥ఆ: దువ్వెనే కోడి జుత్తు నవ్వెనే పడ్డినట్టు ఎవ్వరే కొత్త నవాబు
కన్నెనే చూడనట్టు కన్నులే తేలబెట్టు ఎవ్వరీ వింత గరీబు
జోరుగా వచ్చాడే జేమ్సుబాండు గీరగా వేస్తాడే ఈల సౌండు
నీడలా వెంటాడే జీడిబ్రాండు ఫోజులే చూస్తుంటే ఒళ్ళు మండు
కో: జగడ జగడ జగడ జగడ జాం ॥4॥
అ: అయ్యో మార్చినే తల్చుకుంటే
మూర్ఛలే ముంచుకొచ్చే మార్గమే చెప్పు గురువా
ఏ ఛీ తాళం రాదు మార్చిట మార్చి
తాళంలో పాడరా వెధవా! ॥మార్చి॥
కొండలా కోర్సుఉంది ఎంతకీ తగ్గనంది ఏందిరో ఇంత గొడవ
ఎందుకీ హైరానా వెర్రినాన్న వెళ్ళరా సులువైన దారిలోన
ఆ: ఉందిగా సెప్టెంబరు మార్చిపైన హాయ్ వాయిదా పద్ధతుంది దేనికైనా
చ/అ: మ్యాగ్జిమం మార్కులిచ్చు మ్యాక్సులో ధ్యాస ఉంచు
కొద్దిగా ఒళ్ళు వంచరా ఓరేయ్
ఆ: క్రాఫ్‌పై ఉన్న శ్రద్ధ గ్రాఫ్‌పై పెట్టు కాస్త ఫస్టు ర్యాంకు పొందవచ్చు రోయ్
అ: అరే యేం సార్
లెక్కలు ఎక్కాలు తెల్వనోళ్ళు
లక్కుతోని లచ్చలల్ల మునిగిపోతరు
పుస్తకాల్‌తో కుస్తీలు పట్టేటోళ్ళు
సర్కారీ క్లర్కులైమురిగిపోతరు
కో: జగడ జగడ జగడ జగడ జాం ॥4॥

## ఛాలెంజ్

రచన : వేటూరి గానం : బాలు, జానకి

ప॥ఆ: ఇందువదన కుందరదన మందగమన
మధురవచన గగన జఘన సొగసులలనవే (2)
తొలి వలపే తెలిపే చిలిపి సిగ్గేలనే
చెలి చిగురు తొడిగె వగల మొగ్గేలనే
ఐ లవ్ యూ ఓ హారికా నీ ప్రేమకే జోహారికా॥ఐ॥॥ఇందు॥
చ/అ:కవ్వించే కన్నులలో కాటేసే కలలెన్నో
పకపక నవ్వులలో పండిన వెన్నెలవై నన్నందుకో
ఆ: కసికసి చూపులతో కొసకొస మెరుపులతో నన్నల్లుకో
అ: ముకుళించే పెదవుల్లో మురిపాలు
ఋతువుల్లో మధువంతా సగపాలు
సాహోరే భామా హోయ్ ॥ఇందు॥
చ॥ఆ: మీసంలో మిసమిసలు మోసాలే చేస్తుంటే
బిగిసిన కౌగిలిలో సొగసరి మీగడలే దోచేసుకో
అ: రుసరుస వయసులతో ఎడదల దరువులలో ముద్దాడుకో
ఆ: తొలి పొద్దు ఎండల్లో సరసాలు
తొడగొట్టే పరువంలో ప్రణయాలు
జోహారే ప్రేమ హోయ్ ॥ఇందు॥

జూన్ 2 రెక్స్ వర్ధంతి సందర్భంగా...

# రెక్స్ హారిసన్ బాలీవుడ్ ముచ్చట్లు

భారతదేశంలో కూడా బాగా హిట్ అయి "మన్ పసంద్" (దేవానంద్, టీనామునీమ్, గిరీశ్ కర్నాడ్)కు ప్రేరణ అయిన ఇంగ్లీషు మ్యూజికల్ "మై ఫెయిర్ లేడీ" (1964). పూలమ్మే ఒక పడుచు, ఆమెకు చదువు, సంస్కారం నేర్పి ఆమెతో ప్రేమలో పడే ముదురు బ్రహ్మచారి ఇంగ్లీషు ప్రొఫెసర్ చుట్టూ తిరిగే ఆ కథకు బెర్నార్డ్ షా రచించిన "పిగ్మాలియన్" నాటకం ఆధారం. చాలా ఏళ్ళు స్టేజిమీద ప్రదర్శింపబడ్డాక అది తెరకెక్కి నప్పుడు స్టేజిమీద ప్రొఫెసర్ హిగ్గిన్స్ పాత్ర ధరించిన రెక్స్ హారిసన్‌కే ఆ అవకాశం దక్కింది. (పీటర్ ఓ టూల్‌ని ఆ పాత్ర వేయ మంటే అతను రెక్స్‌నే సూచించాడట) క్లియోపాత్రా (1963)లో ఎలిజబెత్ టేలర్ సరసన సీజర్ పాత్ర కూడా అత్యద్భుతంగా పోషించినా రెక్స్ హారిసన్ అనగానే మనకు గుర్తుకువచ్చేది హిగ్గిన్స్‌గా అతను ఆడి, పాడిన "వై కాంట్ ఎ ఉమన్ బీ లైక్ ఎ మాన్?" వంటి పాటలే!

కృష్ణ షా "షాలిమార్" సినిమా హిందీ, ఇంగ్లీషుల్లో తీసినప్పుడు విలన్ పాత్రకు భారతీయులకు కూడా బాగా పరిచితుడైన ఓ హాలీవుడ్ నటుడికై అన్వేషించినప్పుడు అతని దృష్టి పడినది రెక్స్ మీదనే! రెక్స్ అంగీకరించి షూటింగ్‌కై బెంగుళూరు వస్తున్నాడనగానే "షాలిమార్" యూనిట్ అంతా పొంగి పోయారు. "మై ఫెయిర్ లేడీ" చూసి హిగ్గిన్స్‌ను అభిమానించిన వారంతా నిజజీవితంలో రెక్స్ ఎలా ఉంటాడో చూసి విస్తుపోయారు.

రెక్స్ పద్ధతే అంత. ఎంత ప్రతిభావంతుడైన నటుడో, అంతటి అహంభావి కూడా. వివాదాలలో చిక్కుకోవడంలో అతను వెనుక బడలేదు. 948లో లిల్లీ పామర్ అనే తారకు భర్తగా ఉండే రోజుల్లో (అతను మొత్తం ఆరు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు) కరోల్ లాండిస్ అనే ఇంకో తారతో సంబంధం పెట్టుకున్నాడు. ఆమె ఆత్మహత్య చేసుకోవడంతో అమెరికా వదిలి స్వదేశమైన ఇంగ్లాండుకు పారిపోయాడు. పారిపోయి అతను నటించిన సినిమా పేరు "ఎస్కేప్" (1948)!

1908 మార్చి 5 న ఇంగ్లండులో జన్మించిన రెక్స్ కామెడీ నాటకాలతో తన కెరియర్ ప్రారంభించాడు. లండన్ స్టేజిపై పేరు సంపాదించాక 1936కు బ్రాడ్వేలో నాటకాలాడసాగాడు. అంతకు ముందు కొన్ని సినిమాలలో సహాయపాత్రలు వేసినా హిచ్‌కాక్ టైపు థ్రిల్లర్ "నెక్స్‌ట్ ట్రెన్ టు మ్యూనిక్" (1940)తో అతనికి బాగా గుర్తింపు వచ్చింది. బెర్నార్డ్ షా రాసిన "మేజర్ బార్బరా"(1941) సినిమాలో వెండీ హిల్లర్‌తో కలిసి నటించాడు. ఇలా ఎన్నో చిత్రాలలో వైవిధ్యభరితమైన పాత్రలు ధరించాడు. "స్టెయిర్ కేస్"(1969) సినిమాలో రిచర్డ్ బర్టన్‌తో కలిసి, హోమోగా కూడా నటించాడు. అయితే లన్నిటికన్నా తలమానికమైనది, అతనికి ఆస్కార్ తెచ్చిపెట్టినది "మై ఫెయిర్ లేడీ"యే!



ప్రొఫెసర్ హిగ్గిన్స్‌గా

రెక్స్‌కి కామెడీ అంటే ఇష్టమే కాదు, కామెడీ



'షాలిమార్' యూనిట్‌తో రెక్స్

నటన గురించి, "ఎ డామ్డ్ సీరియస్ బిజినెస్" అనే పుస్తకం (అతను మరణించిన తర్వాత 1990లో విడుదలయింది) రాశాడు. "రెక్స్" అనే పేరుతో ఆత్మకథ కూడా రాసు కున్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం అతని ప్రతిభను గుర్తించి 1989లో "సర్" బిరుదాన్ని ఇచ్చింది కూడా. క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ 1990 జూన్ 2 న 82 వ యేట మరణించాడు. ఇంతటి ఉజ్జ్వలమైన కెరియర్ కలిగిన రెక్స్ "షాలిమార్" సెట్స్ పై ఎలా ప్రవర్తించాడో బున్నీ రూబిన్ అనే పాత్రికేయుడు గ్రంథస్తం చేశాడు.

రెక్స్‌కి తను బ్రిటిష్ జాతీయుడనన్న అహంకారం బాగా ఉందిట. చుట్టూ ఉన్న అందరినీ కస్సు బుస్సు లాడేవాడట. ఇంగ్లీషు సరిగ్గా మాట్లాడలేని వారంటే చిన్న చూపట. పాపం ధర్మేంద్రకు ఇంగ్లీషు అంత బాగా రాదు. షూటింగు టైములో వీపు నొప్పితో బాధ పడుతూ కూడా ఇంగ్లీషు పాఠాలు నేర్చుకునేవాడు. ప్రఖ్యాత నిర్మాత-దర్శకుడు ఓ.పి.రల్హాన్ ఆ సినిమాలో ఓ హాస్య పాత్ర పోషించేవాడు. రాత్రి అతని గదికి వెళ్ళి ఇద్దరూ కలిసి ఉర్దూ లిపిలో ఇంగ్లీషు డైలాగులు రాసుకునేవారు. బెహరోజ్ మోదీ అనే ఆమె వచ్చి వారిచే ఇంగ్లీషు డైలాగులు వల్లె వేయించేది. ఇదంతా ఫారినర్స్‌కి వేళా కోళంగా ఉండేది. ముఖ్యంగా రెక్స్‌కి! ఓ రోజు కృష్ణ షా ను పిలిచి "ఇతని ఇంగ్లీషు డైలాగులు యాసగా ఉన్నాయి. డబ్ చేయిస్తావు కదా!" అన్నాడు. "ఏం అక్కర్లేదు. అమెరికన్లకు యాస అంటే చాలా ఇష్టం. సోఫియా లోరెన్, జినాలోలో బ్రిగిడా ఇటాలియన్ యాసతోనే మాట్లాడి హిట్ అయ్యారు. వీళ్ళదీ అంతే!" అనేవాడు కృష్ణ షా. రెక్స్ మొహం మాడ్చు కున్నాడు.

ఈ ఇంగ్లీషు గొడవ చాలనట్టు షూటింగు మొదలయిన వారం రోజుల్లోనే ధర్మేంద్రకు జలుబు పట్టుకుంది. పాపం ముక్కు ఎగబీలుస్తూ ఉండేవాడు. రెక్స్‌లాటి 'ట్రూ బ్రిటిష్'కి ఇటువంటివి ఎలా ఉంటాయో సులభంగా ఊహించవచ్చు. 'నా కంటికి కనబడకుండా దూరంగా పో' అని ఆర్డరు వేశేవాడు.

ధర్మేంద్రకు ఒళ్ళు మండిపోయి పంజాబీలో తిట్లు లంకించుకునేవాడు (వాటికి ఏ ప్రైవేటు క్లాసులూ అక్కర్లేదు. పంజాబీ అతని మాతృభాష!) సెట్ మీద ఉన్న ఇండియన్లు నవ్వలేక, నవ్వు ఆపుకోలేక చచ్చేవారు!

ముక్తాయింపు ఏమిటంటే - హిందీ 'షాలిమార్' ఏదో ఒకలా ఆడినా ఇంగ్లీషు 'షాలిమార్' ఘోరాతిఘోరంగా ఫ్లాపయింది!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# న్యూస్ ఫ్లాష్

## ఘంటసాల జీవితంపై ఓ డాక్యుమెంటు



అమరగాయకుడు ఘంటసాల జీవితంపై ఓ ఆడియో-విజువల్ ప్రయోగాన్ని భారీ యెత్తున చేపడుతున్నారు ఆయన కుమారుడు ఘంటసాల రత్నకుమార్. గాయకుడిగా, గాత్రదాతగా, అనువాద రచయితగా, గీత రచయితగా, సంగీత దర్శకుడుగా, దర్శకుడిగా, టీవీ ప్రయోక్తగా బహుముఖ ప్రజ్ఞ కనబరచిన రత్నకుమార్‌కు డబ్బింగ్ ఆర్టిస్టుగా 1998లో నంది అవార్డు లభించింది. ఈయన వాల్ట్ డిస్నీవారి సీరియల్స్‌కు తెలుగు సంభాషణలు రాశారు. 3 వేల ఎపిసోడ్లకు అనువాద రచయితగా పనిచేశారు. ఇప్పటికి 1,076 సినిమాలకు, 5 వేలకు పైగా టీవీ ఎపిసోడ్లకు డబ్బింగ్ చెప్పిన రత్నకుమార్ హైదరాబాద్, విజయవాడల్లో త్వరలో 'వాయిస్ ట్రెయినింగ్ స్కూళ్ళు' ప్రారంభిద్దామనుకుంటున్నారు.

## కేసులు కేసులే - వ్యాపారం వ్యాపారమే



ప్రముఖ సంగీత దర్శకుడు అనూ మాలిక్ తన పట్ల అనుచిత రీతిలో ప్రవర్తించారని ఆరేళ్ల క్రితం కేసు పెట్టిన అలీషా-చినాయ్ ఇప్పుడు అతనితోనే కలిసి "ఇష్క్ విష్క్ ప్యార్ వ్యార్" సినిమా కోసం కలిసి పని చేయబోతున్నారు. వారిద్దరి మధ్య సయోధ్య కుదిర్చినది టిప్స్ అధినేత తౌరానీ! ఆయనా ఇటీవలే గుల్షన్ కుమార్ హత్యకేసులోంచి నిర్దోషిగా బయటపడ్డారు. వ్యాపారంలో తనకు ప్రత్యర్థిగా ఉన్న టి-సీరిస్ యజమాని గుల్షన్ కుమార్‌ను చంపడానికి కిరాయిగుండాకు 25 లక్షల రూపాయలిచ్చారని పోలీసులు తౌరానీ మీద అభియోగం మోపారు. ఈయనతో బాటు ఇంకో ప్రధాన నిందితుడు ప్రఖ్యాత సంగీత దర్శకుడు నదీమ్. (నదీమ్-శ్రవణ్ ఫేమ్). టీ-సీరిస్ అండతో పైకి వచ్చిన నదీమ్-శ్రవణ్ దరిమిలా టిప్స్‌తో ఒప్పందం కుదుర్చుకోవడం వల్లన వచ్చిన విభేదాల కారణంగానే గుల్షన్ కుమార్ హత్యకు కుట్ర పన్నాడని నదీమ్‌పై అభియోగం. అప్రూవర్ ఎదురు తిరగడంతో కేసు దెబ్బతింది. లండన్‌లో తల దాచుకున్న నదీమ్ ఇండియాకు తిరిగి వచ్చే అవకాశాలున్నాయంటున్నారు.



## పెప్సీ యాడ్‌లో అద్నాన్‌శామీ



తాజాగా విడుదల కాబోయే పెప్సీ యాడ్ ఫిల్మ్‌లో అద్నాన్ శామీ కనబడతారు. వెనిస్‌లో చిత్రీకరించిన ఈ 60 సెకండ్ల యాడ్‌ఫిల్మ్‌లో శామీతో బాటు షారూఖ్‌ఖాన్, కరీనాకపూర్‌లు కూడా నటించారు. ఈ యాడ్ ప్రత్యేకత ఏమిటంటే దీన్ని ఎలా తీశారో వివరించడానికి ఓ అరగంట సినిమాను కూడా తీశారు.

## టూకీగా

వేరుశెనక్కాయలు అమ్ముకునే స్థాయినుండి పద్మశ్రీ గెలుచుకున్న ఏకైక హాస్యనటి స్థాయికి ఎదిగిన మనోరమకు మే 27న ముంబయ్‌లో భారత్ ఏక్‌తా అసోసియేషన్ వారు ఘన సన్మానం జరిపారు.



బ్రిట్నీ స్పియర్స్ నటించిన తొలి చిత్రం "క్రాస్ రోడ్స్" విడుదలయింది. "ఐ యామ్ నాట్ ఎ గర్ల్, నాట్ యెట్ ఎ వుమన్" ఆల్బమ్ నుండి మూడు పాటలను సినిమాలో సందర్భోచితంగా ఉపయోగించుకోవడం జరిగింది. ముగ్గురు స్నేహితురాళ్ల (తక్కిన ఇద్దరూ యాన్సన్ మౌంట్, జో సల్డానా) మధ్య సాగే ఈ కథ బ్రిట్నీకు యూత్‌లో ఉన్న క్రేజ్ కారణంగా ప్రజలకు నచ్చుతుందంటున్నారు.

మన "పాడుతా తీయగా" స్టైల్లో విజయ్ టీవీలో జులై 2001 నుండి వస్తున్న "అపూర్వరాగంగళ్" షో ఏప్రిల్ నుండి కొత్తరూపంలో వస్తోంది. దీనిలో పాల్గొనే ఔత్సాహిక గాయనీగాయకులు రికార్డింగు సమయంలో అక్కడున్న ప్రముఖ గాయనీ గాయకులతో గొంతు కలిపి పాడగలగాలి. ఫైనల్ రౌండ్ తర్వాత ఈ పాటలన్నీ కలిపి ఒక ఆల్బమ్ కట్ చేస్తారట!

మన సినిమాలో హీరోయిన్లు వట్టి అలంకారప్రాయమే అనే ఫిర్యాదు ఎదుర్కొనేందుకు కాబోలు నభ్ కుమార్ "మౌకా" అనే హిందీ చిత్రం తీయబోతున్నారు. మారిషస్, మలేసియాలలో తీయబోయే ఈ సినిమాల్లో 25 మంది తారామణులుంటారు. మగపాత్రలు మాత్రం నాలుగే నాలుగు!

ఎఫ్.ఎమ్. ఛానెల్స్ బాగా పుంజుకోవడంతో అవి వినే సౌకర్యం ఉన్న ట్రాన్సిస్టర్ల కోసం డిమాండ్ పెరిగింది. ముంబయ్ మార్కెట్లో ఎఫ్.ఎమ్. ఉన్న చైనా ట్రాన్సిస్టర్లు 125 రూ॥ల లోపే దొరకడంతో వాటికి మహా గిరాకీ ఏర్పడిందట.



# రాంపండు లీలలు



## రాంపండూ-షట్గోతులూ

"అచలపతీ! నీకు మరొక్క అవకాశం ఇస్తున్నాను. ఆ బొమ్మకేసి నిదానంగా చూసి నీ అభిప్రాయం మార్చుకో. తక్కిన విషయాలలో నువ్వు ఫరవాలేదనుకో. కానీ ఆర్ట్ విషయంలో కాస్త వీక్. నీ పురాతన భావాలు పక్కనపెట్టి దానిమీద ఫ్రెష్‌లుక్ వేయి".

హితవు చెప్తున్నది అనంత్. అచలపతి అభిప్రాయం మార్చుకోవలసినది రుక్మిణి గీసిన అనంత్ పెయింటింగ్ మీద. సుమనోహరి పుస్తకం గొడవ లేకపోతే రుక్మిణికి అనంత్ బొమ్మవేసే అవకాశమే రాకపోవును!

పబ్లిషరు దొరకడంతో సుమనోహరి పుస్తకం కాస్త ముందంజ వేసింది. ఆ పుస్తకం కవరు పేజీ వేయమని తన ఫ్రెండు రుక్మిణిని అడిగింది సుమనోహరి. ఆ సందర్భంలోనే ఈమెను రాంపండుకి (అనంత్‌కి కూడా) పరిచయం చేసింది.

అప్పటిదాకా ఏ కళాకారుడు (కళాకారిణి అయితే - సమస్యే లేదు) అనంత్‌ను చూసి బొమ్మ వేయడానికి ముచ్చట పడలేదు. కానీ రుక్మిణి పడింది. ఆ ముచ్చట చూసి అనంత్ ముచ్చట పడ్డాడు. పదిరోజుల శ్రమ తర్వాత ఆమె వేసిచ్చిన ఆయిలు పెయింటింగు చూసి మరీ ముచ్చట పడ్డాడు.

కానీ అది అచలపతి అభిశంసనకు గురయ్యింది. ఆ బొమ్మలో ఉన్నవి 'ఆకలి చూపుల'ని అన్నాడతను. అనుకోకుండా ఎముక కలలోకి వచ్చిన కుక్క చూపులతో వాటిని పోల్చవచ్చని కూడా అన్నాడు. దాన్ని ఫ్రేము కట్టించి మెయిన్ హాల్లో పెట్టే అనంత్ ప్రయత్నాలను సున్నితంగానే ప్రతిఘటిస్తున్నాడు.

తన ఆలోచనలను పునర్విమర్శ చేసుకోవాలని ఇప్పుడు అనంత్ మళ్లీ విజ్ఞప్తి చేసినా అది వ్యర్థమయినట్టే ఉంది. ఐదు నిమిషాల దీర్ఘాలోచన తర్వాత అచలపతి తల విదిలించాడు.

తన సహచరుడికి అనంత్ ఇంకో అవకాశం ఇవ్వదలిచేడు. "చూడు, నేను క్లబ్బుకి వెళ్లి ఓ గంట తర్వాత తిరిగి వస్తాను. ఈలోపున బాగా ఆలోచించుకుని, నేనన్నదానికి సరేనను" అని బయటకు వెళ్లిపోయేడు.

గంట తర్వాత తిరిగి వచ్చాక ఆ పెయింటింగు గురించి అనంత్ అడిగే లోపునే అచలపతి చల్లగా ఓ బాంబు పేల్చాడు-

"రాంపండు గారు వచ్చి వెళ్లారు సర్"

రాంపండు వచ్చిన ప్రతీసారి ఏదో ఒక ముప్పును వెంట బెట్టుకురావడం అనంత్‌కి అనుభవానికి వచ్చిన సత్యం. అందువల్ల కాస్త బెదురుతూనే అడిగాడు-

"మళ్లీ వస్తానన్నాడా?"

"అడగలేదండి. సమాధానం చెప్పే మూడ్‌లో లేరండి".

"ఏం పాపం?"

"ఏక్సిడెంటు వల్ల చాలా డిస్టర్బ్ అయినట్టు కనబడ్డారు సర్"

"అయ్యో! ఏక్సిడెంటా? దెబ్బలు తగిలాయా?"

"కొద్దిగా తగిలాయి సర్. ఆయనకు కాదు. ఆయన తెచ్చినాయనకి!"

"ఆయనెవడు? ఎక్కడున్నాడు?"

"మీ బెడ్‌రూమ్‌లో సర్"

అనంత్ వెంటనే అక్కడికి పరిగెట్టాడు. అక్కడ ఓ ఆజానుబాహువు, గిరజాల జుత్తువాడు, అందగాడు, అనంత్ పక్కమీద పవ్వళించి వున్నాడు. సినిమా హీరో స్టయిల్‌లో, నుదిటికి ఈశాన్యమూల ఓ చిన్న ప్లస్ మార్కు పట్టీ ఉంది. కుడి చేత్తో ఓ ఆపిల్ పండు కొరుక్కుతింటూ ఎడం చేతిలో ఓ డిటెక్టివ్ పుస్తకం పట్టుకుని చదువుతున్నాడు. అన్నిటికంటె ఘోరం, అతనూ అనంత్ పైజమా, షర్టు వేసుకుని ఉన్నాడు. అనంత్ అడుగుల చప్పుడు వింటూనే తలెత్తి చూసి పలకరించాడు.

"హాయ్! అనంత్! ఈ పరుపేమిటి? ఇలాంటిది కొన్నావ్?"

అనంత్ వళ్లు వటవటలాడించేడు. "తమరు...?" అన్నాడు వెటకారం ధ్వనిస్తూ.

"ఫల్గుణ్! మీ పనివాడు చెప్పలేదా? వట్టి చవటలా ఉన్నాడే! ఈ పాటికి నా గురించి, నా అనారోగ్యం గురించి అంతా చెప్పే వుంటా

డనుకొన్నానే!"

కోపాన్ని అణుచుకుంటూ అనంత్ అడిగాడు "తమరి అనారోగ్యం అంటే... ఆ పట్టీయేనా?"

"హారినీ! డాక్టరు వచ్చి కనీసం వారం రోజులయినా ఇక్కడ, ఇలాగే కాలు కదపకుండా పడి వుండాలని చెప్పిన విషయం మీ వాడు చెప్పలేదా? బట్, లెట్మీ టెల్యూ. ఈ పరుపు మార్చకపోతే వారం రోజుల పాటు ఇలా వుండడం నా తరం కాదు".

"వారం రోజులా! అదీ నా పక్క మీద!"

"అంత గట్టిగా అరవకు అనంత్! బాగా రెస్ట తీసుకోమని మరీ మరీ చెప్పాడు డాక్టర్. పైగా ఈ డిటెక్టివ్ నవల చదువుతూ అసలే టెన్షన్‌లో ఉన్నానా నువ్విలా అరిచి హడలగొడితే నా గుండెకేమైనా కావచ్చు. సరే, సరే నీతో ఈ డిస్కషన్ పెట్టుకునేంత టైము నాకులేదు వ్యవహారాలు చప్పున తెమల్చుకుని నువ్వు బయటకు వెళితే నేను కాస్సేపు కునుకు తీస్తాను".



"ఎవడా చెప్పిన డాక్టరు? పైగా నీతో నాకు వ్యవహారాలేమిటి?" అనంత్ మళ్ళీ అరిచాడు.

"వ్యవహారం ఏమిటేమిటి? ఈ ఏక్సిడెంటు గురించి మనమో అండర్‌స్టాండింగ్‌కి రావాలి. లేకపోతే మా అక్క దగ్గర పేచీ వస్తుంది"

"మీ అక్కెవరు?"

"దుర్గక్క. దుర్గా సూప్స్ ప్రొప్రయిటర్ కుచేరరావు లేడూ, అతని భార్య. నేనంటే పడి ఛస్తుంది".

"అదేం పాపం? నువ్వొక్కడివే తమ్ముడివా?"

"కాదు మేం అరడజను మంది ఉన్నాం. అందరిలోకీ చిన్నవాణ్ని నేను. పైగా పెళ్లికాలేదు. అందుకని."

"అయితే నాకేమిటి?"

ఫల్గుణ్ తెల్లబోయి చూశాడు, తర్వాత అర్థం చేసుకున్నట్టు చిరునవ్వు నవ్వాడు.

"నిన్ను మందబుద్ధి అని అందరూ ఎందుకంటారో నాకు ఇప్పుడు తెలిసింది.

నేను విపులంగా చెప్తాను విను. మా అక్క నా మీద ఈగ వాలినా సహించలేదు. మరి కారు వాలితే సహించగలదా? లేదు. నాకీ ఏక్సిడెంటు చేసిన వాణ్ణి కోర్టు కీడ్చి నానా రభసా చేస్తుంది".

"అవును చేస్తుంది"

"చేస్తుంది కదా! మరి దాని వల్ల నష్టపోయేది ఎవరు? సుమనోహరి - అందాల సుమనోహరి".

కథ ఎటుపోతుందో

అనంత్‌కి అర్థం కాలేదు. "దీన్లో సుమనోహరి




ఎక్కణ్నించి వచ్చింది?"

"వాళ్లింటి నుంచి! 'రుక్మిణి వేసిన అనంత్ బొమ్మ చూపిస్తా రా' అంటూ మీ ఇంటికి రమ్మనమంది. నేను మీ ఇంటికి వస్తుండగానే మలుపులో కార్లో వచ్చి గుద్దేశింది."

ఓహో, సుమనోహరి లేనిదే ఏ ట్రాజెడీ ఉండదు కదా అనుకుని అనంత్ నిట్టూర్చి" మరి రాంపండు ఎక్కణ్నుంచి వచ్చాడు?"

"సుమనోహరితో బాటు ఆ కారులోనే ఉన్నాడు కదా. వేరే ఎక్కణ్నుంచో రావడం ఎందుకు?"

"ఓహో ఇద్దరు కబుర్లు చెప్పుకుంటూ వచ్చి నీ మీద కారెక్కించేశారన్న మాట"

"కబుర్లు చెబుతూ కాదు. కళ్లు మూసుకుని కూడా కారెలా డ్రైవ్ చేయవచ్చో సుమనోహరి డిమాన్‌స్ట్రేట్ చేస్తుండగా".

"ఇక నాకు అర్థమయ్యింది. సుమనోహరికి డ్రైవింగ్ లెసెన్సు లేదు కాబట్టి, రాంపండు త్యాగం చేసి ఆ యాక్సిడెంటు నేరాన్ని తన నెత్తిమీద వేసుకుని, ఆ బాధితుడి భారాన్ని నా నెత్తిమీద పడేసి పోయాడు. అంతేనా?"

"దాదాపు అంతే. ఓ చిన్న అదనపు సమాచారం. ఆ త్యాగాన్ని చేయమని రాంపండుని ప్రోత్సహించినది సుమనోహరే. క్షణాల మీద అంత చక్కటి ఆలోచన చేసిన సుమనోహరి మా దుర్గక్క కారణంగా చిక్కుల్లో పడుతుందంటే నేను సహించలేను".

"పోనీ రాంపండు చేశాడంటే..."

"అప్పుడు సుమనోహరికి రుచించక పోవచ్చు. ఎందుకొచ్చిన గొడవ. ఆ విషయం ప్రస్తావించకుండా ఊరుకుంటె పోయె. మనం ఒక పెద్ద మనుష్యుల ఒప్పందానికి ఒద్దాం. ఫోన్ చేశా. అక్క వచ్చి అడిగినా అంతా గప్‌చిప్... ఓ.కే."

"అసలు ఆవిడకు తెలియాల్సిన అవసరం ఏముంది?" అనంత్‌కి అనుమానం వచ్చింది.

"తెలియపరచకపోతే నన్ను తిడుతుంది. అనుక్షణం నన్ను కంటికి రెప్పలా కాపాడుతుంది. నాకెవరైనా హాని తలపెడితే ఆడపులిలా తిరగబడి చంపేస్తుంది. అందుకని నన్ను గుద్దేసినా కారు నెంబరు చూడలేదని చెప్తానులే. ఓకే అనంత్! లీవ్ మీ నౌ. డాక్టరు రెస్టు తీసుకోమన్నాడు. పైగా ఈ డిటెక్టివ్ పుస్తకంలో విలన్ మన హీరోయిన్ బెడ్ రూమ్ వెంటిలేటర్లోంచి ఓ పాము లోపలకి పడేశాడు. నేను తక్షణం దాని సంగతి చూడాలి. నాకేదైనా అవసరం వస్తే పిలుస్తానులే. ఇక వెళ్లు" అని పుస్తకంలో మునిగిపోయాడు.

అనంత్ బయటకు వస్తూనే "అచలపతీ తల పగిలిపోతుంది. కాస్త నిమ్మరసం తీసియ్యి. ఈ ఫల్గుణ్‌గాడి పురమాయింపులు భరించలేను. వెళ్లి క్లబ్బులో కూచుని పేకాడుకుంటాను. నన్ను వీడి పాల పడేసినందుకు రాంపండు గాడికో చిన్న కోటింగు ఇవ్వాలి. హోటల్‌కి వచ్చి కలవమను" అన్నాడు.

రాంపండు అనంత్ కంట పడడానికి రెండు గంటలు పట్టింది. ఈ లోపున క్లబ్బులో చక్కటి భోజనం అమిరింది. రాంపండు కనబడగానే నమిలి మింగేద్దామన్న కోపం అతను కంటబడగానే కాస్త కరిగింది. తుఫాను దెబ్బ తిన్నా ప్రభుత్వ సాయం అందని రైతులా ఉన్నాడు రాంపండు. ఏమయిందన్నాడు అనంత్.

'సుమనోహరితో నా ప్రేమ ఫలించదేమోరా' అని బావురుమన్నాడు రాంపండు.

"ఏం?"

"ఏవేమిటి? అక్కడ ఫల్గుణం గాడు అలా మంచం మీద పడివుంటే నాకేసి ఏం చూస్తుందిరా? ఆడవాళ్ల కసలే జాలిగుండె. తన చేతుల్తో క్షతగాత్రుడిని చేసిన వాడు పాలిపోయిన మొహం వేసుకుని, రెండు దిళ్ల ఆసరాగా అమర్చుకుని, పళ్ల రసం తీసే గాజు పళ్లెన్ని పక్కన స్టూలు మీద పెట్టుకుని మంచి ఇంట్రస్టింగ్‌గా కనబడుతూంటే నాకేసి కన్నెత్తి చూస్తుందా? గదిలోకి వెళ్లి వాణ్ని చూసి, గుండె కరిగి, వాడి కాళ్లొత్తి త్యాగమూర్తిగా, సతీ సుమనోహరిగా చరిత్ర కెక్కేద్దామని నిశ్చయించుకుని గది బయటకు వస్తుంది. బయట ఉన్నదెవరు? ఆపిల్‌పండు ఏడ్‌లో మోడల్‌లా కనబడే రాంపండు. ఒళ్లు మండదూ? అసలు ఇంతంత ఆరోగ్యాలతో మనుష్యులు ఎలా వుంటారు బాబూ అని చికాకు పడుతుంది కూడా..."

"పోనీ నువ్వు కూడా ఏదైనా జలుబూ, రొంపా..."

"లాభం లేదురా. వాడు కాలు విరిగిన కేసు. సింపతీ ఫ్యాక్టరంతా పోగేసుకుని కూచున్నాడు. అందునా వాడు మహా గొప్ప యాక్టరులే. అయిపోయింది, నా పని అయిపోయింది." అంటూ రాంపండు తల పట్టుకుని కూచున్నాడు. అంతలోనే అనంత్‌కి తలలో బల్బు వెలిగింది.

"ఒరేయ్ రాంపండూ, కంగారు పడకు. నువ్వు చెప్పేది జనరల్‌గా కరక్టే కానీ అన్ని విషయాలలోను అలా ఉండాలని లేదు. కాలు విరక్కొట్టుకున్న ప్రతీ మగాడ్ని ఆడది ప్రేమించాలని లేదు. ముందులో అయ్యోపాపం అనిపించినా, రెండు సార్లు కాళ్లు ఒత్తి, మూడుసార్లు టెంపరేచరు తీసేసరికి ఉత్సాహం చల్లబడుతుంది. రాత్రులు మేలుకుని, మంచం కోడు మీద తల పెట్టుకుని కునికిపాట్లు పడుతున్నప్పుడు హఠాత్తుగా అనిపిస్తుంది. రోడ్డు మీద సవ్యంగా నడవడం కూడా రానివాణ్ని కట్టుకుని జీవితాంతం ఏం సుఖపడతాను అని, కారు మీదకు వస్తుంటే ఓ గెంతు గెంతి తప్పించుకోవాలన్న కామన్‌సెన్స్ కూడా లేనివాడు తమకు పుట్టబోయే పిల్లల్ని స్కూలుకి సరిగ్గా తీసుకెళ్లగలడా? అని పళ్లరసం తీస్తూ దీర్ఘాలోచనలో పడుతుంది..."

"...అంతేకాదు, ఇలా చీటికిమాటికి కాలు విరక్కొట్టుకునేవాడిని పెళ్లి చేసుకుని శేష జీవితాన్ని హాస్పటల్‌కీ, పళ్ల మార్కెట్‌కీ మధ్య రౌండ్లు కొడుతూ గడపాలా అని కూడా ఆలోచిస్తుంది. అంతకంటె హాయిగా గుమ్మడిపండు లాటి రాంపండుని కట్టుకుంటే తనే మంచం ఎక్కవలసి వచ్చినా ఫర్వాలేదు కదాని ధైర్యం తెచ్చుకుంటుంది..." అంటూ అందించాడు రాంపండు.

"కరెక్ట్. ముఖ్యంగా సుమనోహరి వంటి ప్రాక్టికల్ మనిషి ఇలాటి త్యాగమూర్తి వేషాలు వేయదు".

"అంటే త్యాగమూర్తులంటే గౌరవం కూడా లేదంటావా? ఎదటి వాళ్లు తన కోసం త్యాగం చేస్తున్నారన్నా బోనస్ మార్కులు వేయదంటవా?"

"ఖచ్చితంగా! ఇలాటి సెంటిమెంటల్ ఫూల్స్‌ని కట్టుకుని సుఖపడలేననుకుంటుంది కూడా".

"థాంక్స్‌రా. చాలా గొప్ప విషయం చెప్పి నా కళ్లు తెరిపించావ్." అని రాంపండు పరిగెట్టుకుని వెళ్లిపోయాడు. అప్పుడు కూడా అనంత్‌కి తన గొయ్యి తనే తవ్వుకుంటున్నట్టు అనుమానం రాలేదు.

****

ఇంకో గంట పోయాక అనంత్ ఇల్లు చేరేసరికి ఫల్గుణుడి అక్క దుర్గగారు వచ్చి కాసేపు కథాకళి చేసి వెళ్లిందని, అనంత్‌ని ఎలాగైనా చూడాలని తహతహలాడిందని అచలపతి చెప్పాడు.

"థ్యాంక్స్ చెప్పడానికా?" అని అడిగేడు అనంత్.

"ఆవిడ ఉపయోగించిన భాష చూస్తే అలా అనిపించలేదు సర్" అన్నాడు అచలపతి.

ఈ డిప్లమాటిక్ భాషను డీకోడ్ చేసుకొనే ఓపిక లేక "ఇంతకీ మన క్షతగాత్రుడు బతికున్నాడా?" అన్నాడు విసుగ్గా.

"ఐదు నిమిషాల క్రితమే బెల్లు కొట్టి పిలిచి 'ఈ కొంపలో ఇంతకంటె మంచి బ్రాండ్ సిగరెట్టు లేదా?' అని అడిగేరండి."

అనంత్‌కి ఒళ్లు మండిపోయింది. చరచర తన బెడ్‌రూమ్‌లోకి దూసుకుని వెళ్లాడు. పేషంటు గారు సిగరెట్టు ఊదుతూ, డిటెక్టివ్ పుస్తకం చదివేస్తున్నాడు. అనంత్‌ను చూస్తూనే, "రా, రా, అనంత్. వెల్‌కమ్ హోమ్. హీరోయిన్ గదిలో విలన్ తాచుపాము పడేసేడని నేను చెప్పినప్పటినుండి






ప్రభాత కాలాన కొంతదూరం నడిచి వెళ్ళొచ్చే ఆరోగ్యకరమైన అభ్యాసం క్రమక్రమంగా పుంజుకొంటోంది. మంచిదే... 'ఒకరు బలవంతపెట్టి లేపి కూచోపెట్టకుండా మనంతట మనం లేచి ఒకరోజు కూడా నాగా పెట్టకుండా నడిచివస్తున్నాం' అనుకుంటే ఇంకా మంచిదే. కాని అలా వెళ్లే వారిని 'మనం న్యాచురల్ వాకర్స్ అనుకోవచ్చు' అని అంటే మాత్రం అది అనందర్థం. ఆ మాట క్రికెట్ పరిభాషకి సంబంధించిన పదం మాత్రమే. బ్యాటింగ్ చేస్తున్న క్రికెటర్ ఏ కారణం చేతనైనా అవుట్ అయిపోయానని తనకి నమ్మకం కలిగి అంపైర్ చెప్పకముందే ఇవతలకి నడిచివచ్చే వాడిని న్యాచురల్ వాకర్ అంటారు.

నువ్వు పాపం వర్రీ అవుతున్నావేమో, నో ప్రాబ్లెమ్. ఇది ముందుగానే ఊహించి హీరో ఆ పాము కోరలు పీకేసాడు..." అని ఏదో చెప్పబోయేడు.

"డోంట్ బాదర్ ఎబౌట్ తాచుపాములూ, నాచుపాములూ...." అని విసుక్కున్నాడు అనంత్.

ఫల్గుణుడు మందలించాడు. "తాచుపాముల్ని అంత తేలిగ్గా తీసిపారేయకు. హీరో కోరలు తీసేసేడు కాబట్టి సరిపోయింది. లేకపోతే పాపం హీరోయిన్ ఈ పాటికి ఎక్కడుండేదో. అన్నట్టు, దుర్గక్క వచ్చింది. నీతో మాట్లాడాలంది. నువ్వెక్కడికి పోయావ్? పాపం చాలాసేపు వెయిట్ చేసింది".

"నాతో ఆవిడకి మాట్లాడాల్సిన విషయా లేమున్నాయి" అయోమయయంగా అడిగేడు అనంత్.

"ఉందిలే. కాస్సేపటి క్రితమే రాంపండు వచ్చాడు. ఇద్దరం కలిసి మా దుర్గక్క వస్తే ఎలా చెప్పాలా అన్న విషయం రిహార్స్ చేస్తూ ఉంటే ఒక విషయం తట్టింది. నీకు గుర్తుందా? యాక్సిడెంట్ ఎవరు చేశారో అక్కకి చెప్పకుండా ఎవరో నన్ను గుద్ది వెళ్లిపోయారని చెప్దామనుకున్నాం కదా. కానీ మీ ఇంట్లో భోంచేసి ఈ మంచం మీద పడుక్కుని వాసాలు లెక్కపెడుతూ ఉంటే నాకు హఠాత్తుగా తోచింది - ఇలా చెబితే అక్క నమ్మదని, మరి దాని గురించి ఏం చేద్దామని అనుకుంటూంటే రాంపండు ఓ ఐడియా ఇచ్చాడు. ఈ యాక్సిడెంటు నువ్వు చేసావని చెబితే సరిగ్గా అతుకుతుందని. నిజమే కదా, నువ్వు యాక్సిడెంటు చేశావు కాబట్టే నీ ఇంట్లో పెట్టుకుని సేవలు చేస్తున్నావని చెబితే ఎవరైనా నమ్ముతారు".

"హరి రాంపండూ!" అనుకుని అనంత్ నిర్ఘాంత పోయాడు. "మరి సుమనోహరి నేరాన్ని తన నెత్తిమీద వేసుకుని త్యాగమూర్తిలా ఆమె దగ్గర ఫోజు కొట్టి..."

"అబ్బే, ఆ త్యాగాల వేషాలకు గిరాకీ లేదు పొమ్మన్నాడు రాంపండు. నువ్వని చెప్పేయ మన్నాడు. నేను చెప్పేశాను. కానీ దుర్గక్క ఆ విషయాన్ని అంత తేలిగ్గా తీసుకోలేక పోయింది. తన తమ్ముణ్ని అవిటివాడిని చేసిన ఆ దుష్టుణ్ని పట్టుకుని... అదేమిటి అనంత్, అలా పళ్లు నూరుకుంటున్నావ్. అది చాలా బ్యాడ్ హేబిట్. నాకు చిన్నప్పుడు ఆ అలవాటు ఉంటే లెక్కల మేష్టారు చెప్పి మాన్పించాడు. నీకు లెక్కల సబ్జక్ట్ ఉండేది కాదా...?"

"నాకు తెలిసి నీకు కాలు బెణకడం తప్ప ఏ రోగమూ లేదు. ఆ మాత్రానికి అవిటితనమూ, దానికో అక్కగారి సింపతీనూ...." పళ్ల మధ్య నుండే మాట్లాడాడు అనంత్.

"ఏమో బాబూ, మా అక్క సంగతి ముందే చెప్పాను. చాలా కోపిష్టి. రేపు మళ్లీ వస్తుందట. ఈసారి నిన్ను కలవకుండా వెళ్లనంది. మా బావ కూడా ఊర్నించి తిరిగి వస్తున్నాడు. మా అక్క ఎంత చెబితే అంత తనకి. కేసు పెట్టు, వీణ్ని నాశనం చేసేయ్ అని అక్క అంటే చేసి తీరతాడు. చెప్పానుగా. బోల్డంత డబ్బు, పలుకు బడి, అన్నీ ఉన్నాయి. ఈలోగానే మా అక్కను మంచిచేసుకో. చల్లబడుతుంది. లేకపోతే నీ పని అంతే సంగతులు." అని చెప్పేసి టేబుల్ మీద ద్రాక్షపళ్లు ఒక్కోటి తీసుకుని నోట్లో వేసుకో సాగాడు ఫల్గుణ్.

అనంత్‌కు ముచ్చెమటలు పట్టాయి. కాస్సేపు ఆలోచించి, 'ఇంతకీ మీ అక్కను మంచి చేసుకోవడం ఎలా?"

"సింపుల్, ఆడవాళ్లను మంచి చేసుకోవడానికి ఉండే స్టాండర్డ్ ఫార్ములా - పూలు! అక్కకి గులాబీలంటే ప్రాణం. గులాబీలతో కట్టిన బొకే ఇప్పుడే పంపించేసేయ్. ఫోన్‌లో ఆర్డరిస్తే చాలు వాళ్ల ఊళ్లో గుమ్మం దగ్గరి అందచేసే ఏజన్సీలు ఉన్నాయి. రేపు తను వచ్చినప్పుడు నవ్వుతూ వస్తుంది. ఏదో పొరబాటయిందని చెప్పేసి చేతులో, కాళ్లో పట్టేసుకో. విషయం క్లోజ్. అనంత్. డాక్టరు నన్ను ఎక్కువ సేపు మాట్లాడద్దన్నాడు. రెస్టు తీసుకోమన్నాడు. అందువల్ల ప్లీజ్ లీవ్ మీ ఎలోన్".

****

ఫల్గుణ్ చెప్పినట్టు గులాబీలు పంపించడం వల్ల ప్రభావం కనబడింది. మర్నాడు అనంత్ నిద్ర లేచేసరికి కుబేరరావు సిద్ధంగా ఉన్నాడు!

కుబేరరావుకి గ్రీకువీరుడి ఫిజిక్. ఏదైనా మాట్లాడాలన్నా నాలుగు తన్నాక మాట్లాడచ్చులే అనుకునే రకంలా ఉన్నాడు. అంత డబ్బు ఉన్నవాడికి అంత గూండా లుక్ ఎలా వచ్చిందాని ఆశ్చర్యం వేసింది అనంత్‌కి. పలకరించబోతే కసురుకుంటున్నాడు. ఏం చేయాలో తెలియక అనంత్ ఊరుకున్నాక-

"అసలు సంగతి కొద్దామా?" అన్నాడు కుబేర్రాడీ.

'ఓహో, మీదాకా వచ్చిందా?" అన్నాడు అనంత్ కాస్త ఆశ్చర్యపడుతూ.

"మా ఆవిడ ఏ విషయమూ నా దగ్గర దాచదు తెలుసా?" అన్నాడు కుబేరుడు కాస్త గర్వంగా.

"ఏదో చిన్న విషయం కదా, చెప్పి వుండ రనుకున్నా..."

కుబేర్రావు ఒక్క గెంతు గెంతాడు. "ఏమిటి చిన్నవిషయమా?" నేను ఊళ్లో లేకుండా చూసి మా ఆవిడకు గులాబీలు పంపి, ప్రేమలేఖలు రాసి విసిగించడం చిన్న విషయమా?"

వాస్తవాలు తారుమారు చేయడం అనంత్ సహించడు. "ప్రేమలేఖ లెక్కడ రాశాను?".

"పువ్వులతో బాటు పంపిన కార్డు మీద 'ప్రేమతో' అని ప్రింటులో లేదూ? పైగా అన్ని పూలా? మా ఆవిణ్ని పూలతో అభిషేకం చేద్దా మనుకుంటున్నావా? ఇలా న్యూసెన్సు చేసే వాళ్లను వదిలి పెట్టడం నాకు చేత కాదు" అరి చాడు కుబేరుడు.

"నాకూ చేతకాదు" అని వినబడింది. అనంత్ వెనుకనుండి. తిరిగి చూస్తే ఓ భారీ స్త్రీ. దుర్గమ్మగారు కావచ్చు.

"ఇంకా చూస్తూ నిలబడతారేం? మా తమ్ముడి కాళ్లు విరక్కొట్టి వాడికి సేవ చేసినట్టు నటించి నన్ను వలలో వేసుకుందామని

(తరువాయి 35వ పేజీలో)







మా ఊళ్లో ఆర్వెల్ ఇంగ్లీష్ స్కూల్ అనేది ఉందని తెలిసి నేనెంతో సరదా పడ్డాను యానిమల్ ఫార్మ్ రాసిన ఆ బ్రిటిష్ నావెలిస్ట్ - ఆర్వెల్ వారి వ్యంగ్య హాస్యాలు ఎప్పటికీ మరువలేనివి. ఆ స్కూలు నిర్వాహకుల సంస్కారాన్ని మెచ్చుకుందామని అక్కడి కెళ్లేను "ఆర్వెల్ పేరు పెట్టుకున్నారు. ఆ నవలాకారుణ్ణి శాశ్వతం చేశారు. ధన్యులు" అని నేనేదో చెప్పబోతే ఏభై ఏళ్లు దాటిన ఆ స్కూలు అధికారిణి "ఏమో నాయనా, ఆ ఆర్వెల్ ఎవరో మేం ఎరగం. మేం ఆర్వేల నియోగి బ్రాహ్మలం. అదే దృష్టిలో పెట్టుకుని

# ఇష్టపది

మార్కెట్లో విరివిగా అమ్ముడుపోతున్న ఆడియోలపై అభిప్రాయాల వేదిక

## సంతోషం



సంగీతదర్శకులు ఆర్పీ పట్నాయక్, చక్రి ఇద్దరూ మంచి ఫ్రెండ్స్, 1996 నుండి వీరి స్నేహం కెరీర్‌తో పాటే వర్ధిల్లుతూ వస్తోంది. ఒకరి సక్సెస్‌ను చూసి మరొకరు ఆనందపడుతూ వుంటారు. 'సంతోషం' సినిమా మ్యూజికల్ హిట్ కావడం తనకు చాలా ఆనందాన్ని కలిగించిందని చక్రి చెప్పారు.

" 'సంతోషం' ఆడియో సక్సెస్ గురించి సంతోషంగా ఆర్పీని కలిసి అభినందించాలనుకున్నాను. కానీ వీలుకుదర్లేదు. ఈ రకంగా చెప్పే అవకాశం లభించింది. ఆర్పీ ఇలా వెరైటీగా ఆల్బమ్ చేయడం నాకు నిజంగా ఆనందాన్ని కలిగించింది" అని చక్రి తెలిపారు.

'సంతోషం'లో మీకు బాగా నచ్చిన పాట ఏదని అడిగితే -

" 'ధింధినక్తరి నక్తితోం గుప్పెడంత గుండెల్లో చెప్పలేని ఆనందం' పాట రెగ్యులర్ ఆర్పీ స్టయిల్‌కి భిన్నంగా కొత్త తరహాలో సాగిపోయింది. అందుకే నాకు బాగా నచ్చింది. ముఖ్యంగా శంకర్‌మహదేవన్ పాట పాడినతీరు నాకు బాగా నచ్చింది. నాకే కాదు ఎవరికైనా ఈ పాట నచ్చి తీరుతుంది" అని వివరించారు చక్రి.

## శ్రీరామ్



ఈ సినిమాలో వినగానే ఆకట్టుకునే పాటగా 'చిన్న చిరునవ్వు తోటి' పాట గురించి వచ్చింది. చిరునవ్వు అంటేనే చిన్న నవ్వు అని అర్థం...మళ్లీ 'చిన్న చిరు ఏమిటి?' అని ఆ పాట రచయిత కులశేఖర్‌ని అడగటం జరిగింది. "దీన్ని వ్యర్థ విశ్లేషణ ప్రయోగం అంటారు. మందస్మిత వదన అని పూర్వ కవులు ప్రయోగించేవారు. స్మితం అన్నా మందం అన్నా ఒకటే. అలాగే శిత శుక్ల దంష్ట్రా అని అంటాడు వాల్మీకి సీత గురించి. శితం అన్నా శుక్లం అన్నా ఒకటే. భవభూతి 'దళన్నవనీరద' ప్రయోగం కూడా ఈ కోవకి చెందినదే. ఈ పాట గురించి ఓ విషయం చెప్పాలి మీకు. ఓ రోజు మా గురువుగారు సీతారామశాస్త్రిగారు ఫోన్ చేసి 'ఓ సారి రావయ్యా' అన్నారు. వెళ్ళాను. (ఇద్దరూ ఒకే అపార్ట్‌మెంట్‌లో వేర్వేరు ఫ్లోర్‌లలో ఉంటారు). 'ఇన్నాళ్ళూ నువ్వు చాలా పాటలు రాసావు కానీ ఈ పాటలో నీదైన ముద్ర, ఒక యూనిటీ ఆఫ్ థాట్ కనిపిస్తుంది. చాలా బాగా రాశావ్' అని మెచ్చుకున్నారు. ఇక నిర్మాత మెచ్చుకోవటం వేరు, దర్శకుడు మెచ్చుకోవటం వేరు. కానీ గురువు మెచ్చుకోవటం వేరు. ఆ ఆనందం మాటల్లో చెప్పలేనిది" అన్నారు కులశేఖర్ సంతోషంతో.

## హాయ్



"కోటికి సినిమా నచ్చితే రీ రికార్డింగ్ టైమ్‌లోనే తెలిసిపోతుంది. ఈ సినిమా రీ రికార్డింగ్‌కి పన్నెండు రోజులు తీసుకున్నాడు. దాన్నిబట్టీ అర్థం అయిపోయింది - ఈ సినిమా అతనికి నచ్చిందని" అని అన్నారు దర్శకుడు ఇ.వి.వి. - కోటి మ్యూజిక్ గురించి! కోటిని 'హాయ్' సినిమాలో పాటల గురించి అడిగితే 'తంతే పడిపోయా పూబంతి ఒడిలోనే' అనే పాట గురించి చెప్పారాయన. అసలీ ట్యూన్ గురించి సజెస్ట్ చేసింది - కనుమూరి రఘు అనే ఓ పారిశ్రామికవేత్త. 'పడగోట్టి' అనే తమిళ సినిమాలోని 'తొట్టాల్ పూమలరుం' అనే ట్యూన్‌ని విని అదే పనిగా ఆయన ట్రావెల్ చేసిన రోజంతా అదే పాట పెట్టుకొని రిపీటెడ్‌గా విన్నారట. ఆ ట్యూన్ ఇన్‌స్పిరేషన్‌తో తెలుగులో ఓ పాట చేసి తీరాల్సిందే అంటూ పట్టుబట్టారాయన. పరిశ్రమకు కావలసిన ఓ సంగీతాభిమాని కోరిక కాదనలేక ఆ పాట ప్రేరణగా 'తంతే పడిపోయా' పాటను చేశాను. విన్న వాళ్ళందరూ చాలా బావుందంటున్నారు" అని తెలిపారు.

## జయం



'చిత్రం', 'నువ్వు - నేను' సినిమాలతో తెలుగులో న్యూ ట్రెండ్‌ని తీసుకువచ్చిన క్రియేటివ్ డైరెక్టర్ తేజ 'చిత్రం మూవీస్' అనే సొంత బేనర్ పెట్టి చేసిన సినిమా 'జయం'. ఆదిత్య మ్యూజిక్ ద్వారా ఈ చిత్రంలో బిట్ సాంగ్స్‌తో కలుపుకుని మొత్తం పదమూడు పాటలున్నాయని తేజ చెప్పారు. ఆడియో గురించి మరింత వివరంగా మాట్లాడుతూ -

"సినిమాల్లో ఇన్ని పాటలు అవసరమా అని కొందరు సందేహపడుతుంటారు. 'నువ్వు-నేను'లో పదకొండు పాటలున్నాయి. కానీ ఎవ్వరూ పాటలు ఎక్కువయ్యాయని అనలేదు, బోర్ ఫీలవ్వలేదు. ఏదో పాటలు ఉండాలి కాబట్టి పెట్టాలనే పద్ధతి కాదు నాది. నా సినిమాలో పాట అనేది కథలో అంతర్భాగం. సాధారణంగా పాటలు రాగానే కొంతమంది టీ తాగడం కోసమో, సిగరెట్ కోసమో బైటికి వెళ్తుంటారు. పాట పూర్తయ్యాక వచ్చి మళ్లీ సినిమాలో లీనమైపోతారు. కానీ నా సినిమాలో పాట మిస్సయితే కథ కూడా మిస్సవుతారు. ఆర్పీ పట్నాయక్, కులశేఖర్, నా కాంబినేషన్‌లో వస్తున్న మరో మంచి ఆడియో ఇది" అని తెలిపారు. " 'జయం'లో 'గాజువాక పిల్లా' లాంటి సాంగ్ ఏమైనా ఉందా?" అని అడిగితే - "అలాంటిది లేదు గానీ, వేరేది ఉంది. 'రాను రానంటూనే చిన్నది' పాట అందరికీ మంచి కిక్‌నిస్తుంది. నాక్కూడా బాగా నచ్చిన పాట అది" అని చెప్పారు తేజ.

## అల్లరి



యూత్‌ని మొత్తం ఒక్కసారిగా థియేటర్‌కు రప్పించిన సినిమాగా 'అల్లరి' గురించి చెప్పుకుంటున్నారు. ఈ చిత్రంలోని పాటలన్నిటినీ రాసిన సిరివెన్నెల సీతారామశాస్త్రి 'హాసం'తో విజయవాడ నుంచి మాట్లాడుతూ "అసభ్యత లేకుండా యువతను గిలిగింత పెట్టేలా పాటలు రాయటం అనే విషయంలో మొదట్నుంచీ నేనొక పంథాను పాటిస్తున్నాను. అదే ఈ అల్లరి లో బాగా కనిపిస్తుంది. ఈ సినిమా దర్శకుడు రవిబాబు 'మీరు రాస్తూ పొండి నాకు నచ్చింది నేను తీసుకుంటాను' అని అనలేదు. ఛాయిస్ అస్సలు పెట్టుకోలేదు. 'మీరేది ఇస్తే అదే తీసుకుంటాను' అన్నాడు. దాంతో నాకు పాట బాగా రాసే బాధ్యతతో పాటు జడ్జిమెంట్ బాధ్యత కూడా పడింది. ఇందులో పాటలు బాగా రావటానికి అదే కారణం అనుకుంటాను. నా వరకు నాకు 'కింగిని మింగిని' పాట నచ్చింది. ఎందుకు నచ్చిందో నేను హైదరాబాద్ వచ్చాక తర్వాతి సంచికలో చెప్తాను" అని అన్నారు.

## కనులు మూసినా నీవాయే



'చందు' సినిమాతో తెలుగు తెరపై అరంగేట్రం చేసిన కన్నడ భామ అర్చన, లైలాకాలేజ్, ఇదేం ఊరురా బాబూ, కనులు మూసినా నీవాయే తదితర చిత్రాల్లో నటిస్తూ తెలుగులో మంచి క్రేజ్‌ని సంపాదించుకుంది. 'కనులు మూసినా నీవాయే' చిత్రం తన కెరీర్‌ని మలుపు తిప్పుతుందనే ఆశాభావంతో ఉందామె. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని 'హాసం' అడిగితే - 'తొలకరివా' పాట నన్ను బాగా ఇంప్రెస్ చేసింది. తెలుగు నాకు అంత బాగా రాదు. కానీ ఈ పాట నాకు బాగా అర్థమైంది. పిక్చరైజేషన్ చేస్తున్న సమయంలోనే చాలా ఎంజాయ్ చేస్తూ ఈ పాట చేశాను. తొలిసారి ప్రేమలో పడినప్పుడు అమ్మాయి, అబ్బాయిలో కలిగే రొమాంటిక్ ఫీలింగ్స్‌ని ఈ పాటలో బాగా ఎక్స్‌ప్రెస్ చేశారు. పాటలో ఓ స్వీట్‌నెస్ ఉంది" అని చెప్పింది అర్చన.

## ప్రేమంటే



'బ్యాచ్‌లర్స్', 'అమ్మాయి కోసం', 'ఆనందం', 'మనసంతా నువ్వే' చిత్రాలతో శివారెడ్డి తక్కువ సమయంలోనే మంచి గుర్తింపుని సంపాదించుకున్నారు. బేసికల్‌గా మిమిక్రీ ఆర్టిస్ట్ అయిన శివారెడ్డి 'ప్రేమంటే' సినిమాతో సెకండ్ హీరోగా ప్రమోషన్ సాధించారు.

ఈ సినిమాలో నచ్చిన పాట గురించి అడిగితే -" 'ప్రేమంటే తెలుసా నీకు' పాట వినేకొద్దీ వినబుద్దేస్తుంది. ట్యూన్ కానీ, లిరిక్స్ కానీ బాగా కుదిరాయి. ఈ సినిమాలో నా మీద ఓ సోలోసాంగ్ పెట్టారు. '6 టీన్స్‌లో' పాట నామీద పిక్చరైజ్ చేశారు. అలాగే నామీద మరో విచిత్రమైన ఎపిసోడ్ పెట్టారు. 'నువ్వే కావాలి' లోని 'అనగనగా ఆకాశం వుంది' పాటని ఎన్.టి.ఆర్., ఎ.ఎన్.ఆర్., వెంకటేష్, ఆర్.నారాయణమూర్తి, బ్రమ్మానందంలు ఏ స్టయిల్‌లో అభినయిస్తారో నేను చేసి చూపిస్తాను. ఈ ఎపిసోడ్ తప్పకుండా అందర్నీ ఆకట్టుకుంటుంది" అని వివరించారు శివారెడ్డి.

## మనసుతో



'మనసుతో' లో సుద్దాల అశోక్‌తేజ రాసిన బ్రీత్‌లెస్ సాంగ్ స్టయిల్‌లోని 'ఎప్పుడు చప్పుడు కాని కనురెప్పలలో నువ్వే' పాట బాగా క్లిక్ అయ్యింది.

ఈ పాట గురించి అశోక్‌తేజ మనసువిప్పి చెప్పుకున్న భావాలు 'హాసం' కోసం.

" నా లైఫ్‌లో తొలిసారిగా అద్భుతమైన పాట రాసిన ఫీలింగ్ కలిగింది. సినిమా పాట అనే ఆలోచనతో కాకుండా కొత్త ఆత్మతో రాసాను. ఈ పాట పూర్తయ్యేసరికి ఫీవర్ వచ్చిన ఫీలింగ్ కలిగింది. దర్శకుడు ఈ పాట చెప్పగానే నన్నెవరో ఆవహించినట్టుగా భావావేశంతో రాసాను. ప్రతి పదంలోనూ ఓ అద్భుతమైన ఆవిష్కరణ కనిపిస్తుంది. మూడు రాత్రుళ్ళ లో మూడు భాగాలుగా చాలా వేగంతో, ఊపుతో రాసాను.

నేను చదివిన యమ్.ఎ. తెలుగు, ఫిలాసఫీ ఈ పాట రాయడానికి బాగా ఉపయోగపడింది. నేను చదువుకున్న పురాణాలు ప్రేరణగా నిలిచాయి. నన్నయ్య నుండి నారాయణరెడ్డి వరకూ నేను చదివిన కావ్యాలు ఈ పాటకి ఆత్మగా నిలిచాయి. చందాల కేశవదాసు నుండి చంద్రబోసు వరకూ అవకాశం వస్తే ఈ పాటని గొప్పగా రాసేవారేమో, ఆ అవకాశం మాత్రం నాకు దక్కింది. ప్రేమ పరిణామ వాదాన్ని ఈ పాటలో కొత్తగా ప్రతిపాదించాను".

## నిన్నే చేరుకుంటా



'నిన్నే చేరుకుంటా' చిత్రం సంగీత దర్శకురాలిగా తన కెరీర్‌ని మలుపు తిప్పుతుందనే ఆశాభావంతో వున్నారు ఎం.ఎం. శ్రీలేఖ. ఈ చిత్రం ఆడియోకి మంచి రిపోర్ట్ రావడంతో శ్రీలేఖ ఆశ నెరవేరే అవకాశం కనిపిస్తుంది.

ఈ ఆడియోలో మీరు బాగా హైలెట్‌గా ఫీలయ్యిన సాంగ్ ఏదని అడిగితే -

" 'ఎలా చెప్పనమ్మా నా ప్రేమ సంగతులు' పాట ఈ ఆడియోకే హైలెట్.

తక్కువ ట్యూన్‌తో ఎక్కువ మీనింగ్‌ఫుల్‌గా ఈ పాటని రూపొందించడం జరిగింది. చాంతాడంత పల్లవి లేకుండా సింపుల్‌గా చెప్పాలనుకున్న థాట్‌ని అందంగా చెప్పడం జరిగింది" అని చెప్పారు శ్రీలేఖ.

ఈ ఆడియోలో నాలుగు పాటల్ని పట్నాయక్‌తో పాడించాలనుకోవడానికి కారణమేమిటని 'హాసం' అడిగితే 'పట్నాయక్ వాయిస్‌లో ఓ స్పెషాల్టీ వుంది.

ప్రస్తుతం మార్కెట్‌లో కూడా పట్నాయక్ వాయిస్‌కి మంచి క్రేజ్‌వుంది.

ఈ పాటల్ని హిందీ సింగర్స్‌తో కన్నా పట్నాయక్‌తో పాడిస్తే బాగా ఎఫెక్ట్ వస్తుందనుకున్నాను.

అలాగే వచ్చింది" అని వివరించారు శ్రీలేఖ.

## ప్రేమంటే మాదే...



పాటల చిత్రీకరణ పూర్తికాకుండా - రిలీజైన ఆడియో మీద టాక్ రావడం... అదీ ఒక చిన్న సినిమా మీద రావడం...అతి అరుదుగా జరుగుతుంది.

అది 'ప్రేమంటే మాదే' సినిమాకి జరిగింది.

ఆ చిత్ర దర్శకుడు వేము మాట్లాడుతూ "అందరూ 'బంగారు చిలకమ్మా' పాట బావుందన్నారు.

నాకు మాత్రం పర్సనల్‌గా 'ఊహలకే ఊపిరి పోసి' పాట నచ్చింది. ఎవరైనా సరే వినగానే పాడుకునేలా శ్రీలేఖ సమకూర్చిన సంగీతం నోటికి ఈజీగా పట్టుబడేలా అందెశ్రీ అందించిన సాహిత్యం పాటకి హెల్ప్ అయ్యాయి.

పాట విన్నాక కులూమనాలిలో స్నో ఎఫెక్ట్‌తో షూటింగ్ చెయ్యాలనుకుంటున్నాం.

జూన్ ఫస్ట్ వీక్‌లో ఆ పాట చిత్రీకరణకు బయల్దేరుతున్నాం" అన్నారు.

క్లాసిక్స్ రీటోల్డ్

**అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

# నవ్వుటద్దాలు

-ఆచార్య తిరుమల

నవ్వటం, నవ్వించటం - అనేవి అతి సామాన్య జీవ లక్షణాలేమీ కాదు. నవ్వటం - నిర్మల హృదయానికి, ఉత్తమ సంస్కారానికి సంబంధించిన విషయం కాగా, నవ్వించటం అనేది సృజనాత్మక కళకి, లోక కళ్యాణానికి సంబంధించిన అంశం. అందుకే మన పెద్దలు నవరసాల్లో శృంగారం తర్వాత హాస్యానికి పెద్దపీట వేశారు. హాస్యం రసం, హాసం దాని స్థాయీ భావం. హాసం అంటే నవ్వు. నవ్వు పుట్టించేది హాస్యం. ఇదంత తేలికైన విషయం కాదు. హాస్యం హృదయాన్ని తేలిక పరుస్తుంది కానీ దాని సృష్టి తేలిక కాదని ఒక ఆంగ్ల కవి - "It lightens the heart but the process to arrive at it requires serious thinking" అన్నాడు.

పుట్టుక నుండి చావు వరకు నిండి వున్న జీవ లక్షణం దుఃఖమే. అందులోంచి ఆనందరేఖని వెదుక్కోటానికే మనిషికింత సమాజం, సాహిత్యం కావలసి వచ్చాయి. ఈ అన్వేషణలోనే మనిషి మిగిలిన జంతువుల నుండి వేరుపడుతున్నాడు.

జాషువా మహాకవి ఒకచోట -

**నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్**
**దివ్వెలు, కొన్ని నవ్వులెటుతేలవు, కొన్ని విషప్రయుక్తముల్**
**పువ్వుల వోలె ప్రేమ రసముల్ వెలి గ్రక్కు విశుద్ధమైనలే**
**నవ్వులు సర్వ దుఃఖదమనంబులు, వ్యాధులకున్ మహౌషధుల్!!**

అంటూ బ్రహ్మాండమైన పద్యం చెప్పాడు. నవ్వు విషపూరితం కాకుండా ప్రేమరసపూర్ణంగా వుండి దుఃఖాన్ని, రోగాన్ని ఉపశమింపజేయాలని సూచించాడు. అంతేమరి. అప్పుడే అది చిత్తవృత్తికి దివ్వె అవుతుంది. పానుగంటి లక్ష్మీనరసింహం గారు కూడా తమ మాలతీమాధవం కావ్యంలో నవ్వుని గూర్చి ప్రస్తావిస్తూ-

**సరసమగు నవ్వు జగతికి సౌఖ్యమొసగు**
**విరసమగు నవ్వు జగతికి పీడనిచ్చు**
**బాకుపోటునవౌ పుండు బాగుపడును**
**నవ్వుచే పుట్టు గాయంబు నయముగాదు -**

అంటూ విషపు నవ్వుని చెప్పి -

**నవ్వుచే కొన్ని రోగముల్ నాశమొందు**
**నవ్వుచేత దీర్ఘాయువు నివ్వటిల్లు**
**నవ్వుచేతనే పూర్వ జన్మంబుగలద**
**టంచు మనవారు వెనుక సాధించినారు!!**

అని నవ్వే విధానాన్ని బట్టి జన్మలేమిటో కూడా తెలుసుకోవచ్చునన్నారు. అయితే, అలాంటి పట్టులు పట్టటానికి కేవలం ఒక నవ్వో, ఒక మాటో చాలదు. పెంజీకటి కవ్వలి వెలుగును చూసే తపోనిష్ఠ, నేత్రం కావాలి. మనం అంతదూరం పోవల్సిన అవసరం లేదు కానీ నవ్వు వల్ల ఆరోగ్యం, దీర్ఘాయువు కలుగుతాయని గ్రహిస్తే చాలు. అవునా? అవును. బోసి నవ్వుల గాంధీ మహాత్ముడు కూడా-

"If I had no sense of humour, I would long ago have committed suicide" అన్నాడు. తనకి నవ్వే గుణం లేకపోతే ఎప్పుడో ఆత్మహత్య చేసుకుని వుండే వాడినన్నాడు. భారతీయుల నిర్మల హృదయ దరహాసం గాంధీ పెదవుల మీద నాట్యం చేసింది కదా! మృత్యువును కూడా నవ్వుతూ ఆహ్వానించిన ఘనుడాయన. నవ్వగలగటమే వేదాంతం. నవ్వగల గటమే సంపద. "A man is not poor if he can still laugh" అన్నాడు హిట్కోర్ అనే పండితుడు. వాసనలేని పువ్వులా పరిహాస ప్రసంగం లేని వాక్యం కూడా కొరగానిదన్నాడో కవి. అందుకని కాస్త నవ్వుతూ మాట్లాడటం కూడా అలవాటు చేసుకోవాలి. "నవ్వలేని ముట్టి నాగుముట్టి" అన్నాడు ముకురాల రామారెడ్డి. సరే - ఈ హాస్యం మీద చెప్పుకోదగినంత సాహిత్యం పుట్టుకొచ్చింది. అయితే-

ప్రాచీన సంస్కృత సాహిత్యంలో



గానీ, తెలుగు సాహిత్యంలో గాని హాస్య రస ప్రధానమైన రచనలేవీ లేవనే చెప్పాలి. ఏవన్నా వుంటే చమత్కార శ్లోకాలు, చాటు పద్యాలూ ఉన్నాయి. ఆధునిక తెలుగు సాహిత్యంలో

ప్రత్యేకంగా హాస్యకవితలు, నాటికలు, వ్యాసాలు గేయాలు వంటి వెన్నెన్నో ఉన్నాయి. జోక్‌లకీ, కార్టూన్లకి ప్రత్యేక స్థానాలేర్పడ్డాయి. సినిమాల్లో కూడా యిప్పుడు హాస్యం ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకుంది. మరి, ఇంత బలవత్తరమైన హాస్యాన్ని కవులు నిర్లక్ష్యం చేశారా? అంటే లేదు కానీ తగిన విధంగా దాన్ని పోషించలేదు అంతే. చమత్కార గర్భిత హాస్య సన్నివేశాలు, కథలు, శ్లోకాలు, పద్యాలు చాలా వున్నాయి. సంస్కృతాంధ్ర సాహిత్యాల్ని చూస్తే మనకీ విషయం అవగత మవుతుంది. మీరు హాయిగా నవ్వుకుని ఆనందించగల శ్లోకాలు. పద్యాలూ పరిచయం చేస్తాను. రుచి చూడండి:-

బాగా నడుం వంగి వొణుక్కుంటూ వెళ్లే ఓ తెలివైన ముసలవ్వని ఏడిపించాలని ఓ పడుచు కుర్రాడు ఎదురొచ్చి-

**"అధో పశ్యసి కిం బాలే!**

**తవ కిం పతితం భువి?"** అని అడిగాడు. అంటే - ఓ బాలా! కిందికి చూసుకుంటూ వెళ్తున్నావ్. ఏం పారేసుకున్నావ్? - అని నవ్వాడు. దానికి ఆ ముసలవ్వ కొంచెం ముఖం పైకెత్తి ఆ కుర్రాణ్ణి చూసి -

**"రే రే! మూఢ! నజానాసి**

**నవ యౌవన మౌక్తికం!!"**

అని చెంపఛెళ్లుమనిపించింది. అంటే - ఓ మూర్ఖుడా! నీకు తెలియదా? నవయౌవనమనే ముత్యాన్ని పారేసుకున్నానంది. ఏడిపించటానికి వచ్చి ఏడ్చుకుంటూ పోయిన ఆ కుర్రాణ్ని చూస్తే జాలితోబాటు నవ్వుకూడా కలుగుతుంది.

ఇలాగే మరో చమత్కార సన్నివేశం. ఓ వికటకవి ఓ వేశ్య యింటికి వెళ్లి తన చేతిలోని వక్కలు, ఆకులు చూపించి - సున్నం తెమ్మని యిలా పద్యంలో అడిగాడు -

**పర్వత శ్రేష్ఠ పుత్రికా పతివిరోధి**

**యన్న పెండ్లాము నత్తను గన్న తండ్రి**

**పేర్మి మీరిన ముద్దుల పెద్దబిడ్డ!**

**సున్నమించుక తేగదే సుందరాంగి!**

దీనికి ఓ జ్యేష్ఠా! ఓ పెద్దమ్మా! సున్నం తెమ్మని అర్థం. ఇదో వెటకారం తిట్టు. ఎలాగంటే - పర్వత శ్రేష్ఠ పుత్రిక=పార్వతి, పతి=శివుడు, విరోధి=శివుని విరోధి మన్మధుడు, అతని అన్న = బ్రహ్మ, పెండ్లాము=సరస్వతి, ఆమె అత్త=లక్ష్మి. ఆమెను గన్న తండ్రి =సముద్రుడు. అతని పెద్దబిడ్డ=(దరిద్ర దేవత) పెద్దమ్మ.

అంటే, "ఓ పెద్దమ్మా! సున్నం తే" అని అడిగాడు. అసలు, సున్నం అడక్కూడదు. తీసుకోవాలి. అది పద్ధతి. మొహాన సున్నం నీళ్లు కొట్టారు. గుండుగొరిగి సున్నపు బొట్లు పెట్టారని వాడుక. సున్నం అవమానానికి సూచిక. ఆ వేశ్య నెరజాణ. వీడి అవహేళన అర్థమై సున్నం తెచ్చిస్తూ - ఆమె అతగాడికిలా పద్యంలో జవాబు చెప్పి ఖంగుతినిపించింది.

**శతపత్రంబుల మిత్రుని**

**సుతుఁ జంపిన వాని బావ సూనుని మామన్**

**సతతము దాల్చెడు నాతని**

**సుతు వాహన వైరివైరి సున్నం బిదిగో!!**

(శతపత్రంబుల మిత్రుడు=సూర్యుడు, అతని సుతుజంపిన వాని బావ = కర్ణుని చంపిన అర్జునుని బావ శ్రీకృష్ణుని, సూనుడు=కొడుకు మన్మధుని, మామ= మేనమామ చంద్రుని, సతతము దాల్చిన నాతని= శివుని, సుతువాహనవైరి= వినాయకుని వాహనమైన ఎలుక, వైరి=పిల్లి, దానివైరి=కుక్క).

"ఓ కుక్కా! సున్నమిదిగో! తీసుకో" అని ఎదురుదెబ్బ తీసి ఆ వికట కవిని తలదించుకునేలా చేసింది. ఆమె జవాబుకి ఎవరికి నవ్వురాదు చెప్పండి.

హాసంతో ముఖానికి వెలుగొస్తుంది. హాస్యంతో జీవితానికి వెలుగొస్తుంది. ప్రతి రసానికీ ఒక రంగు ఉంది. మీకు తెలుసునో లేదో గానీ శృంగారం రంగునలుపైతే, హాస్యం రంగు తెలుపు!








'విడాకులు న్యాయరీత్యా శాంక్షను అయాక భర్త తన భార్యకిచ్చే భరణానికి ఇంగ్లీషులో ఏదో పదముంది. మనసులో మెదులుతోంది గాని నాలిక మీదకి రాడం లేదు. తెలిసిందే. ఇలాంటి వదాన్ని ఎలా గుర్తుంచుకోవడమో ఏమిటో!"అన్నాడొకాయన.

"అన్ని పదాల మాటా నాకు తెలీదుగాని దీన్ని గుర్తుంచుకోడం సులువే"అన్నాడింకో ఆయన. "ఏమిటదీ, ఎలా?" అడిగాడు మొదటాయన.

"అది ఆలికిచ్చే మనీ కదా 'ఆలిమనీ' అని గుర్తుంచుకుంటే పోలా!"

# మనసు చిలుకకు - మంచి నేర్పిన

# మనుసారి వెంకట లక్ష్మమ్మ

ఆడాళ్ళు వంటింటి కుందేళ్ళు!

ఆడాళ్ళు మొగుడికి ఉత్తరం ముక్క చాకలి పద్దు

రాసుకోగలిగితే చాలు!!

ఆడాళ్ళు ఊరేగాలా - ఊళ్ళేలాలా!...

ఇవన్నీ... ఒకానొక 'జాతి' యొక్క మూర్ఖభిప్రాయాలు... ఇవన్నీ ఏనాడో శిథిలమై పోయీ.... మ్యూజియంలో గూడా పెట్టేశాం!!

ఈనాడు ప్రముఖ హోటళ్ళలో చెఫ్‌లు (వంటవాళ్ళు) మొగాళ్ళే!!

అలాగే అమ్మాయిలీనాడు

కంప్యూటర్ని కుడిచేత్తో టకటకలాడించేస్తూ....

ఎడం చేత్తో... 'మౌస్'ని కదలించేస్తున్నారు...

ఊరేగడాలేవిటీ... రోదసీలోకేఎగిరారు...

ఊళ్ళేలడవాఁ... దేశాల్నేలారు!! (ఇంక్లూడింగ్ ఇండియా!)

అంచేత 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పింపగన్...

అన్న సదభిప్రాయానికి కట్టుపడితే శ్రేయస్కరం!

ఈసారి మనం తెలుసుకోబోయే సంగీత కళాకారిణి

మనుసారి నీలకంఠం ... వెంకటలక్ష్మమ్మ!

ఈవిడ ఆత్మకూరు సంస్థానానికి చెందిన వాగ్గేయకారిణి.

ఆత్మకూరు సంస్థానాధీశులు పాకనాటి రెడ్లు....

వీరు మొదట బహమనీ సుల్తానులకు...

తర్వాత గోల్కొండ సుల్తానులకూ సహకరించి ఎన్నో జాగీర్లు పొందిన వారు...

స్వతహాగా సంగీత - సాహిత్య ప్రియులు...

ప్రతీ యేడాది ఫాల్గుణ శుక్లపక్షంలో కవి, గాయక, నాటక ప్రదర్శనలు నిర్వహించి అర్హతలను బట్టి.... పురస్కారాలు ఇచ్చే సంప్రదాయం కలవారు!

అలనాటి ఆత్మకూరుకి సంబంధించిన వెంకటలక్ష్మమ్మగారు భజన సంప్రదాయానికి చెందిన సంగీత రచనలను అనేకం చేసింది! ఈమె గద్వాల సంస్థానంలో రాణీలక్ష్మీదేవమ్మ గారికి ఆంతరంగికురాలుగా పనిచేసిన శ్రీమతి శివమ్మ గారికి స్వయానా చెల్లెలు... సరళమైన భాషలో ప్రజల హృదయ రంజకంగా భగవన్నుతులని కీర్తనలుగా వెలయించిన వాగ్గేయకారిణి.... కృష్ణయ్య - కటకం నాగమ్మ ఈవిడ తల్లిదండ్రులు.

భర్తపేరు 'నీలకంఠం' - 'ఈమె తల్లిదండ్రులు సప్తాహాలూ - యగాలు, వ్రతాలూ హరిభజన్లు నిత్యం చేస్తూ ఉండడం వల్ల... బాల్యం నించే భక్తిలో పడిపోయింది లక్ష్మమ్మ.... ఈమె కుమారుడు గద్వాల మహారాణిగారి దగ్గర స్టోర్స్ ఇన్‌చార్జిగా పని చేస్తూ ఉండేవాడు....

'భజనలు - కీర్తనలూ - తత్వములూ'' అన్న పేరుతో ఈమె రాసిన కీర్తనలు ముద్రితాలు. వెంకట లక్ష్మమ్మ రాసిన కీర్తనలకు 1961లో తిరుమల శ్రీనివాసశర్మ ప్రస్తావన రాశారు. - ఈవిడ రచించిన కీర్తనలలో 'ఆత్మకూరు నిలయ శ్రీలక్ష్మాంబ వరద ప్రసన్న' అన్న 'ముద్ర' ఉంటుంది.

దురదృష్టవశాత్తూ ఆవిడ జీవిత విశేషాలు పెద్దగా మనకి లభించకపోయినా... రచనలు లభించాయ్... వాటిని పరిశీలించి... పరవశిద్దాం!

రామనామ స్మరణ మాత్రం చేత లక్ష్మమ్మ ఆత్మ అడవుల్లోకి పారిపోతుంది!

వొళ్ళంతా వొడిలిన దోస పండై పోతుంది...

తనే శబరై పోయీ.... అడివంతా పళ్ళకోసం గాలిస్తుంది...

ప్రతీ పండూ కొరికి కొంగున కట్టుకుంటుంది!

అటు ఆకాశం కేసి చూస్తే నీలంగా, రాముడి ఛాతీలా....

ఇటు సముద్రం కేసి చూస్తే రాముడి ఖ్యాతిలా గంభీరంగా...

ఉన్నట్టుండి... వేలకొద్దీ రామచిలకలు ఎగిరేయ్...

అడివంతా పచ్చబడింది!....

నా రాముడొస్తున్నాడా!....

సీతమ్మ వారి జడగంటలు... ఊగుతున్నాయ్....

రామయ్యా.... రావయ్యా.... ఇదే ఆర్తితో ఇలా అంటుంది.... ఆనంద

---

అవధానం గురించి మీ వ్యాఖ్యానం అక్షరలక్షలు చేసే రసగుళికలు. ఎందుకూ అన్నదాంట్లో లక్ష సమాధానాలున్నాయని మీరు వ్రాసినది చదివాక, ఒక సినిమాలో బాబూమోహన్ పాత్ర ద్వారా (బహుశా ఎస్వీగారి సినిమా కావచ్చు) చెప్పింది జ్ఞాపకం వచ్చింది. ప్రపంచం అంతా ఎందుకు! ఏమిటి! ఎలా! అన్నవాటిల్లో వుందని. ఆ చిత్రంలో నవ్వు పుట్టడానికి చెప్పించినా మీరు వ్రాసింది చదివాక నిజమైన అర్థం స్ఫురించింది. ఉషోదయ, మధ్యాహ్న, సంధ్యాసమయం, రాత్రివేళల్లో దుడ్డు సీతారామయ్యగారి సంగీతోపాసన చాలా చక్కగా చెప్పారు. అలాగే అలహాబాద్‌లో కాశీపండితునికి, సీతారామయ్యగారికి జరిగిన పోటీ సందర్భంలో మీరు వాడిన పదాలు, ఆ మహామహుల గానామృత పోటీని మా కళ్ళముందుంచాయి. 34,848 రాగాల్లో దేన్ని గురించి అడిగినా అలవోకగా చెప్పే సీతారామయ్యగారు మీరన్నట్లు నాదయోగి, వాగ్గేయకారుడు అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. మహామహుల గురించి మీ వ్యాస పరంపరలో చదువుతూంటే మన సాహిత్య సంగీత సంపద ఇంత గొప్పదా అని వొళ్ళు జలదరిస్తున్నది.

-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్

భైరవిరాగంలో లక్ష్మమ్మ!

**రామా నీ దయ రాకపోయెనా, నన్నే ఇటు అతిభారమాయెనా**

**వేమారు నినుచాల వేడినందులకైనా, ప్రేమా జూపవూ**

**యేదరి తెలియని దానరా ఓ దేవ, నీదయ రాదేమిర రామా**

**వేదవినోద నీకేగతియని నమ్మలేదు, నా మనసు నీరజ దళనేత్ర ।రామా।**

అలాగే కృష్ణుని తల్చుకున్నప్పుడు... లక్ష్మమ్మ మనసు నెమలైపోతుంది!

ఆకాశంలో మెరిసే మెరుపు... కన్నయ్య చేతిలోని బంగారపు వేణువై పోతుంది!...

జగన్మోహనంగా వాయిస్తుంటే....

ప్రవహించే యమునా నది ఘనీభవిస్తుంది...

గొల్ల పిల్లల ఇళ్ళల్లోని పెరుగూ.... మనసూ కరిగిపోతాయ్... కవ్వాలతో చిలికినట్టై పోతాయ్.... కన్నెపిల్ల గుండె వెన్నపూసై పోయీ... దొన్నెలో పెట్టీ... కన్నయ్య కోసం ఎదురుచూస్తుంది!

ఇక లక్ష్మమ్మ మనసు పురివిప్పీ.... ఆడీ ఆడీ... అలసి తనగుండె - నెమలీకల్లే తేలికై పోయాక దాన్ని కన్నయ్య పాదాలమీద పెడ్తుంది!!

కన్నయ్య చేత్తో ముట్టుకోడు...!

మురళి వాయిస్తాడు!... ఆ గానానికి నెమలీక గాల్లో తేలుతూ లేచీ....

నల్లనయ్య చుట్టూ ప్రదక్షిణలు చేసీ.... వెళ్ళి తల మీద బాసింపీట వేసుక్కూర్చుంది.

మళ్ళీ మెరుపులు...

ఈసారి బ్రహ్మాండం అంతా... అఖిలాండ కోటి నాయకునికి హారతి పట్టినట్టయింది.

ఆనందం పట్టలేక కన్నీరు పెట్టుకుంటూ ఏడుస్తుంది లక్ష్మమ్మ.

**యశోద భాగ్యమెంతో నిన్నెత్తుకొనియు ముద్దాడ**

**యే భక్తుల చేపట్టుబడితివా యదుకుల భూషణ**

**వేగమెరారా... యెత్తుకొనెదనా యదుకుల నందనరారా...**

**ఎత్తరాని గోవర్ధనమెత్తిన గోపాల....**

రామా... కృష్ణా అనుకున్నాక.... చివరకి మిగిలేది ఏవిటీ?



అఖండ జ్యోతంత తత్వం....

ఆ వెలుగులోనే కదూ అసలు 'పదార్థాన్ని' వెతుక్కోవాల్సిందీ!

అందుకే యదుకుల కాంభోజి రాగంలో ఇలా అంటోంది తత్వం!

**మాయా సంసారంలో మరిగీ**

**సద్గతీత్రోవ మరిచీ యున్నావూ**

**రామచిలుకా కాయమస్థిరమనీ**

**కరణాచార్యుల కడకూ...**

**జేరవె రామచిలుకా!**

**రాయభారము మాని...**

**రామధ్యానమె పూని**

**రమ్యముగా నుండవే**

**చిలుకా!...**

కాళ్ళూ చేతులూ గట్టిగా ఉండీ... కడుపులో చల్ల కదలకుండా ఉన్నంతకాలం ... "ఎవడికి తెలీని వేదాంతమిదీ... చెత్త!... అనిపిస్తూనే ఉంటుంది!...

కాస్త గుండెల్లో ముల్లు గుచ్చుకునే సరికీ... ప్రతీదీ వేదాంతమయమై పోయింది!

కాలయముడెప్పుడైనా పాశం విసిరి పట్టుకుపోయే అవకాశం ఉంది గనుకా

ఉన్న నాలుగు రోజులూ పది మందికి ఉపయోగపడ్తూ.... పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తూ పరమపదం చేరుకొమ్మని అర్థిస్తుంది లక్ష్మమ్మ.

**'పంచభూతములను పంచి చూచి**

**మాయ ముంచి నేయవె రామచిలుక**

**పంచరంగుల పంజరంబులో నివశించు**

**పరమాత్మ నెరుగవె చిలుకా...**

అని మనందరికీ 'చిలక్కి చెప్పినట్టు' చెప్పింది!

ఆచరించామా తరిస్తాం...

లేదూ హరిస్తాం!!!

**-తనికెళ్ళ భరణి**

---

16-31 మే 2002 'హాసం' పత్రికలో మా తాత గారి గురించి "మహామహోపాధ్యాయ సంగీతావధాని - దుడ్డు సీతారామయ్య!" అంటూ రాసిన వ్యాసం చదివి వేం అంతా చాలా ఆనందించాము. నేను శ్రీ సీతారామయ్యగారి రెండవ కుమారుడు శ్రీ దుడ్డు దక్షిణామూర్తి శాస్త్రిగారి కుమార్తెను. మా పిల్లలు మనవలతో హైదరాబాద్‌లోనే వుంటున్నాము. మా తాత గారి గురించిన ఇంకా హెచ్చు వివరాల కోసం మీకు ఆసక్తి వుంటే మిమ్మల్ని సగౌరవంగా మా ఇంటికి ఆహ్వానిస్తున్నాము. మీరు మా ఇంటికి వస్తే మా వద్ద వున్న వివరములు తెలియ జేయగలను. మా తాతగారి ఫోటో కూడా మా దగ్గరి వుంది. శ్రీ మా నాన్నగారు అమ్మగారు కూడా సంగీతంలో "డబుల్ డిప్లమో హోల్డర్లు". ప్రస్తుతం వారు బాపట్లలో వుంటున్నారు. మా తాతగారి శతజయంతి ఉత్సవాలు బాపట్లలో శ్రీ మా నాన్న గారి ఆధ్వర్యంలో జరిపించారు. మా తాతగారు వారికి వారి గురువుగారు శ్రీ నుసర్ల దక్షిణామూర్తి గారిపై వున్న అపార గౌరవానికి సూచకముగా శ్రీ మా నాన్నగార్కి వారి పేరే (దక్షిణామూర్తి అని) పెట్టుకున్నారు. హాసం పత్రికలో మా తాతగారి గురించి వ్రాసిన మిమ్మల్ని అభినందిస్తున్నాము.

-శ్రీమతి కె.శైలజ, హైదరాబాద్

---

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.



# బాలూ జన్మ రహస్యం కథ

## సుమారు యాభై ఆరేళ్ళ క్రితం...

"నాథా! జీవరాశిని మీరెంత సృష్టించినా పలుకు, చదువు, సంగీతం ఇవన్నీ నా ప్రసాదమే కదా" అంది సరస్వతి.

"ఇంతకీ ఇప్పుడేమంటావ్ దేవీ?" అడిగాడు బ్రహ్మ.

"మీ సృష్టికి నేను మెరుగులు దిద్దగలను. కానీ వాటిని మరిపించే ఆశ్చర్యానుభూతిని నాకు కలిగించగలరా?"

"చాలా విచిత్రంగా ఉంది దేవీ నీ పందెం. సరే - ఈ ముచ్చట కూడా నన్ను తీర్చనీ"

అంటూ ఓ జీవిని సృష్టించాడు బ్రహ్మ.

"ఇతడికి నేను నంబర్‌వన్ నేపథ్య గాయకుడిగా రాణించగల గళాన్ని ప్రసాదిస్తున్నాను"

అంది సరస్వతి.

"సరే...ఆ గళాన్ని ఎవరికైనా సరిపోయే విధంగా మార్చుకోగల తెలివితేటల్నీ, శక్తిని ఇతడికి నేనిస్తున్నాను".

"ఆహా...అయితే ఇతన్ని ఆ నటరాజ అనుగ్రహంతో నటుడిగా కూడా మారుస్తున్నాను"

మధ్యలో శివుణ్ణి కూడా ఇరికించావు కాబట్టి నేను కొంచెం తగ్గాను. కానీ నీ కోరిక ప్రకారం కొసమెరుపు ఇవ్వాలిగా, అంచేత ఇతడు నటుడైనా ఎక్కువ చిత్రాల్లో నటించడు. ఎంతో మంది నటులకు డబ్బింగ్ చెప్తూ వాళ్ళ భావప్రకటనలకు మరింత పేరు తీసుకొస్తాడు".

"అలా వచ్చేరా...అయితే ఓ తెలుగు సినిమాలో ఇతనో పాట రాస్తాడంతే...చూశారా రచయితగా మార్చాను"

"పిచ్చి సరస్వతీ...నేనింకో రూట్లో వస్తా చూడు - ఇతను తెలుగు సినిమాకి రాసే ఆ పాట ఇంగ్లీషు పాట అయిపోతుందంతే!"

"నాథా...ఇదన్యాయం"

"పోన్లే... మధ్యలో ఓ నాలుగైదు తెలుగు ముక్కలు కూడా పెడతాడ్లే...! అంతేనా ఇంకేవన్నా ప్రసాదిస్తావా వరాలు?"

"ఇతణ్ణి నేను సంగీత దర్శకుడిగా చేస్తున్నాను"

"అయితే హోరు సంగీతం రాజ్యమేలే కాలంలో ఇతణ్ణి పడేస్తున్నాను".

"నాథా...నేను కోరింది నా మెరుగులను మరిపించే ఆశ్చర్యానుభూతిని...అంతేగాని, శాపాన్ని కాదు"

బ్రహ్మ నాలిక్కరుచుకున్నాడు.

"పొరపాటయిపోయింది దేవీ...మగతనం మగతలో కాస్త మాట తూలేను. నా వాక్కు కూడా తిరుగులేనిదే కదా! సరే...ఆ హోరు సంగీత కాలంలో కూడా మధుర రమ్య గీతాలను స్వరపరచగలిగే నిబ్బరాన్ని ఇతడిలో నిలుపుతున్నాను".

"చక్కటి సంభాషణా చాతుర్యాన్నిస్తున్నాను నేను"

"అది అతని బంధు మిత్రులకే పరిమితం కాకుండా అందర్నీ అలరించగలిగే విఖ్యాత వ్యాఖ్యాతగా మలుస్తున్నాను"

తర్వాత ఏం చెయ్యాలో తెలియని ఆలోచనలో పడింది సరస్వతి.

"ఏం దేవీ! అయిపోయిందా...ఇంకా ఉందా?"

పలుకుల రాణికి పదాలు కరువయ్యేయి.

"సరే...నేనిప్పుడు కొన్ని ఇతనికిస్తున్నాను, వాటిని మించినవి ఇవ్వగలవా?"

ఆసక్తిగా చూసిందామె బ్రహ్మ వైపు.

"ఎన్ని ఉన్నత శిఖరాలు అధిరోహించినా గర్వపు గాలి నింపుకో(లే)ని అంతరంగం, అందులో అన్ని వేళలా ప్రవహించే సంస్కారం ఉంచుతున్నాను. అంతే కాదు. మీ అత్తగారు లక్ష్మీదేవి తననెంత కరుణించినా - తానెప్పుడూ నీ పక్షమే వహిస్తూ నీ పుత్రులనే గౌరవిస్తూ, వారు రచించిన ఎన్నెన్నో పుస్తకాలకు ఆర్థిక సహాయం చేస్తూ ఉంటాడు. నీ మానస పుత్రుడి పేరిట శిలా విగ్రహాన్ని పెట్టిస్తాడు. తనకు గుర్తింపుని ఇచ్చిన గురువు పేరిట మరో పది మందికి ఉపాధిని కల్పించే ఓ స్వరసాధనాలయాన్ని నిర్మిస్తాడు.

'డబ్బు పాపిష్టిది అని అంటారు కానీ నీ ఇంట కాలు పెట్టినందుకు నన్నూ నిందల బారినుండి ఎంత గొప్పగా తప్పించావయ్యా' అని మీ అత్తగారు కూడా ప్రశంసించేలా తన జన్మను చరితార్థం చేసుకుంటాడు. ఇప్పుడు చెప్పు దేవీ...ఇంతకు మించి ఇంకేమైనా ఇవ్వగలవా నువ్వు!?"

తల దించుకుంది సరస్వతి అశక్తురాలై.

"అందుకే అంత గీర్వాణం పనికిరాదు గీర్వాణీ!" అంటూ ఆ జీవికి ప్రాణం పోశాడు బ్రహ్మ.

"నాథా...నేనోడిపోయానని ఒప్పుకుంటున్నాను. ఇంతకీ ఇతడికి ఏ ఇంట్లో జన్మను ఇస్తున్నారు?"

"సద్బ్రాహ్మణుల వంశంలో"

"మరి వేద మంత్రాలే వల్లె వేస్తాడేమో!?"

"లేదు దేవీ...ఇతడు ఉచ్చరించడు... ఆచరిస్తాడు...కనుక అవి వేద మంత్రాలు కావు...స్వేద మంత్రాలు"

"స్వేద మంత్రాలా?"

"అవును...మనం పోటీ పడుతూ ఇచ్చిన వరాలతో ఇతడు రోజుకు పద్దెనిమిది గంటలకు పైగా శ్రమిస్తాడు"

"ఈ ప్రత్యేక సృష్టి ఎన్ని విచిత్రాలు చేస్తుందో నాకు చూడాలని ఉంది...త్వరగా భూలోకానికి పంపండతన్ని" అంది సరస్వతి ఆత్రుతగా.

"అలాగే" అంటూ ఆశీర్వదించాడు బ్రహ్మ చిరునవ్వుతో...



ఆనాటి ఆ పురాణ దంపతుల సంవాద ఫలితమే ఈనాటి మన యస్.పి. బాలసుబ్రహ్మణ్యం

-రాజా

తెరిచిన పుస్తకం లాంటి యస్.పి. బాలసుబ్రహ్మణ్యం సినీ జీవితంలో ప్రతీ పేజీ, ప్రతీ పేరా, ప్రతీ వాక్యం, ప్రతి అక్షరం - ప్రతి తెలుగువాడికీ కంఠోపాఠమే! ఆయన పాడిన పాటలను, ఆయనతో ఇంటర్వ్యూని ప్రత్యేకంగా వెయ్యకపోవడానికి - అందుకు బదులుగా ఈ చమత్కార రచనను ప్రచురించడానికి గల ముఖ్య కారణం అదే! - ఎడిటర్.



# భార్యాభర్తల స్పెషల్






"ఎందుకురా... విచారంగా కనిపిస్తున్నావ్?"

"మా ఆవిడ ఉద్యోగం కోసం తెగవెతుకుతోందిరా..."

"దానికి నీకెందుకురా విచారం?"

"ఆవిడ ఉద్యోగం వెతికేది నాకోసమే రా బాబూ...".



'ఆదివారం నాడు మా స్నేహితురాల్ని మనింటికి టీకి పిలిచాను. మీరేమీ వికారాలు పోకూడదు. మామూలుగా ప్రవర్తించాలి" చెప్పింది భార్య.

"అంటే ఏంటో నా కర్థం కావటం లేదు..." అన్నాడు భర్త.

"మీరు రోజూలాగా టీ అంతా ఒకేసారి సాసర్లో పోసుకుని తాగకూడదు" చెప్పింది భార్య.

"మరయితే నన్ను ఎలా తాగమంటావ్" అడిగేడు భర్త.

"ఏముంది కప్పుతోనే తాగాలి..." కోపంగా అంది భార్య.

"ఏంటి కప్పుతో తాగాలా? చెంచా నా కంట్లో గుచ్చుకోదూ?" అన్నాడు భర్త.



'నువ్వు మీ ఆవిడతో తగవులాడటం మానెయ్యాలి. సంసారమనే రథానికి భార్యాభర్తలిద్దరూ రెండు చక్రాల వంటి వారు... తెల్సిందా?" చెప్పబోయాడు.

"నిజమే కావచ్చు. కానీ ఒకటి సైకిల్ చక్రం... మరొకటి ట్రాక్టర్ చక్రం అయితే ఎలా వుంటుందో మీరే చెప్పండి"అన్నాడు భర్త దీనంగా.



ఒకావిడ వాళ్లయన గురించి చెప్పుకుంటోంది-

"ఆయనకు దురలవాట్లు ఏమీ లేవు తెలుసా. పేకాట ఆడరు, తాగరు, చీకటి పడే లోపునే ఇల్లు చేరతారు"

ఫ్రెండు వెక్కిరింతగా అడిగింది -

"... సిగరెట్లు కూడా తాగరా?"

"తాగుతారనుకో. సుష్టుగా, తృప్తిగా భోంచేసినప్పుడు ఓ సిగరెట్ తాగందే తోచదంటారు. అంటే ఏడాదికి ఒకటి రెండు సార్లన్న మాట. అదేమైనా పెద్ద అలవాటా?"



"పాడటం వలన రక్తం వేడెక్కుతుందని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు మీకు తెలుసా?" అంది ఇల్లాలు.

"నిజమే... ఎందుకంటే నువ్వు పాడుతున్నప్పుడల్లా నా రక్తం వేడెక్కుతూ వుంటుంది...." రెడీగా ఒప్పుకున్నాడు భర్త.



అహోరాత్రులు క్లబ్బులో పేకాట యజ్ఞంలో మునిగి తేలే పాపారావు ఆవేళ ఓ శవం ఊరేగింపు క్లబ్బు పక్కనుంచి వెళుతుంటే పేకాట ఆపి లేచి నిలబడడం అతని ఫ్రెండుకు ఆశ్చర్యం కలిగించింది.

"మీకంత సెంటిమెంటు ఉందని నేను ఎన్నడూ అనుకోలేదు" అని మెచ్చుకున్నాడు.

"అదేమిటోయ్, భార్యాభర్తలన్నాక ఆ మాత్రం సెంటిమెంటు ఉండదూ! పెళ్లాం శవం పక్కనుండి వెళుతూ ఉంటే కాస్సేపు ఆట ఆపితే తప్పేముంది చెప్పు" అంటూ ఇంకా ఆశ్చర్య పడ్డాడు పాపారావు.




# భార్యాభర్తల స్పెషల్





"ఏరా ఆనంద్... నీ భార్యకు ఆ కొత్త నర్సింగ్ హోమ్‌లో ఆపరేషన్ చేయిస్తున్నావా? ఆ డాక్టరుకు యిదే మొదటి ఆపరేషన్ కేసంటగా?"

"పోనీలేరా సక్సెసయితే అదృష్టం... అతడిది... కాకపోతే నాది..."



రాత్రి సమయం. చల్లగా గాలి వేస్తోంది.

"నేను పాట పాడతాను. మీరు తాళం వేయండి.." అంది భార్య

"తాళం ఎప్పుడో వేశాను. ఇక ఎవరూ రారు. నువు పాడటం మొదలెట్టు.." అన్నాడు భర్త ధీమాగా.



"దొంగతనం జరగ్గానే మీరు ఎందుకు ఫిర్యాదు చేయలేదు? ఇంటికి వెళ్ళగానే బీరువా తెరిచి వుందంటున్నారు. వస్తువులన్నీ చెల్లాచెదురుగా పడి వున్నాయని అంటున్నారు. అయినా మీకసలు అనుమానం రాలేదా?" అడిగేడు పోలీస్.

"దొంగలు పడ్డారని నాకేం తెలుసు? ఎప్పటిలాగా మా ఆయన సాక్సుల కోసంవెతుక్కున్నారేమోనని అనుకున్నానంతే..." చెప్పింది భార్యామణి.



"నిద్రలో నన్ను తిడుతున్నారేంటి?" అని పొద్దున్న అడిగింది భార్య-భర్త వంక కోపంగా చూస్తూ.

"అయితే నిద్రలో మనిషికి ధైర్యం పెరుగుతుందన్నమాట నిజమేనన్నమాట..." నసిగాడు భర్త.



"నా పెళ్ళయ్యాక ఒకే ఒక్కసారి మా ఆవిడ నా మాట విందిరా..." గొప్పగా చెప్పుకున్నాడు శేఖరం తన స్నేహితుడు వెంకటేశంతో

"అలాగా... ఎప్పుడో అది?"

"ఆ మధ్య భూకంపం వచ్చినప్పుడు ... ఏమేవ్ బయటికొచ్చేయ్' అని అరిచా. అంతే టక్కున బయటికొచ్చేసింది".



"నిన్ను చూస్తుంటే ఆ సముద్రమే గుర్తుకు వస్తోంది...." అన్నాడు భర్త..

"ఏం... నేను అంత గంభీరంగా ఉంటానా లేక లోతైన మనిషినా?"

"ఏం లేదూ హోరెత్తించేస్తుంటేను'.




విడుదల : ఆదిత్య
వెల : రూ.38/-




ఉదయ్ కిరణ్, అనిత జంటగా వి.యన్. ఆదిత్య దర్శకుడిగా ప్రముఖ నిర్మాత బూరుగపల్లి శివరామకృష్ణ నిర్మించిన 'శ్రీరామ్' ఆడియో క్యాసెట్ విడుదలయింది. క్రేజీ మ్యూజిక్ డైరెక్టర్ ఆర్పీ పట్నాయక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సిరివెన్నెల రాసిన 'పెదవుల్లో పెప్సీకోలా కులుకుల్లో కోకోకోలా' పాటని పట్నాయక్ పాడబట్టి పాటకొక ప్రత్యేకమైన హోదా కలిగినట్టయింది. ట్యూన్ యువతకు పట్టి తీరుతుంది. మొదటి చరణంలో 'వానవిల్లే ఖంగు తినేలా ఇన్ని రంగులు చూపాలా' దగ్గర రెండో చరణంలో 'ఎగిరిపోరా గాలిపటంలా వయసు మీ వెనకాలా' దగ్గర - ట్యూన్‌ని వింటుంటే 'జీన్స్' సినిమాలో 'హాయ్ ర హాయ్ ర హాయ్‌రబ్బా' పాటలోని 'ఫిఫ్టీ కేజీ తాజ్‌మహల్ నాకే నాకా' అనే ట్యూన్ గుర్తొస్తుంది. ఇక సిరివెన్నెల పరంగా చూస్తే రెండవ చరణం సీతారామ'శాస్త్రీయం'గా ఉంది.

యన్.పి. చరణ్, ఉష పాడిన 'చిన్న చిరునవ్వుతోటి కాలి సిరిమువ్వతోటి' పాట మెలోడియస్‌గా ఉంది. ఈ పాటలో రచయిత కులశేఖర్ ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్లు చాలా బావున్నాయి. 'ప్రేమ నే ప్రేమ కానుకిచ్చాక నమ్మనే లేదుగా (ప్రేమ ప్రేమించి నన్ను మార్చాక నేను నే కాదుగా) ఆ నువ్వే నా జత కలిసి నా నువ్వు అయ్యావుగా' అనే వాక్యాలు చూస్తుంటే సీతారామశాస్త్రిగారి దగ్గర చేసిన శిష్యరికం ఎంతటి ప్రభావంగలదో నని అనిపిస్తుంది. ఇక పాట ఓపెనింగ్ వినగానే 'పద్మవ్యూహం' అనే డబ్బింగ్ చిత్రంలో రెహమాన్ సంగీతాన్ని ఇచ్చిన 'నిన్న ఈ కలవరింత లేదులే' అనే పాట గుర్తొస్తుంది. (దీనికి పట్నాయక్ చెప్పిన సమాధానం 36వ పేజీలో ఉంది చూడండి).

చంద్రబోస్ రాయగా ఆర్పీ పట్నాయక్, కౌసల్య పాడిన 'మామ్మారే మజారే మామ్మారే మజారే' పాట హిట్ సాంగ్ ఆఫ్ ది క్యాసెట్. సినిమా చూసొచ్చాక ప్రతి ప్రేక్షకుడూ 'హమ్' చేసుకునే హాంటింగ్ ట్యూన్ ఇది.

బాంబే జయశ్రీ పాడిన 'తియతీయని కలలను కనడమే తెలుసు కమ్మని ప్రేమలో' పాటను పట్నాయక్ ఇప్పటివరకూ స్వరపరచిన పాటలలో ఒక డిఫరెంట్ కంపోజిషన్‌గా చెప్పుకోవచ్చు. స్వర రచనలో బాలీవుడ్ ప్రభావం చాలా ఉంది. బహుశా ఈ ట్యూన్‌ను మనం పట్నాయక్ చేయబోయే హిందీ సినిమాలలో ఉపయోగించినా ఆశ్చర్యపడనవసరం లేదు. ఇదిలా ఉండగా ఈ పాటను కులశేఖర్, ఆర్.పి. పట్నాయక్ కలిసి రాశారు. ఇప్పటికే వీళ్ళిద్దరి కాంబినేషన్‌కి ఉన్న క్రేజ్‌కి ఈ పాట స్టాండర్డ్ తోడై భవిష్యత్తులో ఇటువంటి స్వరరచనలు పెరిగే అవకాశం లేకపోలేదు. ఈ పాటలో ఎవరెవరి కాంట్రిబ్యూషన్ ఎంత అనే విషయం పై వచ్చే సంచికలో కులశేఖర్ మాటల్లోనే 'హాసం' పాఠకులు చూడొచ్చు.

చంద్రబోస్ రాయగా యస్.పి. చరణ్ పాడిన 'మోనాలిసా మోనాలిసా' పాట - హాయిగా పదే పదే పాడుకునే స్థాయిలో రిపీట్ వేల్యూతో ఉంది. చరణ్ ఈ పాటని పాడిన పద్ధతి చూస్తే తండ్రి బాలు గారి ఇన్‌ఫ్లూయెన్స్‌లోంచి పూర్తిగా బైటికి వచ్చి పాడినట్టు అనిపిస్తుంది. అయినా పట్నాయక్ స్టయిల్ ఆఫ్ సింగింగ్ ప్రభావంలోంచి తప్పించుకోలేక పోయినట్టనిపిస్తుంది. ఇక చంద్రబోస్ గురించి చెప్పాలంటే ఈ పాటలో ఆయన స్కీమింగ్ ఎంతో ఉదాత్తంగా గౌరవప్రదమైన స్థాయిలో ఉంది. అందుకు రెండు చరణాలలోని సాహిత్యాన్ని ఓ రెండుసార్లు గమనిస్తే చాలు. పల్లవిలో 'మోనాలిసా/నీ బానిసా' కాయినింగ్ రెగ్యులర్‌గా ఉన్నా తర్వాతి లైన్లో 'నీ ప్రేమకై ఊగిందిలే ఎద ఊగిసా' అంటూ చేసిన కాయినింగ్ - భేషజం లేకుండా భేషనిపించేలా ఉంది.

పట్నాయక్ సినిమా అనగానే ఒక ఫోక్ సాంగ్ ఉండి తీరాలన్నది ఇప్పటి కమర్షియల్ ఫార్ములా. అందుకే పట్నాయక్ తనకు బాగా తెలిసిన రూటు, మన వాళ్ళకి కొత్తగా ఉండే రూటు పట్టి - ఒరియా ఫోక్ సాంగ్ 'రంగో బోతీ' నుంచి ఇన్‌స్పిరేషన్ తీసుకుని 'బుల్లీ బుల్లీ నా బొండు మల్లీ' అనే పాటను చేశాడు. కులశేఖర్ రాయగా ఈ పాటను ఆర్పీ పట్నాయక్, ఉష పాడారు.

చూస్తున్నవాడితో ఇంకా ముచ్చట్లేమిటి?" అంటూ ఆవిడ ఉసిగొలపడమేమిటి, కుబేరరావు అనంత్ మీదకు ఉరకడమేమిటి రెండూ ఒకేసారి జరిగాయి. కానీ ఈ లోపునే అనంత్ పుటికీలు కొట్టుకునే పాత టెన్నిస్ బాల్ కుబేరరావు ప్రయత్నాలకు గండి కొట్టింది. వచ్చి అతని పాదాల కింద పడింది. కుబేరరావు గోడవైపుకి దూసుకుపోతూండగానే అనంత్ ఆ గదిలోంచి బయటపడి, బయటనుండి గడియ పెట్టేయడం జరిగింది.

ఆ తరువాత ఐదు నిమిషాలలోపున కట్టుబట్టలతో, జేబులో క్రెడిట్ కార్డుతో అనంత్ బెంగుళూరు పారిపోయేడు, అచలపతికి తన సామ్రాజ్యం అప్పజెప్పి. ఈ దంపతులు, ఆ క్షతగాత్రుడు ఇల్లు ఖాళీ చేసేకనే తనకు కబురు చేయమన్నాడు.

****

పదిహేను రోజుల తర్వాత బెంగుళూరులో టాక్సీలో వెళుతుండగా 'దుర్గా సూప్స్' అని ఓ పెద్ద బోర్డు అనంత్ కంటపడింది. పైన 'చూస్తే ఆగలేరు' అని క్యాప్షన్. దాని కింద ఆకలి చూపులతో ఓ సూప్ బౌల్ కేసి చూస్తున్న ఓ ఆత్రగాడి బొమ్మ. బొమ్మ ఎక్కడో చూసినట్టు, అతనికి తనకీ పోలికలు ఉన్నట్టు అనిపించింది అనంత్‌కి. కొద్ది సేపట్లోనే తట్టింది - అది తన బొమ్మేనని, రుక్మిణి వేసి ఇచ్చిన కళాఖండం ఇలా బజార్న ఎలా పడిందో అతనికి అర్థం కాలేదు.

వెంటనే విమానంలో ఇంటికొచ్చి పడ్డాడు. అచలపతి తలుపు తీస్తుండగానే గంభీరంగా మొహం పెట్టి, "అచలపతీ, సంగతేమిటి?" అన్నాడు.

"పోస్టరా, సర్? రెస్పాన్స్ చాలా బాగుందిట సర్. సూప్ అమ్మకాలు కూడా పెరిగాయట.

"అమ్మకాల మాట అడగలేదు నేను. నా బొమ్మ దాంట్లో... ఎలా... అందునా అంత దారుణమైన పోజులో..." అనంత్‌కి మాటలు దొరకటం లేదు.

"సర్, ఏదో ఒకటి చేసి కుబేరరావుగార్ని, దుర్గగార్ని ఎలాగోలా ఊరుకోబెట్టమన్నారు కదా..."

"అంటే మాత్రం? ఇలా బొత్తిగా నా బొమ్మ వీధుల కెక్కించి..."

"..ఊరుకోబెట్టడం చాలా కష్టమైంది సర్. దుర్గగారు రెచ్చగొట్టడం వలన కుబేరరావు గారు మరీ రెచ్చిపోయారు. ముఖ్యంగా గోడకు గుద్దుకుని ముఖం బద్దలయి, కాలు బెణికి మంచం మీద పడివుండడంతో మరింత కసిగా ఉన్నారు. డామేజి కేసు పెట్టి మిమ్మల్ని శంకరగిరిమాన్యాలు పట్టించందే వదిలి పెట్టనన్నారు. వాటిల్లో చాలా అనుభవం ఉందిట. చాలా సంపాదించాడట కూడా...."

"...అయితే మాత్రం, బొత్తిగా నా బొమ్మను.... రుక్మిణి నా మీద గౌరవంతో వేసి ఇచ్చిన బొమ్మను... అవమానించి"

"..మంచం మీద నుండి లేచిన రోజునే కుబేరరావు గారు ఆ బొమ్మ చూడడం సంభవించింది. హాల్లో దాన్ని పెట్టాలనే మీ కోరికను ఆ ముందురోజే నేను తీర్చగలిగాను. బొమ్మ చూస్తూనే ఆయన ఆలోచనలో పడ్డారు. ఆయన ఆలోచన చూసి నేనే సజెస్టు చేశాను. ఇలా పోస్టరు డిజైన్ చేసి, మార్కెట్ చేస్తే వాళ్ల సూప్స్ బాగా అమ్ముడుపోతాయని. ఆయనకి ఆ ఐడియా నచ్చింది. ముఖ్యంగా బొమ్మలో ఆకలి చూపులు ఆయన్ని ఆకర్షించాయి."

"కానీ... ఆ బొమ్మ మీద కాపీరైట్ రుక్మిణిది. ఆమెకు చెప్పకుండా అలా ఉపయోగించడం నేరం. కళకు ద్రోహం చేయడం..."

"చెప్పకపోవడం ఏమీ లేదండి... రుక్మిణిగారిని రప్పించారు. ఫల్గుణరావు ఆమె ప్రతినిధిగా వ్యవహరించి బావగారితో బాగా బేరాలాడి రుక్మిణిగారికి మంచి రేటు ఇప్పించాడు. ఆవిడ హక్కులు వదులుకున్నారు."

"ఫల్గుణరావుకి అంత నేర్పు ఉందా? ఏదీ ఆ గ్రీకు వీరుడితో బేరాలాడేటంత దమ్ము ఉందా? ఆశ్చర్యంగా ఉందే?"

"సుమనోహరిగారూ అదే అన్నారండి. అంటూనే ముచ్చటపడ్డారండి. అటువంటివాడికి భార్యగా ఉండడానికి పెట్టి పుట్టాలన్నారండి".

"అంటే?"

"అవునండి. సుమనోహరి గారు రాంపండు గారికి టాటా చెప్పేసి ఫల్గుణ్‌గారిని పెళ్లాడబోతున్నారండి".

అనంత్ కాస్సేపు ఏమీ మాట్లాడలేదు. కథలో మలుపులు అర్థం చేసుకోడానికి, జీర్ణించుకోవడానికి కాస్త టైము పట్టింది. "సుమనోహరికి ఫల్గుణుడు దక్కాడు. రుక్మిణికి డబ్బులు దక్కాయి. కానీ మధ్యలో నా బొమ్మ వాడనివ్వడం వల్లన నాకు కలిసి వచ్చింది ఏమిటి?"

"కోర్టుల చుట్టూ తిరగనక్కరలేకపోవడం" అన్నాడు అచలపతి మంచినీళ్లు అందిస్తూ.

-ఎమ్బీయస్ ప్రసాద్

(పి.జి. ఉడ్‌హావుస్ 'ది స్పాట్ ఆఫ్ ఆర్ట్' కథ ఆధారంగా)

## జస్ట్ ఫర్ ఫన్

### తప్పిపోయిన గాడిద



ఓ గాడిద ఓ ఇంటి ముందు నిలబడి ఉంటే - అదే రూట్లో వెళుతున్న మరో గాడిద ఆగి అడిగింది - "ఏంటి ఇక్కడ నించున్నావ్?" అని.

"మా అబ్బాయి నిన్నట్నుంచీ కనబడ్డంలేదు గురూ! ఈ ఇంట్లోంచి 'నువ్వు గాడిదకొడుకువంటే నువ్వే గాడిదకొడుకువ'ని మాటలు వినబడుతున్నాయి. బయటికి వస్తే మావాడెవడో గుర్తుపట్టి తీసుకెళ్దామని వెయిట్ చేస్తున్నాను", చెప్పింది రెండో గాడిద.

- కోనే నాగ వెంకట ఆంజనేయులు

(ఉక్కునగరం)












**విడుదల : మయూరి**
**వెల : రూ.38/-**

రోహిత్, అనితా పటేల్ హీరో హీరోయిన్లుగా జి.నాగేశ్వరరరెడ్డి దర్శకత్వంలో యమ్. కుమారస్వామి, ముత్యాల ఆంజనేయులు నిర్మించిన 'గర్ల్‌ఫ్రెండ్' ఆడియో విడుదలయింది. వందేమాతరం శ్రీనివాస్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

తైదాల బాపు రాయగా సంగీత దర్శకుడు చక్రి గాయకుడిగా పాడిన 'లైనువెయ్యరా టీనేజ్ గర్ల్‌ని ట్రై చేయరా' పాట - ఫుల్ బీట్ సాంగ్. యూత్‌ని హాల్లో ఉన్నంతవరకు ఆనందింప చేస్తుంది. చంద్రబోస్ రాయగా కుమార్‌సాను, ఉష పాడిన 'నువ్వు నాకు నచ్చావే ఓ ప్రియతమా ప్రాణాలే ఇస్తానే ఓ నేస్తమా' పాట వింటున్నంత సేపు ఏ ఇబ్బందినీ కలిగించని పాట. ప్రేమించే అంశాలను పేర్కొనే స్కీమింగ్‌లో 'ప్రేమే లేకుంటే మరణాన్నే ప్రేమిస్తా' అనే చక్కటి ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు చంద్రబోస్. పాటలో కుమార్‌సాను గొంతు హాయిగా ఎక్స్‌ప్రెసివ్‌గా కనిపించింది. ఉదిత్‌నారాయణ్ పాడిన 'నువు యాడికెళ్తే ఆడికొస్తా సువర్ణా / నీ ఇంటి పేరు మారుస్తా సువర్ణా' పాట అటు యూత్‌ని ఇటు కొంత నడివయసువారిని కూడా అలరించేట్టుంది. పాటను సుద్దాల అశోక్‌తేజ చాలా ఆకర్షణీయంగా రాశాడు.

తైదాల బాపు రాయగా సంగీత దర్శకుడు ఆర్.పి.పట్నాయక్, ఉష పాడిన 'ప్రేమెంత పని చేసే నారాయణ' పాట పాత పాటల ప్రమాణాలతో ఉంది. అందుకు భీంప్లాస్ రాగం ఎంతగానో సహకరించింది. తైదాల బాపు రాయగా శంకర మహదేవన్ పాడిన 'కందిరీగ నడుమ ఉన్న చిన్నది కత్తిలాంటి చూపు దీనికున్నది' పాట పూర్తిగా గాయకుడి రేంజ్‌ని దృష్టిలో పెట్టుకుని ట్యూన్ చేశారా లేదా పాట రేంజ్‌ని బట్టి గాయకుడిని ఫిక్స్ చేశారా అన్నంత పెర్ఫెక్ట్‌గా మ్యాచ్ అయింది. మొదటి చరణంలో 'స్టయిలే దీని స్మయిలే పారిస్ ఈఫిల్ టవరే' అనే లైను రెండవ చరణంలో 'కదిలే నీ కురులే అట్లాంటిక్‌లో అలలే' అనే లైను అందుకు సాక్ష్యంగా నిలబడతాయి. తైదాల బాపు రాయగా శంకరమహదేవన్, ఉష పాడిన 'తళుకు తళుకు తారకా ఒంపుల సిరి మేనకా రావే రేపల్లె గోపెమ్మా' పాడిన మంచి... నిజంగా మంచి బీట్ ఉన్న పాటగా చెప్పాలి. ఫోక్ బేస్డ్ సాంగ్ కనుక చక్కని దరువు, దమ్ము ఉన్న పాటగా చెప్పుకుంటే సరిపోతుంది.

మ్యూజిక్ పరంగా ప్రస్తుతం టాక్ ఆఫ్ ది ఇండస్ట్రీగా చెప్పుకోబడుతున్న ఆర్.పి.పట్నాయక్, చక్రి, మరొక సీనియర్ మ్యూజిక్ డైరెక్టర్ వందేమాతరం శ్రీనివాస్ సంగీత దర్శకత్వంలో పాడడం ఈ ఆడియోకి ఓ రికార్డు.

పట్నాయక్ సౌమ్యుడు...సంస్కారి అని అతడితో పరిచయం ఉన్న ప్రతివారూ ఒప్పుకుంటారు. 'శ్రీరామ్' చిత్రంలో 'చిన్న చిరునవ్వుతోటి' పాట పల్లవి రెహమాన్ పాటని గుర్తు చేయడం సంగీత ప్రియులందరి మధ్య చర్చించుకునే ఓ అంశంగా మారింది. ఈ విషయమై పట్నాయక్‌ని అడుగుదామనుకుంటుండగానే ఆయనే తన స్వంత స్టూడియో 'ప్రాడిజీ'కి వెళుతూ కనిపించారు. 'హాసం'ని చూడగానే కారాపి దిగి 'శ్రీరామ్ పాటలు విన్నారా?' అంటూ అడిగారు. వెంటనే ఈ అంశాన్ని ఆయన ముందుంచింది 'హాసం'.



దానికాయన ఎంతో నిజాయితీగా స్పందిస్తూ - ఆ పాట పూర్తిగా రికార్డ్ అయిపోయాక మా అసిస్టెంట్స్ నా దృష్టికి తెచ్చారు. రెహమాన్‌గారి ఆ పాట నేను వినలేదు. ఇలాటి సంఘటనే ఇంతకు ముందొకటి జరిగింది. ఓ సారి ఓ ట్యూన్ అనుకుని మా ఫ్రెండ్స్‌కి వినిపించాను. చాలా బావుంది అని అన్నారు. నెలరోజుల తర్వాత 'దౌడ్' హిందీ సినిమాలో అదే టైప్ ట్యూన్ వినిపించేసరికి మేం అంతా ఆశ్చర్యపోయాం. ఇంత కోయిన్స్‌డెన్స్ ఉంటుందనుకోలేదు. అలాటిదే ఈ పాటక్కూడా జరిగిందనుకుంటున్నాను. నేను ఎప్పుడైనా ఒకపాట ఇన్స్పిరేషన్ తీసుకోవటం జరిగితే దాన్ని ఎక్నాలెడ్జ్ చేస్తాను కూడా! 'శ్రీరామ్' సినిమాలో 'బుల్లీ బుల్లీ' పాటకి ఒరియా ఫోక్ సాంగ్ 'రంగో బోతీ'ని తీసుకుని క్యాసెట్ ఇన్‌లే కవర్ పై ఎక్నాలెడ్జ్ చేశాం. చూసే ఉంటారు" అని వివరించారు.

రచన: సీతారామశాస్త్రి **1** గానం: ఆర్.పి.పట్నాయక్

ప: పెదవుల్లో పెప్సీకోలా
కులుకుల్లో కోకోకోలా (2)
ఒక్కోలా ఉందిర బాలా
దిల్ ధడక్ ధడక్కలా
ఎవ్రీడే_హోలీలా_ఉంటుందే_ మీవల్లా_

చ హంస నడకలు సిగ్గు పడేలా
పిల్లినడకల స్టైలా
హింస పెట్టి చంపేసేలా
కొంపముంచే స్టైలా
వానవిల్లే ఖంగుతినేలా
ఇన్ని రంగులు చూపాలా
మేల్ జాతికి కీడొచ్చేలా ఉంది మీ వల్లా ॥పెదవుల్లో॥

చ పడుచు పాపలు నవ్వితే ఇలా
ఫాంటసీ ఫౌంటెన్‌లా
నైటు మొత్తం నాటీ కలలే
శాటిలైట్ ఛానల్‌లా
ఎగిరి పోదా గాలి పటంలా
వయసు మీ వెనకాలా
గుండె నమిలేలా నడవాలా నెమలి పింఛంలా ॥పెదవుల్లో॥

రచన:కులశేఖర్ **2** గానం: యస్.పి.చరణ్, ఉష

ప/అ: చిన్న చిరునవ్వుతోటి
కాలి సిరిమువ్వతోటి
కొత్తగా చెప్పెనమ్మా కన్నెప్రేమా
అ: నీలి మేఘాలలోనా
నీటి ముత్యాలలాగా
గుండెలో చేరేనేమో ఇంత ప్రేమా
నువ్వే నువ్వే నాలో ఇలా సాగే మనోభావనా
నువ్వే నువ్వే నాలో ఇలా పాడే ప్రియాలాపనా అ: ॥నీలి॥
చ/అ: ప్రేమలో తేలితే ఈడుకి మాటలే ఉండవా
అ: ఇద్దరూ ఒక్కటై ఉండగ మాటలే దండగ



బిగిసి పోతాను[illegible] ఆత్మబంధమై
కరిగిపోలేనులే నీ కంటి బిందువై
నిత్యమూ చేయనా నీ గుండెలోనే బస ॥మోనాలిసా॥

రచన : కులశేఖర్ **6** గానం : ఆర్.పి.పట్నాయక్, ఉష

ఏ రంగో బోతీ (2) హాయ్ రంగొ బోతీ రంగబోతీ కోనో కోలాథా హోస్లిపతే కోహోకో కోథా గోలాజేగోలాజేలాజే (2) హాయ్ లాబ్‌లజేలాబ్‌లజేములొాయ్‌జేఛే మోథాగోహో నైకోరోనైకోరో హోటూ

ప/అ: బులీ బుల్లీ నా బొండు మల్లీ
బులీ బుల్లీ నా బొండు మల్లీ
హాయ్ పాడరద్దు కుంకుమెట్టి
ముస్తాబయ్యొస్తే ఆడుదామే కోకో కోలాటం
చీర కట్టి సెంటు కొట్టి నా చెంత కొస్తే సూపుతాను కుర్రాడి వాటం
అ: మల్లీ మల్లీ నా మావా మల్లీ మల్లీ చుల్లీ నా మావా మల్లీ హాయ్
డాబు చాలు గాని బాబూ నీ చెంత కొస్తే
ముగ్గులాగ ముడిచేసుకుంటావ్
గడ్డి వాము చాటుకొచ్చి నే సైగ చేస్తే సిగ్గు తోటి లగెత్తుకుంటావ్
చ/అ: ఆ పంచ కట్టేసి ఓ పింఛమెడితే
కిట్టయ్య లాగా మా బాగా ఉన్నావే...
అ: అందాల రాధమ్మ నువుగాని అయితే
నీ పక్క నేను కిట్టయ్య నవుతాలే...
అ: అమ్మదొంగ ఎటకారం వద్దు
అ: ఇంక నాతో చెలగాటం వద్దు ఒక్కటయ్యే వీలే లేదా
అ: ఓ వెన్నదొంగా ఈ కన్నె బెంగ తీరేది ఎట్టాగా
అ: నా సామిరంగా బంగారు జంటా పట్టింది నేనేగా ॥బులీ బుల్లీ॥
చ/అ: నీ నవ్వు ముత్యాలు నే తీసుకెళ్లి
ముత్యాల హారం చేయించి ఇస్తాలే...
అ: నీ సూపు వజ్రాలు నేనేరుకెళ్లి అద్దాల మేడ కట్టించి ఇస్తాలే...
అ: అయ్య బాబోయ్ గాలే కొట్టొద్దు
అ: నువ్వు కూడా అట్టే మొయ్యొద్దు నేనంటేను ప్రేమే లేదా
అ: వయ్యారి బాలా ఓ మేఘమాల పండిందే నా పంట
అ: ఓ సందమామ నా మేనమామ నేనేగా నీ జంట ॥బులీ బుల్లీ॥



రచన : విశ్వ **1** గానం : చక్రి

ప: ఎందుకో ఎందుకో తెలియదు నాకు
నీవెవరివో నేనెవరినో ఎందుకింత నాకూ ॥ఎందుకో॥
నే కనులు మూసినా నీవాయే...నా లోకమే నీవాయే... (2) ॥ఎందుకో॥
చ: కనులు తెరచిన కనులు మూసినా నీవాయే
మనసు మనసుకు భారమైతే మాటలన్నీ మూగబోతే
తెలిసి తెలియక దూరమైతే కలలు అన్నీ వాడిపోతే
ఓదార్చే వారంటూ నాకెవరూ లేకుంటే నీ జ్ఞాపకాలే వచ్చి
జో జో మని నిద్దుర పుచ్చే...
ఎందుకో నిను చూస్తూనే ఒక తీయని అనుభూతి నా సొంతమే...
ఆ క్షణం...ఆనందం...ఆరాటం...ఎందుకో ॥ఎందుకో॥
చ: కలల తీరం చేరువైతే తలపులన్నీ తీయనైతే
మదిని మీటిన కొత్తపాటే ఆశలెన్నో చేరవేస్తే
పురి విప్పి కోరికలే కెరటాలై ఎగసేలే
కనువిప్పె పరువంలో ప్రణయాలే విరిసేలే...
అందుకే నీ ఊసులే తొలి ఆశలై అలజడులే రేపిందిలే
ఈ సునం ఈ దినం నా వశం పరవశం ॥ఎందుకో॥

రచన : మధు **2** గానం : కౌసల్య

ప: హే అల్లరి చినుకా తెమ్మెర మొలకా ఆడెయ్ ఆటలికా...
ఎదురేలేక బెదురేలేక పాడెయ్ పాటలికా...
సన్నగ తానే విరిసీ మరి రమ్మని పిలిచే వేళల్లోనా
ఝుమ్మని తానే కురిసీ దరి రమ్మని పిలిచే వేళల్లోనా
ఆగని ధారల మల్లెల వానా జల్లుల దారుల వానా వానా
తుళ్లిన జావళి వెల్లువ లోనా తుంటరి తోటల సాగే వానా ॥అల్లరి॥
చ: చిగురాకుల అందెలలోనా, చిరుగాలీ సవ్వడిలోనా కూసేటీ గువ్వలు అపురూపమే
ఆనందం సందడిలోనా ఆ విందుల పందిరిలోనా చిందేసే చినుకుల చిరునవ్వులే
ఆ భావాలేవో అనుకోనీ రాగాలైనా ఆ రాగాలేవో నాలో గీతాలైనా
రాగాల్లోనా గీతాల్లోనా నువ్వే ఉన్నా మోహన వనిలో ॥అల్లరి॥
చ: జిలకాలా పువ్వుల తీరూ కిరణాలా వెన్నెల తోడూ అందాల పందాలు ఆరంభమే
ఉల్లాసం దాపులలోనా ఉత్సాహం చేరువలోనా సంతోషం ఎంతంటే ఆకాశమే
ఈ ఊహలు ఏవో ఆ తలపుల మలుపులు ఐనా ఈ ఊసులు నాలో అలలే ఐనా
ఊహల్లోనా ఊసుల్లోనా నువ్వే ఉన్నా మోహన వనిలో ॥అల్లరి॥

రచన : కందికొండ **3** గానం : హరిహరన్

చిన్ని నవ్వు చల్లిపోవే ప్రియతమా చందనాలు చిందిపోవే ప్రాణమా
బిందువై నను తాకిపోవే ప్రియతమా సింధువై మది నిండిపోవే ప్రాణమా
హృది వాణివై ఉదయానివై ఈ హాయిలో కిరణానివై



రచన : సిరివెన్నెల **7** గానం : జీన్స్ శ్రీనివాస్, సునీత

కో: ఆకాశం నీ కోసం పంపిందమ్మా పల్లకి! సావాసం పూమాసం చూపిందమ్మా పిల్లకి!
అదుపెందుకే పద ముందుకే (2) అటు ఇటు చూడకే అడుగులు ఆపకే...
ప/అ: ఆపాలన్నా ఆగేనా...దాచాలన్నా దాగేనా తెలిసీ తెలియని భావానా...ఎగసే మనసెటుపోతున్నా
అ: నిదురించే ఎదలేచే రాగానా...నిను మీటే ప్రియభావం పిలిచేనా...
నీకోసం ఆత్రంగా చూస్తున్నా...రారాదా మది చూపే మార్గానా... కో : హే హొల్లే
చ/అ: ఎక్కడ ఉన్నా ఏం చేస్తున్నా వదలవు క్షణమైనా
ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నా నీ తలపుల్లోనా
అ: కనిపెడుతున్నా నీలో కలిగే కంగారేదైనా అక్కడ ఇక్కడ చూస్తావెందుకు నీలోనే ఉన్నా
అ: ఎటు తప్పుకోను ఈ పైన కనబడదే ఏ దారైనా
అ: కనురెప్పల తలుపేస్తున్నా నీ కలనై కమ్ముకురానా
అ: ఎందుకు నాలోన ఏమీ తోచని ఆలోచన నీ కీర్తన
ప: నిన్నా మొన్నా నాలోనా... కలవరమింతగ కలిగేనా
చెబితే వినదే కాస్తైనా మనసే నా చేయి జారేనా
చ/అ: చేతులు చాచి చెలిమందించే సాగరమైలేనా
మబ్బుల నుంచి నిను రప్పించి స్వాగతమిస్తున్నా
అ: అలజడి పెంచి అల్లుకు వచ్చే అల్లరి చూస్తున్నా ఎల్లలు తెంచి వెల్లువనైనే ఒళ్ళోకొస్తున్నా
అ: జడివాన కాదా చినుకైనా జత పిలిచే సుముహూర్తాన
అ: సుడిగాలి వెంట పడిపోనా నను తరిమే ఊహలపైన
అ: నువ్వెటు పోతున్నా నీతో నీడగా నే సాగనా ఓ మైనా...
ప/అ: అనుకున్నానా ఎపుడైనా ఏదేదో అయిపోతున్నా(2)
అ: అనురాగం శృతి చేసే సమయాన మౌనంగా ఉంటుందా మదివీణా
అవునన్నా కాదన్నా ఏమైనా నావైపే నడిపించక మానేనా కో : హే హొల్లే

రచన : కందికొండ **8** గానం : చక్రి

అ: నీలికళ్లా నిండనిన్నే నింపుకున్నానే జాబిలమ్మా... (2)
నింగిలోనా నీవు వున్నా చేరుకుంటానే చందమామా...
రాజ్యాలు వద్దు రతనాలు వద్దు నీ నవ్వే చాలునమ్మా... నా కలలలోని బొమ్మ... (2)
నీలికళ్లా నిండానిన్నే నింపుకున్నానే జాబిలమ్మ
నిన్నుచూసి కళ్ళు తెరిచే చెలిగుండెలోని ఆశ
నీడనీవై చేరకుంటే ఇక ఆగిపోదా శ్వాస
కలలోననైన నువు దూరమైన కన్నీరు ఆగదేలా
ఎదలోన నిండి నువు తోడు వుంటే దిగులేమిలేదు మనసా
నీ ఊహలో బ్రతుకై నాదన్న లోకమే వీడినా.. ॥నీలికళ్లా..॥

కో: ఇది తారంగమో మరి వీరంగమో
ఈ వంక చూడంగ వేగంగా నింగి వంగి పోయె ॥మామ్మారే॥

రచన: కులశేఖర్, ఆర్.పి. పట్నాయక్ **4** గానం: బాంబే జయశ్రీ

ప: తియతీయని కలలను కనడమే తెలుసు కమ్మని ప్రేమలో
మనసంతా నువ్వని చెప్పడం తెలుసు ప్రేమనే మత్తులో
ఎన్నాళ్ళైనా నేనుండి పోగలను నీ కౌగిళ్ళలో..
నేనెవరన్నది నేమరిచి పోగలను చూస్తూ నీ కళ్ళలో.. ॥తియతీయని॥
చ: చలచల్లని మంచుకు అర్థమే కాదు ప్రేమ చొరవేమిటో
నునువెచ్చని మంటలు ఎరగవేనాడు ప్రేమ సెగలేమిటో
వచ్చీ రాని కన్నీరుకే తెలుసు ప్రేమ లోతేమిటో
ముద్దే లేని అధరాలకే తెలుసు ఈడు బాధేమిటో.. ॥తియతీయని॥
చ: మురిపెంతో సరసం తీర్చమంటోంది ప్రాయమీ వేళలో
తమకంతో దూరం తెంచమంటోంది తీపి చెరసాలలో
విరహంతో పరువం కరిగిపోతోంది ఆవిరై గాలిలో
కలిసుంటే కాలం నిలిచి పోతుంది ప్రేమ సంకెళ్ళలో ॥తియతీయని॥

రచన : చంద్రబోస్ **5** గానం : యస్.పి. చరణ్

ప: మోనాలిసా మోనాలిసా మోనాలిసా మోనాలిసా
నా మనసునే చేశావులే నీ బానిసా
నీ ప్రేమకై ఊగిందిలే ఎద ఊగిసా ॥మోనాలిసా॥
చ: అవతరించింది భూమి నీ అడుగే మోయగా
వెలుగు నింపింది నింగి నీ వైపే చూడగా
శిరసునూపింది పువ్వు నీ సిగలో చేరగా
ఉరకలేసింది గాలి ఊపిరిగా మారగా
జన్మనెత్తానులే నీ ప్రేమ పొందగా
ధన్యమయ్యానులే నీ చూపు సోకగా
జంటగా చేరగా మారిందిలే నా దశ.. ॥మోనాలిసా॥
చ: మెరిసిపోవాలనుంది పెదవింట్లో నవ్వునై
మోగిపోవాలనుంది మది గుడిలో నాదమై
ఒదిగి పోవాలనుంది కౌగిట్లో కాలమై
నిలిచి పోవాలనుంది పాపిట్లో తిలకమై



అ: తీపిరాగాల ప్రేమ గీతాలు పాడగా పల్లవీ
పంచభూతాలు చెంతకే చేరి మోయవా పల్లకీ
ఆ: ఈ ప్రేమే ఇక నడుపునులే బంగారు లోకాలకీ అ: ॥చిన్న చిరునవ్వు॥
చ/ఆ: ముందుగా చూడనే లేదుగ ప్రేమలో తీపినీ
ఆ: అందరూ చేదనే మాటలు ప్రేమలో లేవనీ
అ: ప్రేమనే ప్రేమ కానుకిచ్చాక నమ్మనే లేదుగా
ప్రేమ ప్రేమించి నన్ను మార్చాక నేను నే కాదుగా
ఆ: ఆ నువ్వే నా జత కలిసి నా నువ్వు అయ్యావుగా అ: ॥చిన్న చిరునవ్వు॥

రచన : చంద్రబోస్ **3** గానం : ఆర్పీ పట్నాయక్, కౌసల్య

కో: మామ్మారే మజారే మామ్మారే మజారే
మామ్మారే మజారే మజ్జా
మామ్మారే మజారే మామ్మారే మజారే
మామ్మారే మజారే మజ్జా
అరె ఊరంతా వినేలా పాడు
అహో కొండంత ఖుషీగా ఆడు
మన శ్రీరాముడు మరో జన్మెత్తాడు
మళ్ళీ వచ్చాడు ఈనాడు ॥మామ్మారే॥
చ/ఆ: మనసుల జత వయసుల జత కలిసే వేళ
మనుగడ కథ మధురం కద చాలా చాలా
అ: అందాల నీ ప్రేమ రాజ్యానికి
అధికారి నేనే సుమా
సందేళ సరిలేని సరసానికి
దొరసాని నువ్వే సుమా
ఇలా రెండింతలై అలా మూడింతలై
భలేగుంది పెరిగింది కేరింత ఇంత అంతకంత ॥మామ్మారే॥
చ/ఆ: కాదననిక లేదననిక ఏదేమైనా
రేపన నిక మాపననిక ఏకంకానా
అ: వయ్యారి నీ మేని ఉయ్యాలలో
వెయ్యేళ్ళు ఊగేయనా
వెన్నంటి నువ్వుంటే నా బాటలో
స్వర్గాలు పాలించనా



చ/అ: పప్పుచారులో ఉప్పుచేపలా ఘుమఘుమలాడే ఈడుందిలే
కో: ఘుమఘుమలాడే ఈడుందిలే
అ: బంగారు తీగలాగా మెరిసే సోకే నీదందిలే
కో: ఆ..మెరిసే సోకే నీదందిలే
అ: ఎన్నాళ్ళకెన్నాళ్ళకు వచ్చావులే జగదాంబ సెంటర్లో చూశానులే
తస్సదీయ గ్లామరెంత పెంచావులే ॥సుబ్బలచ్చిమి ..(2)॥
చ/అ: సొరచేప చిక్కావులే వలలోకొచ్చి పడ్డావులే
కో: వలలోకొచ్చి పడ్డావులే
అ: గండుమేను కోమలాంగి గాజుల మోతే బాగుందిలే
కో: నీ గాజుల మోతే బాగుందిలే
అ: కళ్ళల్లో కళ్ళెట్టి చూసెయ్యకే రొయ్యల్ల ఇయ్యాల ఊరించకే పలగ పిల్లలాంటి నడుము ఊపెయ్యకే..
సుబ్బలచ్చిమి సుబ్బలచ్చిమి టచ్‌మి టచ్‌మి సుబ్బలచ్చిమి (2) ॥సుబ్బలచ్చిమి ..(2)॥

రచన: కందికొండ **6** గానం : ఉదిత్ నారాయణ్, కౌసల్య

ప/అ: లవ్వు దోమ కుట్టినాదే ముంబై పోరీ లవ్వేరియా సోకినాదే వన్నెల ప్యారీ.. (2)
ఆ: కొత్త కథలు పాడమాకు చెంతన చేరీ నాకు తెలుసు నీ సంగతి జిత్తులమారి
అ: థర్మామీటరల్లే మారి తేల్చెయ్ యవ్వారం
ఆ: క్రోసిన్ టాబ్లెట్ నేనె తీరుస్తా నీ జ్వరం ॥థర్మా॥
అ: తడుపవే తడుపవే తడుపవే ..
తడుపవే తడుపవే తడుపవే తడుపవే పిల్లో నీ ముద్దుల జడిలో (2)॥లవ్వు దోమ॥
చ/అ: లుక్ చూస్తే మెడిమిక్స్ టేస్ట్ చేస్తే ఆలు చిప్స్ పెట్రో మాక్స్ బ్రైట్ లైటువే
నువ్వే సోకు కంట్రీ క్యాపిటల్ సిటీవే..
ఆ: హాట్ ఛీక్స్ హాయ్ లెగ్స్ తాకి చూస్తే రిథమ్ బాక్స్ టోటల్‌గా ఘాట్ విక్సవే
ఇంక నీకు నాకు జోడి ఫిక్సలే మన ప్రేమే ఓ బోనాఫిక్సలే
అ: రావే బాలా కాంచన మాల గుండెలో బాధ తీర్చెయ్ రాధా (2)
ఆ: బొమ్మ నువ్వు బొరుసు నేనులే హత్తుకుంటే హాయి చిందులే
అ: హాయిలోన రేయి గడుచులే
నువ్వు నేను సింకయితే లింకయితే హిప్ హిప్ హుర్రే.. ॥లవ్వుదోమ॥
చ/అ: ఓ...తొక్కి కదమ్ బేసి రిథమ్ పాడి పదమ్ తట్టి భుజమ్ రెచ్చగొట్టి చంపుతున్నావే..:
నువ్వే రాలుగాయి రంగసానివే
ఆ: మిల్క్‌షేక్ మ్యాంగో జ్యూసు ఘాటు ఘాటు ఛిల్లీ సాసు నీ మనసే మహా స్మూత్‌లే..
నువ్వే ప్యాంటలూన్స్ సూటుగాడివే మరి వైట్‌హౌసు వన్నె కాడివే..
అ: నింగిలో చుక్క చేరవే పక్క జారకే పాపా ఏటిలో చేప (2)
దూకమాకే నువ్వు జింకలా కొండపల్లి కన్నె బొమ్మలా
ఆ: నన్ను చేరి పండువెన్నెల నువ్వు నేను సింకయితే లింకయితే హిప్ హిప్ హుర్రే..॥లవ్వు॥

నా కంటి పాపల్లో దీపాల వెలుగై
నా గుండె లోతుల్లో స్వప్నాల జడివై.. ॥చిన్ని నవ్వు॥
చ: నిను చూస్తూ కూర్చుంటే ఓ సంబరం సంబరం సంబరం..
నా చెంతే ఉన్నట్టు ఆ అంబరం అంబరం అంబరం..
నీ రూపే కలలెన్నో వెదజల్లి పోయిందీ ఎద ఏంటి మేఘంలా ఎగిరెళ్ళిపోతోంది
సఖీ నీవే నాలోని అలజడికి ఆకారం నువ్ కాదా లోలోని తొలి ప్రేమకు శ్రీకారం
నాలోని భావాలు ఇక తెలిపేదెలా ॥చిన్ని నవ్వు॥
చ: ప్రతిరోజు నిదురల్లో ఓ కలవరం కలవరం కలవరం..
కెరటాలై పొంగింది మది సాగరం సాగరం సాగరం...
మనసేమో చిత్రంగా నిన్నేలే అడిగింది ఎద ఏమో ఆత్రంగా నీ కోసం వెతికింది
అణువణువును జత చేసి నిర్మించా గోపురమే
నువు చిందే చిరునవ్వే నా పాలిట ప్రియ వరమే
నాలోని భావాలు ఇక తెలిపేదెలా... ॥చిన్ని నవ్వు॥

రచన : కందికొండ **4** గానం : చక్రి, కౌసల్య

ప/అ:తొలకరివా చిరుసడివా గుండెలో అలజడివా సుందరివా సందడివా సాగర కెరటంవా
పువ్వా పువ్వా పువ్వా ఎదలో మోగుతున్న మువ్వా కో: మువ్వా
గువ్వా గువ్వా గువ్వా మదిపై వాలినావే లవ్వా కో: లవ్వా
జోజో పాపాయంటూ జోలపాడనా కూకూ కోకిలల్లే నీతో సాగనా...ఓ...
చ/అ: నిజమా కలకంటున్నానా లేకా భ్రమపడుతున్నానా (2)
చెలియే వెన్నెలగా చేరెనుగా... కో: హేయాఈయాయీ...
ఆ: గతమే విడువని జతగా నడవని తెలిపెను నాతోనే ప్రణయం
అ: ఏదో తెలియని ఆశే ఎదురై దూరం అయిపోయే విరహం
ఆ: బాపు బొమ్మనవుతూ నీలో ఒదిగి ఒదిగిపోనా
అ: బంధమేసుకుంటూ నీకై కవిత నేను కానా ఆ: ॥తొలకరి॥
చ/ఆ: జగమే ఒకటుందని మరిచా ఎపుడూ నీ పేరే తలిచా (2)
కలలా చిరు అలలా నువ్వొస్తే నే...మైమరిచా
ఆ: నువ్వే నేనని నేనే కనుగొని పరుగులు తీసెను నా హృదయం
అ: గువ్వై కూసెను పువ్వై పూసెను చెలిమై అందెను ఈ నిముషం
ఆ: ఎదలో నిండిపోతూ నీతో ఏకమైపోనా
అ: శ్వాస ఆగువరకూ నీతో పంచుకోన ప్రేమా... ॥తొలకరి॥
అ: జోజో పాపాయంటూ ఆ: జోలపాడనా అ: కూకూ కోకిలల్లే ఆ: నీతో సాగనా...ఓ...

రచన : రవికుమార్ **5** గానం : రవివర్మ

ప: సుబ్బలచ్చిమి సుబ్బలచ్చిమి టచ్‌మి టచ్‌మి సుబ్బలచ్చిమి (2)
మద్దెలపాలెం కుర్రదానా కులుకుందే చానా కొర్రమీనా
ఆడేటి ఓ పిల్లా..అందాల యాపిల్లా..(2) ॥సుబ్బలచ్చిమి ..(2)॥

## తారాగణం

ఉదయ్ కిరణ్, అనిత, ఆశిష్ విద్యార్థి, భరణి, పరుచూరి వెంకటేశ్వరరావు, సుధ, సునీల్, శివకృష్ణ, ధర్మవరపు సుబ్రహ్మణ్యం తదితరులు...




బూరుగపల్లి శివరామకృష్ణ   ఆర్.పి. పట్నాయక్   వి.యన్. ఆదిత్య

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



బూరుగపల్లి శివరామకృష్ణ



వి.యన్. ఆదిత్య



ఆర్.పి. పట్నాయక్

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | : | పరుచూరి బ్రదర్స్ |
| పాటలు | : | సీతారామశాస్త్రి,చంద్రబోస్, కులశేఖర్ |
| సంగీతం | : | ఆర్.పి. పట్నాయక్ |
| ఎడిటింగ్ | : | మార్తాండ్, కె. వెంకటేష్ |
| స్టిల్స్ | : | సెబాస్టియన్ బ్రదర్స్ |
| మేకప్ | : | హరి |
| కాస్ట్యూమ్స్ | : | జగదీష్ |
| డాన్స్ | : | దినేష్, రాజశేఖర్ |
| డైరెక్టర్ ఆఫ్ సినిమాటోగ్రఫీ | : | శివకుమార్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : | సి.హెచ్. శ్రీనివాసరావు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | జి.జి.కె. రాజు |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : | ధర్మక్షేత్ర |
| అసోసియేట్ డైరెక్టర్ | : | శ్రావణ్ |
| కో-డైరెక్టర్ | : | సురేష్ |
| స్క్రీన్ ప్లే | : | పరుచూరి బ్రదర్స్ |
| కథ | : | భరణి |
| నిర్మాత | : | బూరుగపల్లి శివరామకృష్ణ |
| దర్శకత్వం | : | వి.ఎన్.ఆదిత్య |



సీతారామశాస్త్రి



చంద్రబోస్



కులశేఖర్








శ్రీమతి మంజులానాయుడు

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



సుధాకర్ పల్లమాల (జిష్ణు)

## తారాగణం

దీపక్, అర్చన, చంద్రమోహన్, ఇందూ ఆనంద్, మేఘన, కె.కె.శర్మ, జీవా, వై.విజయ, యమ్.ఎస్.నారాయణ, కళ్ళు చిదంబరం, రఘునాథరెడ్డి, శివారెడ్డి, రమ్యశ్రీ,అనూజ, ఈలు, బాబూరావు, సంపత్‌రాజు, చంద్రమౌళి, కోటేశ్వరరావు, క్రాంతిర్మయి, విజయ, నిర్మల, బబిత, ప్రవీణ్‌కుమార్, రామకృష్ణ, చౌదరి, మురళి, శివారెడ్డి, యల్.ఎస్.పాణి,యుగంధర్, మహమ్మద్, దీప్తి, సుందర్, వేణుగోపాల్, నారాయణరావు, అల్లు రమేష్, తానీషా, డి. రమేష్, మధు, కృష్ణమూర్తి, రామలింగస్వామి, కొండలరావు



సీతారామశాస్త్రి



చక్రి



రవికుమార్



విశ్వ



కందికొండ

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మూలకథ | : | వేణుశంకర్ |
| మాటలు | : | సతీష్ |
| పాటలు | : | సీతారామశాస్త్రి,కందికొండ,విశ్వ రవికుమార్,బలభద్రపాత్రుని మధు,విశ్వ |
| సంగీతం | : | చక్రి |
| కెమెరా | : | రాం ప్రసాద్.సి. |
| ఎడిటింగ్ | : | నందమూరి హరి |
| మేకప్ | : | శ్రీకాంత్ |
| కాస్ట్యూమ్స్ | : | మనోజ్, రంగ |
| అవుట్‌డోర్ యూనిట్ | : | ఆనంద్ సినీ సర్వీస్ (హైద్రాబాద్) |
| ల్యాబ్ | : | రెయిన్ బో కలర్ ల్యాబ్ (ఆర్.ఎఫ్.సి) |
| పి.ఆర్.ఓ. | : | రాంబాబు వర్మ |
| స్టిల్స్ : | : | గోపిశెట్టి శ్రీనివాస్ |
| ఆర్ట్ : | : | బాబ్జి |
| సాంగ్స్ రికార్డింగ్ | : | ప్రకాష్ రికార్డింగ్ థియేటర్ మహతి రికార్డింగ్ థియేటర్ |
| డి.టి.యస్ | : | కార్తీక్ గార్డెన్ స్టూడియో (మద్రాస్) |
| ఎఫెక్ట్స్ | : | ప్రీతి స్టూడియో (మద్రాస్) |
| ఫైట్ మాస్టర్ | : | హార్స్‌మెన్ బాబు |
| డ్యాన్స్ మాస్టర్ | : | నల్ల శ్రీను, హరీష్ పాయ్, కృష్ణారెడ్డి |
| డైలాగ్ రికార్డింగ్స్ | : | అన్నపూర్ణ స్టూడియోస్ |
| రీ-రికార్డింగ్ | : | మహతి స్టూడియో |
| ఏవిడ్ ఎడిటింగ్ | : | రామోజీ ఫిలిం సిటీ |
| పబ్లిసిటీ | : | ధనలక్ష్మి సినీ ప్రింటర్స్, (శివకాశి) |
| గ్రాఫిక్స్ | : | ప్రశాంత్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : | బి.సి.చౌదరి, బి.వి.నారాయణ, యం.బానయ్య, నారాయణరావు. |
| పబ్లిసిటీ డిజైనర్ | : | ధని ఏలె |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : | రషీద్ మహ్మద్ ఖాన్, శేషగిరిరెడ్డి |
| ప్రొడక్షన్ కంట్రోలర్స్ | : | నయీమ్, కమలాకర్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : | సత్యవాసు, ఎం.వి.రమణ, వేణుగోపాల్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | వి.గంగాధర్, గోలి వెంకటేశ్వర్లు |
| కో-డైరెక్టర్ | : | దీప్తి |
| నిర్మాత | : | సుధాకర్ పల్లమాల (జిష్ణు) |
| కథ - స్క్రీన్‌ప్లే - దర్శకత్వం | : | శ్రీమతి మంజులా నాయుడు |

కైఫీ ఆజ్మీ స్మృత్యర్థం...

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : పాకీజా |
| సంగీతం | : గులామ్ మొహమ్మద్ |
| రచన | : కైఫీ ఆజ్మీ |
| గానం | : లతా మంగేష్కర్ |
| అభినయం | : మీనాకుమారి |

# చల్‌తే చల్‌తే...

చల్‌తే చల్‌తే, చల్‌తే చల్‌తే
యూఁహీ కోయీ మిల్ గయా థా (2)
సర్-ఎ-రాహ్ చల్‌తే చల్‌తే (2)
వహీఁ థమ్‌కే రహ్ గయీ హై (2)
మేరీ రాత్ ఢల్‌తే ఢల్‌తే (2)
జో కహీ గయీ న ముఝ్‌సే (2)
వో జమానా కహ్ రహా హై (2)
కి ఫసానా బన్ గయా హై (2)
మేరీ బాత్ టల్‌తే టల్‌తే (2) ॥యూఁహీ కోయీ॥
షబ్-ఎ- ఇంతజార్ ఆఖీర్ (2)
కభీ హోగీ ముక్తసర్ భీ (2)
యే చిరాగ్ బుఝ్ రహే హైఁ (2)
మేరే సాథ్ జల్‌తే జల్‌తే (2) ॥యే చిరాగ్॥













కైఫీ ఆజ్మీ ముఖ్యంగా సామాజిక స్పృహతో, మతసామరస్య భావాలతో కూడిన కవిత్వం వ్రాసినా ఆయన వ్రాసిన సినీగీతాలలో ప్రేమ యొక్క వివిధ రూపాలు కళ్ళకు కట్టినట్టు కనబడతాయి. 'కాగజ్ కే ఫూల్' లోని 'వక్త్‌నే కియా క్యా హసీఁ సితమ్; 'పాకీజా' లోని 'చల్‌తే చల్‌తే', 'చలో దిల్‌దార్ చలో', 'హీర్ రాంఝా'లోని 'యే దునియా యే మెహఫిల్', 'అర్థ్'లోని 'తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో', 'ఝుకీ ఝుకీ సీ నజర్' ఇందుకు ఉదాహరణలు.

దర్శకుడు కమాల్ అమ్రోహీ నటి మీనా కుమారిల కలలకు,



కళారాధనకు ప్రతిరూపం 'పాకీజా'. మీనాకుమారి కమాల్ అమ్రోహికి మూడో భార్య. 'పాకీజా' చిత్రానికి వీరు 1958లో అంకురార్పణ చేశారు. అది కార్యరూపం దాల్చి షూటింగ్ ఊపందుకునేసరికి ఏళ్ళు గడిచిపోయాయి. 1964లో అమ్రోహి, మీనాకుమారి విడిపోవడంతో ఆమె ఆరోగ్యం క్షీణించింది. తాను మరణించేలోపల ఈ చిత్రం పూర్తి చేయాలనే కోరికతో మీనాకుమారి అమ్రోహిని ప్రోత్సహించడంతో చిత్రం షూటింగ్ 1971లో పూర్తయింది. ఈ చిత్రానికి పారితోషికంగా మీనాకుమారికి ఒక అష్రఫీ (బంగారు నాణెం) ఇస్తానన్నారు అమ్రోహి. చిత్రం విడుదల సమయంలో జరిగిన ఫంక్షన్‌లో 'నా అష్రఫీ ఏదీ' అని అమ్రోహిని సరదాగా అడిగారు మీనాకుమారి.

1949లో కమాల్ అమ్రోహి దర్శకత్వంలో అశోక్ కుమార్, మధుబాల ప్రధాన పాత్రధారులుగా వచ్చిన 'మహల్' చిత్రం ఆయనకు ఎంతో పేరు తెచ్చిపెట్టింది. అందులోని 'ఆయేగా ఆయేగా' పాట చిరకాలం నిలిచిపోయే పాట. అమ్రోహి ఆ తర్వాత 'దాయ్‌రా' అనే చిత్రం తీశారు. ఆయన మూడో చిత్రం 'పాకీజా' ఆయనకు అఖండ కీర్తి ప్రతిష్టలు తెచ్చి పెట్టింది. రొమాంటిక్ చిత్రాలన్నిటికీ తలమానికంగా ఆయన ఈ చిత్రాన్ని మలిచారు. మీనాకుమారి అనారోగ్యంతో ఉన్నా ఆయన ఇది సాధించగలిగారంటే ఇది ఆయన ప్రతిభకు తార్కాణం. చిత్రం చివరలో వచ్చే నృత్య సన్నివేశంలో మీనాకుమారి నృత్యం చేయలేని స్థితిలో ఉంటే పద్మాఖన్నా చేశారు. 'చలో దిల్‌దార్ చలో' పాటలో చాలా భాగం మీనాకుమారి లేకుండానే తీశారు. విశాల సముద్రంపై చంద్రకిరణాలు ప్రతిఫలిస్తుండగా నావపై ప్రేమికులు పాడుకునే ఆ పాట రొమాన్స్‌కి పరాకాష్ట అని చెప్పుకోవచ్చు.

పురుషాధిక్య సమాజంలో విలాసవస్తువుగా మారి ఆ జీవితం నుండి బైటపడాలని తపించే స్త్రీ కథే 'పాకీజా'. ఇలాంటి కథలు ఎన్నో వచ్చినా 'పాకీజా' ఒక దృశ్యకావ్యంగా తనదైన స్థానం సంపాదించుకుంది. 'పాకీజా' అంటే పవిత్రమైన జన్మ కల అని అర్థం.

నర్గిస్ అనే నాట్యకత్తె, ఉన్నత కుటుంబానికి చెందిన షహాబుద్దీన్ ప్రేమించుకుంటారు. అతని కుటుంబం ఆమెను తిరస్కరిస్తుంది. ఆమె ఒక శ్మశానంలో ఒక ఆడపిల్లకు జన్మనిచ్చి మరణిస్తుంది. ఆమె అక్క ఆ బిడ్డను తండ్రికి దూరంగా తీసుకుపోయి పెంచుతుంది. ఆ బిడ్డ పేరు సాహిబ్‌జాన్. పెరిగి పెద్దదయి ఆమె కూడా నాట్యకత్తెగా మారుతుంది. తనను ఆరాధించే ఒక అజ్ఞాత వ్యక్తిని ప్రేమిస్తుంది. అతను షహాబుద్దీన్ కుటుంబానికి చెందినవాడే. అతని పేరు సలీమ్. అతని తండ్రి వారి ప్రేమను అంగీకరించడు. చివరికి అతనికి వేరే పెళ్ళి చేస్తుంటే సాహిబ్‌జాన్ ఆ పెళ్ళిలో అందరి ఎదుట నృత్యం చేస్తుంది. ఆమెను గుర్తించిన షహాబుద్దీన్ ఆమెను సలీమ్‌కు ఇచ్చి పెళ్ళి జరిపిస్తాడు. కథ ఈ విధంగా సుఖాంతమైనా చిత్రం పొడవునా విషాద ఛాయలు కనిపిస్తూనే ఉంటాయి. విషాద పాత్రలకు పెట్టిందిపేరయిన మీనాకుమారి నర్గిస్‌గా, సాహిబ్‌జాన్‌గా రెండు పాత్రలలో అద్భుతంగా నటించారు. సలీమ్ పాత్రను మొదట ధర్మేంద్రకు ఇవ్వాలనుకున్నా రాజ్‌కుమార్‌కి ఇచ్చారు. షహాబుద్దీన్ పాత్రను అశోక్ కుమార్ చేశారు.

గులామ్ మొహమ్మద్ ఈ చిత్రానికి అద్భుతమైన సంగీతం సమకూర్చారు. 'మీర్జా గాలిబ్' (1954), 'షమా' (1961) చిత్రాలకు చక్కని సంగీతాన్ని అందించినా ఆయనకు తగిన పేరు రాలేదు. చివరికి 'పాకీజా' చిత్రం సంపాదించిన పేరు ప్రఖ్యాతులను చవిచూడకుండానే ఆయన మరణించారు. ఆయన మరణానంతరం చిత్రంలోని మిగతా సంగీతం నౌషద్ అందించారు.

'పాకీజా' 1972 ఫిబ్రవరిలో విడుదలయింది. మొదట ప్రజలు ఈ చిత్రాన్ని ఆదరించలేదు. మార్చి 31న మీనాకుమారి అనారోగ్యంతో తుదిశ్వాస విడిచారు. ఆ తర్వాత ప్రజలు చిత్రం చూడటానికి తండోపతండాలుగా వెళ్ళారు. ఆ విధంగా చిత్రం విజయం సాధించింది. విజయంలోనూ విషాదఛాయలే.

చిత్రంలో సాహిబ్‌జాన్ రైల్లో ప్రయాణిస్తూ నిద్రపోతుండగా ఆమెను చూసిన సలీమ్ ఒక కాగితంపై ఈ విధంగా వ్రాసి ఆమె పక్కన పెట్టి వెళ్ళిపోతాడు:

'ఆప్‌కే పాఁవ్ దేఖే బహుత్ హసీన్ హైఁ
ఇన్హే జమీన్ పే మత్ రఖియేగా మైలే హో జాయేంగే



దాని అర్థం-

'మీ పాదాలు చూశాను. చాలా అందంగా ఉన్నాయి.

వాటిని భూమిపై మోపకండి. మాసిపోతాయి'.

ఎప్పుడూ ఎవరి ప్రేమకూ నోచుకొని సాహిబ్‌జాన్ ఆ మాటలలోని వాత్సల్యానికి కరిగిపోతుంది. ఆ సంఘటనను నెమరు వేసుకుంటూ ఉంటుంది. 'చల్‌తే చల్‌తే' గీతం ఆమె తొలి ప్రేమ తన్మయత్వంలో పాడే నృత్యగీతం. ఈ చివర్లో వచ్చే రైలు కూత చిత్రం పొడవునా థీమ్‌లా వినిపిస్తూనే ఉంటుంది.

'చల్‌తే చల్‌తే' అంటే 'నడుస్తూ ఉండగా' అని. దీనిని జీవనగమనానికి అన్వయించుకోవచ్చు. 'సర్-ఎ-రాహ్' అంటే 'దారిపై', 'థమ్‌నా' అంటే ఆగటం', 'రాత్ ఢల్‌నా' అంటే 'రేయి తెల్లవారడం'.

'నడుస్తూ నడుస్తూండగా

కలిసారొకరు దారిలో అనుకోకుండా

తెల్లవారుతూ, తెల్లవారుతూ

నా రేయి అక్కడే నిలిచిపోయింది'

తనలో కలకలం రేపింది ఎవరో ఆమెకి తెలియదు. అయినా ఆ క్షణాలని మరచిపోలేక కాలం అక్కడే ఆగిపోయినట్టు భావన. ఆమె ఉన్న వాతావరణంలో ఇతర స్త్రీలు ఆటపట్టించటం సహజమే కదా.

'షబ్' అంటే రాత్రి. 'ఇంతజార్' అంటే నిరీక్షణ, ఎదురుచూపు. 'ముక్తసర్' అంటే సంక్షిప్తమైనది, చిన్నది అని. (తెలుగులో 'ముక్తసరిగా' అంటాంగా) 'చిరాగ్' అంటే దీపం. బహువచనానికి కూడా అదే పదం వాడతారు. 'జల్‌నా' అనేది దీపాలకి అన్వయిస్తే 'వెలగటం' అని, మనుషులకి అన్వయిస్తే 'రగలటం', 'అసూయ పడటం',' వేగటం' అనే అర్థాలు వస్తాయి. ఇక్కడ 'రగలటం' సరైన అర్థం. 'బుఝ్‌నా' అంటే 'ఆరిపోవటం'

'ఎదురుచూపుల రేయి ఎప్పటికైనా తరిగేనా

ఈ దీపాలు మలుగుతున్నాయి

నాతో పాటు వేగలేక, రగలలేక'

అతని కోసం అంతగా నిరీక్షించాల్సిన రేయి ఎప్పుడైనా వస్తుందా అని ఆమె మథనపడుతోంది. ఆమె నిరీక్షణతో పోటీ పడలేక దీపాలు ఆరిపోతున్నాయి.

చెప్పీ చెప్పనట్టు ఉండటమే ఈ పాటలోని విశేషం. అదీ ఒక నృత్యగీతంలో చెప్పటం కవి ప్రతిభకు నిదర్శనం. సంగీతం హిందుస్తానీ





అనుకుంటోంది. నాలుగు గోడల మధ్య గడిపే తన జీవితం నుంచి కొంచెంసేపు జనస్రవంతిలోకి వెళ్ళినంతనే తనకు ఎదురైన ఈ అందమైన అనుభవాన్ని పదే పదే గుర్తు చేసుకుంటోంది.

'జమానా' అంటే లోకం. 'ఫసానా' అంటే కథ. 'బాత్' అంటే మాట. 'టల్‌నా' అంటే వాయిదాపడటం.

'నేను నోరారా చెప్పలేనిది

లోకమే చెబుతున్నది

నే చెప్పాలని వాయిదా వేస్తూండగానే

లోకమే నా ప్రేమగాథ వినిపిస్తోంది'

తన ప్రేమ సంగతి చెప్పాలనుకున్నా చెప్పలేని ఉద్వేగం ఆమెది. లోకమంతా ఆ సంగతి కథలు కథలుగా చెప్పుకుంటోందని ఆమె ఛాయలతో సాగిపోతుంది. చిత్రీకరణలో అమ్రోహి ప్రతిభ మరోసారి కనబడుతుంది. మీనాకుమారి హుందాగా కదులుతూ, నడుస్తూ ఉంటే నేపథ్యంలో ఇద్దరు యువతులు నృత్యం చేస్తూ ఉంటారు. ఆమె వాకిట్లో వేలాడే తెగిన గాలిపటం, స్వేచ్ఛలేని ఆమె జీవితానికి సంకేతంగా కనిపిస్తుంది.

దీని తర్వాత అమ్రోహి 'రజియా సుల్తాన్' అనే చిత్రానికి దర్శకత్వం వహించారు. ఎంతో భారీ స్థాయిలో నిర్మించిన ఆ చిత్రం విజయం సాధించలేదు ఆయనకు. మీనాకుమారికి 'పాకీజా'యే చిరకాల ఖ్యాతి నార్జించింది.

**-సత్యనారాయణ రాజు**

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు



**శ్రీమతి వాణి - కాచిగూడ**

ప్ర॥ 'ఉష్ణం ఉష్ణేన శీతలం' అనే సూత్రాన్ని మొట్టమొదట నిరూపించినదెవరు!?

జ॥ నిప్పులాంటి సీతతో అగ్నిప్రవేశం చేయించిన రాముడు

**టి.యస్.ఆర్. శివప్రసాద్**

ప్ర॥ సినీతారలు తమ వయస్సునెందుకు దాచుకుంటారు?

జ॥ అంతవరకూ వేషాలివ్వటానికి 'యస్సు' అన్నవాళ్ళు 'వై' అంటారని

ప్ర॥ సృష్టితో ఎక్కువ ఆనందాన్ని పొందిన జంట 'ఆడమ్ అండ్ ఈవ్' అని అంటారు... ఎందుకని....?

జ॥ ఇద్దరికీ అత్తగార్లు లేరు కాబట్టి

## పేరు - రిపేరు



(ఎ) నువ్వునేను - ఆడుతూ పాడుతూ - కలుసుకోవాలని....

(బి) ఓ చినదాన - అల్లరి - నీ ప్రేమకై

(సి) పెళ్ళిచూపులు - తలంబ్రాలు - సప్తపది - అంతా మన మంచికే



## డబుల్ రోల్




తన 'వునికి' చాటుకోవలసిన అవసరం ఆ 'దేవునికి' కూడా ఉందా!?

-శ్రీ - బుర్రలంక

మా 'చెల్లాయి' అల్లరి పనులు మా నాన్న దగ్గర కాబట్టి 'చెల్లాయి'

-పి.రాజశేఖరబాబు, సంకిలి

మినప 'గారెలా' ఉండే మీ 'అత్తగారెలా' ఉన్నారిప్పుడు?

-పి.భాస్కరరెడ్డి, సంగారెడ్డి

## చిలిపిలిపి



$P\,P_P$ = పిప్పి = పిప్పి

KKE = కైకేయి

VDVD = విడివిడి

-ఎమ్.ఎల్.వి. కృష్ణమాచార్యులు, హైదరాబాద్

# ఈ రూటే వేరు



సహస్రనామార్చన: నిద్రలో భర్తగారు కలవరించే గాళ్‌ఫ్రెండ్స్ పేర్లు

అష్టోత్తరం : దాన్తో భార్యగారు లంకించుకునే తిట్లు

పూజ : తిక్కరేగిన భర్తగారు బడితె తీసుకుని చేసేది

హారతి : దెబ్బతో కాపురానికి పట్టే గతి

-క్రోవ్వెల్ నరసింహ, ఖమ్మం

# చిలిపి కవిత



అతగాడి మాటలకు పొంగిపోతుందా మిస్సు
ఆమెగారేమన్నా ఇతగాడంటాడు యస్సు
ఆ తర్వాత ఆవిడగారవుతుంది ఓమంతు మిస్సు
అపట్నించి మ్యారేజంటూ కస్సూ బుస్సూ
సరేనని రాత్రికి రాత్రే ఎక్కేస్తాడతను వాళ్ఊరి బస్సు
మర్నాటినుంచి ఆ పిల్ల అన్నగారు
అతగాడి కోసం అవుతాడు చిన్నసైజు కొలంబస్సు

- ఎ.ఆర్.ప్రసాద్, కోరుట్ల

# పేరడీ పేరడ్



అన్నీ మంచి శకునములే - జైలుకు వెళ్ళే సూచనలే
వీధిలో పోలీస్ సైరనోహో మ్రోగెలే ॥అన్నీ॥
నీవలనే, నీ బాబు కూడా - ప్రజలను దోచిన ఘనుడేలే
చేసిన నేరము, పాపము పండి -
నిన్నే నిలువుగ ముంచెనులే ॥అన్నీ॥
కుడి కన్నదిరే - కుడి భుజమిరిగే
పోలీస్...లాఠీ...తగిలెనులే
వేలకు వేలా...ధనమును దోచిన
నీకీ శిక్షలు తప్పవులే ॥అన్నీ॥

(శ్రీ కృష్ణార్జున యుద్ధం చిత్రంలో "అన్నీ మంచి శకునములే" పాటకు పేరడీగా)

-రాయచోటి కృష్ణమూర్తి, ముంబాయి.



పది గదులలో పవరు కాల్చినా
అది తిరిగే మీటర్ ఒక్కటే
అరచేతితో నుదురెంత బాదినా
అసలు మారన్ది తలరాత ఒక్కటే...
॥పది గదులలో॥
నగరంలో ఎన్నివేల స్ట్రీట్‌లైట్లున్నా
రాత్రి పూట వెలిగేది వీధికొక్కటే
నీకొచ్చే బిల్లులో ఎమౌంటెంత ఉన్నా
చెల్లించే పిచ్చోడు నాన్న ఒక్కడే...
॥పది మందిలో॥

('ఆనంద నిలయం' సినిమాలో 'పది మందిలో పాట పాడినా' పాటకు పేరడీగా)

-ఎమ్. శ్రేష్ఠ, హైదరాబాద్.

జూన్ 15 సంగీత దర్శకుడు చక్రి పుట్టిన రోజు సందర్భంగా...

# చక్రి అనుభవాలు మనోభావాలు



"సంగీత దర్శకుడుగా మారడానికి మా నాన్నగారే నాకు స్ఫూర్తి. టీచర్‌గా మా నాన్నగారు పాటలు రాస్తారు, పాడతారు, రంగస్థల నటులు కూడా. అదే నాకూ అలవాటుగా వచ్చింది"

"1990లో విజయలక్ష్మిగారి దగ్గర వయోలిన్, శివరామకృష్ణగారి దగ్గర ఫ్లూట్, నందకుమార్‌గారి దగ్గర డ్రమ్స్ నేర్చుకున్నాను"

'ఇళయరాజా పాటలు నాలుగైదు పాడుకోనిదే నేను నిద్రపోను. ఎ.ఆర్. రెహమాన్‌తో సంగీత ప్రపంచంలో కొత్త విప్లవం వచ్చింది"

"డిగ్రీ చదువుతున్నప్పుడు 18 ఏళ్ళ వయసులో గ్రూప్ సాంగ్ కాంపిటీషన్స్ కోసం 'ఒకే జాతి మనదిరా, ఒకే బాట మనదిరా' పాట రాసి ప్రైజ్ సాధించాను. అప్పట్నుంచి ఇప్పటికి వెయ్యి దాకా పాటలు రాసి ఉంటాను"

"వందకు పైగా సింగర్స్‌ను, వందకు పైగా పాటల రచయితలను సినిమా పరిశ్రమకు పరిచయం చేయాలనేది నా ఆశయం"

"సంగీత దర్శకుడు కావాలనే ఆశయంతో 'చల్లగాలి' పేరుతో మొదట పాటలు రాయాల్సివచ్చింది"

"1998లో 'మరో ప్రేమకథ' సినిమాకి పాటలు రాద్దామని వెళ్ళి అనుకోకుండా సంగీత దర్శకుడినయ్యాను. పాటల రికార్డింగ్‌తోనే ఆ సినిమా ఆగిపోయింది"

"1999లో 'లిటిల్ హార్ట్స్' సినిమాకి ఆఫర్ వచ్చింది. తర్వాత 'బాచి'తో నా కెరీర్ కరెక్ట్ రూట్‌లో పడింది"

"'పండువెన్నెల' ప్రైవేట్ ఆల్బమ్‌తో మొదలు పెట్టి దాదాపు 35 ఆల్బమ్స్ చేశాను. నేషనల్, ఇంటర్నేషనల్ రేంజ్‌లో ఓ ఆల్బమ్ చేయాలని ఉంది. మంచి నిర్మాత దొరికితే తప్పకుండా చేస్తాను"



"చిరంజీవి గారి పుట్టినరోజు సందర్భంగా ఎనిమిది పాటలు రాసి, కంపోజ్ చేసి, 'చిరునవ్వు' ఆల్బమ్ చేసాను. 'స్నేహం కోసం' షూటింగ్‌లో నా ఆల్బమ్ విని మెచ్చుకుని చిరంజీవి గారు 'ఇద్దరు మిత్రులు'కు పాట రాయమన్నారు. పాటల రచయితగా కొనసాగడం ఇష్టంలేక ఆ ఆఫర్‌ని వదులుకున్నాను"

"ప్రతి హీరోకి, డైరెక్టర్‌కి 'ది బెస్ట్ మ్యూజిక్' అందివ్వాలన్నది నా గోల్"

"నా ప్రతి సినిమాలోనూ 'ఉదయ రవిచంద్రిక' రాగంలో ఓ పాట ఉంటుంది. ఆ రాగం నన్నెప్పుడూ వెంటాడుతూ ఉంటుంది. శ్రోతలు ఇష్టపడే ట్యూన్స్ ఎక్కువ 'ఉదయ రవిచంద్రిక'లోనే ఉంటాయి"



"'హేండ్సప్' సినిమాలో నాతో పాటలు పాడించాలని పిలిపించారు శశిప్రీతమ్. లిరిక్స్ రెడీ కాకపోవడంతో నేనే మూడు పాటలు రాసాను"

"నా మనసు దోచుకున్న పాట 'బొంబాయి' చిత్రంలోని 'ఉరికే చిలకా' పాట. ఆ ట్యూన్, లిరిక్స్, పాడిన విధానం సింప్లీ సూపర్బ్"



"దర్శకుడు కృష్ణవంశీని కలిస్తే 'నీ మ్యూజిక్ నాకేంటో అర్థం కావడంలేదు' అని చెప్పారు"

"నాకు ఇష్టమైనది 'కాపీ రాగం' (పీలూ). అయితే ఈ రాగంలో ఇంతవరకూ పాట చేసే అవకాశం రాలేదు. త్వరలో చేస్తాను"

"స్నేహితులతో గడపడానికి ఎక్కువ ఇష్టపడు తుంటాను. మాట్లాడకుండా ఒక్క నిముషం కూడా ఉండలేను"

"'ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం' చేస్తున్నప్పుడు నా కంపోజిషన్ చూసి పూరీ జగన్నాథ్ 'నీలో ఇళయరాజా, ఎ.ఆర్. రెహమాన్‌లు కనిపిస్తున్నారు. అందుకే నిన్ను ఇళయమాన్ లేదా ఎ.ఆర్. రాజా అని పిలవాలని ఉంది' అని ప్రశంసించారు"



"'రాక్షసుడు', 'అభినందన' సినిమాలు లెక్కలేనన్ని సార్లు చూసాను. 'అభినందన' సినిమా అయితే నాలో చాలా మార్పులు తీసుకువచ్చింది. ఎలా అయినా సరే ప్రేమలో పడాలనే ఫీలింగ్‌ని నాలో కలిగించింది"

"నా దృష్టిలో సంగీతమనేది దు:ఖంలో ఉన్నప్పుడు సంతోషంలోకి, ఆనందంగా ఉన్నప్పుడు బాధల్లోకి తీసుకెళ్ళగల ఏకైక మాత్ర"

"నా పూర్తి పేరు 'జిల్లా చక్రధర్'. ఇంటా బైటా చిన్నప్పట్నుంచి ముద్దుగా 'చక్రి' అని పిలుస్తుంటారు"




తొలిసారిగా విన్నప్పుడు మాత్రమే కాక, కొన్నాళ్ళ తర్వాత విన్నా ఎన్నేళ్ళ తర్వాత విన్నా ఒకే రకమైన రసస్పందనను కలిగించగల గీతాలు వచ్చిన 1950 దశకంలోనే ఓ చిత్రం వచ్చింది. తెలుగు సినీ సంగీత వైభవానికి వైతాళికులవలె నిలిచిన ఎందరో సంగీత దర్శకులలో సీనియర్ అయిన సుసర్ల దక్షిణామూర్తి ఆ చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా తన స్వర సామ్రాజ్యాన్ని మరింత సుసంపన్నం చేసుకున్నారు. జాతీయస్థాయిలో గర్వించదగ్గ మేలుజాతి గాయని లతామంగేష్కర్ తొలిసారి తెలుగు పాట పాడిన సినిమాగా, ఘంటసాల కీర్తికిరీటంలో మరో రెండు రత్నాల్ని పొదిగిన చిత్రంగా ఆ చిత్రాన్ని మరిచి పోవటం సంగీతాభిమానులకు అసాధ్యం. 1955లో విడుదలయిన ఆ చిత్రమే

## సాధనా వారి సంతానం

ఈ చిత్రంలోని ఆణిముత్యాల్లాంటి పాటల్లో ముచ్చటగా ఓ నాలుగు పాటలివి:

నిదురపో... నిదురపో... నిదురపో...
నిదురపో... నిదురపో... నిదురపో...
నిద్దురపోరా తమ్ముడా
నిద్దురపోరా తమ్ముడా
నిదురలోన గతమునంతా
నిముసమైనా మరచిపోరా ॥నిదుర॥
కరుణలేని ఈ జగానా
కలత నిదురే మేలురా ॥నిదుర॥
కలలు పండే కాలమంతా
కనుల ముందే కదలిపోయే
ఆ...
లేత మనసుల చిగురుటాశ
పూతలోనే రాలిపోయే ॥నిదుర॥
జాలితలిచి కన్నీరు తుడిచే
దాతలే కనరారే ॥జాలి॥
చితికిపోయిన జీవితమంతా
ఇంతలో చితిఆయె
నీడచూపె నెలవు మనకు
నిదురయేరా తమ్ముడా ॥నిదుర॥





ఆనాటి నుంచి ఈ నాటి వరకూ - తెలుగు సినీ సంగీత చరిత్రలో ఈ పాటను మించిన జోల పాట మరొకటి లేదనిపించే విధంగా నిలిచిపోయిన 'నిదుపోరా తమ్ముడా' గురించి ఎంత చెప్పినా మరికొంత మిగిలిపోయిందేమోననిపిస్తుంది. పాడుకునే అలవాటున్న ప్రతివారిని తాదాత్మ్యంలోకి తీసుకుపోయి గుండెని చెమరింపచేయగల గీతమిది. పల్లవికి, తొలిచరణానికి హిందుస్థానీ రాగమైన బేహాగ్‌ని ఆధారంగా చేసుకుంటూ 'జాలితలచి కన్నీరు తుడిచే ' చరణానికి హిందుస్థానీ భైరవిని వాడుకున్నారు సుసర్ల. హాయిగా జోలలాసాగే ఈ రస స్పందనను కరుణ, ఆర్ద్రతతో నింపుతూ శోకానికి తారస్థాయిగా మిగిలేలా తీసుకుపోవాలంటే ఆ శక్తి హిందూస్థానీ భైరవికే ఉందని గ్రహించిన సుసర్ల రససిద్ధికి నిదర్శనం ఈ పాట. చిత్రం తొలి భాగంలో వచ్చే ఈ పాట తిరిగి పతాక సన్నివేశంలో కూడా వస్తుంది. ఇందులో ఘంటసాల కంఠం కూడా వినిపిస్తుంది. ఘంటసాల-లతా పాడిన ఈ రెండో పాట అప్పట్లో రికార్డుగా వచ్చిన దాఖలా లేదు. ఇప్పుడు కొన్ని క్యాసెట్లలో దొరుకుతున్నట్లు వినికిడి. ఈ 'నిదురపోరా తమ్ముడా' పాటని భావస్ఫోరకంగా లతా పాడిన పద్ధతికి ఆమెకు తెలుగు రాదంటే ఇప్పటికీ నమ్మని వాళ్ళు ఉన్నారు. అంత గొప్పగా ఉంది ఆమె తెలుగు ఉచ్చారణ. రెండో చరణం 'జాలితలచి'లో గాత్ర ధర్మానికి ఆయువు పట్టుగా నిలిచే 'దాతలే కనరారే' దగ్గిర అటు లతా, ఇటు ఘంటసాల ఇద్దరూ ఇద్దరే అన్నట్టు శిఖరాయమాన స్థానంలో నిలిచారు.

## నటీ నటులు

నాగేశ్వరరావు, యస్.వి. రంగారావు, రేలంగి, చలం, అమర్‌నాధ్, మిక్కిలినేని, కుటుంబరావు, రమణారెడ్డి, రామకోటి, సావిత్రి, శ్రీరంజని, కుసుమకుమారి, సి. హేమలత, విజయకుమార్, జూ॥నాగేశ్వరరావు, విజయలక్ష్మి

## టెక్నీషియన్లు

దర్శకత్వం : రంగనాధదాస్
పర్యవేక్షణ : ప్రసాద్
మాటలు, పాటలు : అనిశెట్టి, పినిశెట్టి
డ్యాన్సు : వేణుగోపాల్
ఛాయాగ్రహణం : రహిమాన్, ప్రసాద్, రాజామణి
సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి
కూర్పు : మాణిక్యం
స్టూడియో : వాహిని, రేవతి, శోభనాచల
సౌండు : టి.యస్. కృష్ణ (వాహిని)
ఏబుల్ జీవా (రేవతి)
నేపథ్యగానం : లతామంగేష్కర్, పి.జి. కృష్ణవేణి (జిక్కి), జమునారాణి, రాణి, సత్యవతి, ఘంటసాల, సుసర్ల దక్షిణామూర్తి, కోదండపాణి









దేవీ శ్రీదేవీ ॥దేవీ॥
మొరలాలించి పాలించి
నన్నేలినావే ॥దేవీ॥
మదిలో నిన్నే మరువను దేవీ ॥మదిలో॥
నీనామ సంకీర్తనే చేసెద ॥దేవీ॥
నీకన్నుసన్నల నిరతము నన్నే ॥నీ కను॥
హాయిగా ఓలలాడించరావే ॥నీ కను॥
ఇలదేవతగా ఆ... ఆ...
ఇలదేవతగా వెలసితినీవే ॥ఇల॥
ఈడేరే...
ఈడేరే నా కోర్కెలేనాటికీ ॥దేవీ॥









ఈ పాటను ఘంటసాల పాడగా అక్కినేని, సావిత్రి అభినయించారు. 'దేవీ శ్రీదేవి' పాట గురించి చెప్పేముందు ఆ పాటకు ఆధార రాగమైన షణ్ముఖ ప్రియరాగం గురించి కొంచెం చెప్పాలి. 56వ మేళకర్త రాగమైన ఈ షణ్ముఖ ప్రియ రాగాన్ని పూర్వం నాటకాల్లో పద్యాలకు ఉపయోగించేవారు. కారణం ఈ రాగం మంద్రంలో కంటే మధ్యమ తారస్థాయిల్లో స్వర సంచారం చేసుకోవటానికి, గాయకుని శక్తి సామర్థ్యాలు చాటు కోవడానికి చాలా అనుకూలంగా ఉంటుంది. ఈ రాగంలో సనిసరి, సదాప అనే స్వరప్రయోగాలు జనరంజకంగా ఉంటాయి. అంతే కాక 'రి' (రిషభం) దగ్గర ఆపినా, 'రిసదా... ప' అనే దాటు ప్రయోగం చేసినా కర్ణపేయంగా ఉంటుంది. ఇవన్నీ బహు చక్కగా తెలిసిన సంగీతజ్ఞుడు సుసర్ల దక్షిణామూర్తి ఆ ప్రయోగాలన్నిటిని పొందుపరుస్తూ రూపొందించారు 'దేవీ శ్రీదేవి' పాటని. కథకి సినిమాకి క్లయిమాక్సు ఉన్నట్టే రాగానిక్కూడా ఓ క్లయిమాక్స్ ఉంటుంది. పాడేవారి సామర్థ్యానికి సరీక్షగా నిలిచే రీతిలో ఈ పాటలోని 'ఇలదేవతగా వెలసితివీవె' అనే వాక్యాన్ని-రాగానికి క్లయిమాక్స్‌గా ప్రతి గాయకుడూ తల్చుకొనేలా మలిచారు సుసర్ల దక్షిణామూర్తి. ఇక గాయకుడిగా ఘంటసాల తన గళానికున్న రేంజ్ ఎటువంటిదో చూపిన పాట యిది. ఘంటసాల అభిమానులంతా గర్వంగా చెప్పుకునే ఈ పాటను యథాతథంగా పాడగలిగే ఏ ఔత్సాహిక గాయకుడైనా సరే ఎటువంటి లలిత, సినీ సంగీతపు పోటీలలోనైనా ఉత్తీర్ణుడయి తీర్తాడు. గాయకుడిగా రాణించాలనుకునే ప్రతి కళాకారుడు సాధన చేయదగ్గ గీతమిది.





చల్లని వెన్నెలలో ॥చల్లని॥
చక్కని కన్నె సమీపములో ॥చల్లని॥
అందమె నాలో లీనమాయెనే
ఆనందమె నా గాన మాయెనె ॥చల్లని॥
తెలిమబ్బుల కౌగిలిలో జాబిలి
తేలియాడెనే ముద్దులలో
తెలిమబ్బుల కౌగిలిలో జాబిలి
తేలియాడెనే ముద్దులలో
గాలిపెదవులే మెల్లగ సోకిన
గాలిపెదవులే మెల్లగ సోకిన
పూలు నవ్వెనే నిద్దురలో ॥చల్లని॥
కళకళలాడే కన్నెవదనమే
కనిపించుచు ఆ తారలలో
ఓ... ఓ... ఓ...
కలకాలం నీ కమ్మని రూపము
కలకాలం నీ కమ్మని రూపము
కలవరింతునే నామదిలో ॥చల్లని॥









ఈ పాటను ఘంటసాల పాడగా అక్కినేని, సావిత్రి అభినయించారు. ఈ పాట మొత్తం ఒక్కటీ ఒక ఎత్తు. ఆలాపన ఒక్కటీ ఒక ఎత్తు. ఆలాపన వరకు హృదయునికి పట్టించేసుకోగలిగితే కళ్యాణి రాగంలో ఉన్న ఏ పాటైనా సరే ఇట్టే గుర్తు పట్టెయ్యొచ్చు.

కళ్యాణి రాగంలో మాండ్ రాగచ్ఛాయలను కలుపుకుంటూ స్వర పరిచిన 'చల్లని వెన్నెలలో' పాట 'లలితగీతం అంటే ఇలా ఉండాలి' అనిపిస్తుంది. 'గాలిపెదవులే మెల్లగసోకిన పూలు నవ్వెలే నిద్దురలో' అనే పద ప్రయోగం - ప్రేమ ఎంతో సున్నితమైనది; దాన్ని అభివ్యక్తీకరించటంలో కూడా కొంత వ్యక్తిత్వం. అభిరుచి, సున్నితత్వం ఉండాలి - అనే విషయాన్ని అన్యాపదేశంగా చెపుతుంది.

ఈ పాటను పాడడానికి లబ్ధప్రతిష్టులైన గాయకులు కూడా ఉత్సాహపడుతుంటారు. అందులో యస్పీ. బాలసుబ్రహ్మణ్యం ఒకరు. ఘంటసాలకి సంబంధించిన కొన్ని సభలలో, సంగీత కార్యక్రమాలలో వారి గొప్పతనాన్ని వర్ణించడానికి ఈ పాటను బాలు పాడి విశ్లేషిస్తూ వివరించేవారు. అంతెందుకూ - ప్రభుదేవా, నగ్మా హీరో హీరోయిన్లుగా నటించిన 'ప్రేమికుడు' సినిమా గుర్తుకు తెచ్చుకోండి. అందులో నటించిన బాలసుబ్రహ్మణ్యం - ప్రభుదేవాతో కలిసి డాబా మీద కూర్చుని ప్రేమ వివరాలు రాబట్టే సన్నివేశంలో ఈ 'చల్లని వెన్నెలలో' పాటను ఆలపించి తన సరదా తీర్చుకోవటం అందుకు మరో ఉదాహరణ.

ఆ: తొలి వలపుల కుసుమాంజలి నీకై
అర్పించితి నోయీ! దీవనలే
ఆశించితి నోయీ!

అ: సంతోషమేలా, సంగీతమేలా!
పొంగి పొరలేను మనసీవేళా!
మది పులకించే మోహమిదేనా
మమతలు నింపే స్నేహమిదేనా!

అ: పరవశమయ్యే ప్రణయ మిదేలే
ప్రతిక్షణ మీ యిల పండుగ యేలే
సంతోషమేలా, సంగీతమేలా!

ఆ: నీ చిరునగవు కాంతిలో జీవింతునోయీ!
నీ తలపేనోయ్ తొలివలపు హాయీ!
కౌగిలియే నీ కాలయమోయీ
కనులందే నీ కాపురమోయీ, నా
కనులందే నీ కాపురమోయీ! ॥సంతోష॥

అ: ఈ ఆనందం, ఈ ఆవేశం
నీ అందానికే ఆశించేనా!

ఆ: అనురాగంలో నవభోగంలో
మన జీవనమే తరియించేనా!

ఇ: అనురాగంలో నవభోగంలో
మన జీవనమే తరియించేనా
సంతోషమేలా సంగీతమేలా
పొంగి పొ లేను మనసీవేళా!












ఈ పాటను చలం, కుసుమకుమారి అభినయించారు. ఈ కుసుమకుమారి తరువాత తన పేరు 'మాలిని'గా మార్చుకొని మరికొన్ని చిత్రాలలో నటించింది. జమునారాణితో పాటు ఈ పాటను పాడింది కోదండపాణి. తరువాతి రోజుల్లో సంగీత దర్శకుడిగా పేరుగాంచిన కోదండపాణే ఈ కోదండపాణి. 'పండంటి కాపురం' సినిమాలో 'ఇదిగో దేవుడు చేసిన బొమ్మ' పాట తప్ప కోదండపాణి ఇంకే పాటనూ పాడలేదనుకొనేవారికి ఈ పాటను ఓ ఉదాహరణగా చెప్పవచ్చు. శాంతారాం నిర్మించిన 'సుబహ్ కా తారా' (1954) చిత్రంలో సి. రామచంద్ర సంగీత దర్శకత్వంలో తలత్ మహమ్మద్, లత పాడిన 'గయా అంధేరా/హువా ఉజాలా/చమ్క చమ్క సుభా కా తారా' అనే హిందీ గీతం ట్యూన్‌ని ఈ పాటకు వాడుకోవటం జరిగింది. ఈ హిందీ ట్యూన్‌ని ఎన్.టి.ఆర్., ఏ.యన్.ఆర్. నటించిన 'భూకైలాస్' చిత్రంలోని ఓ పాటకు కూడా వాడుకోవడం జరిగింది. ఆ వివరాలు ఆ సినిమా సంగీతాన్ని గురించి రాసే సమయంలో చర్చించటం జరుగుతుంది.

ఈ 'సంతానం' సినిమాలోని పాటల ద్వారా అజరామరమైన ఖ్యాతిని సంపాదించిన సుసర్ల దక్షిణామూర్తి తాతగారు కీ॥శే॥ సుసర్ల దక్షిణామూర్తి త్యాగరాయస్వామి శిష్యపరంపరలో ఒకరు. ఒక గురువుగా ఆంధ్రదేశానికి ఎంతో మంది శాస్త్రీయసంగీత విద్వాంసులను అందించిన కీ॥శే॥ సుసర్ల దక్షిణామూర్తి వద్ద శిష్యరికం చేసిన ముఖ్యులలో ఒకరు పారుపల్లి రామకృష్ణయ్యగారు. రెండో వారు మంగళంపల్లి బాలమురళీకృష్ణ తండ్రిఅయిన పట్టాభిరామయ్యగారు. బాలమురళీకృష్ణను శిష్యునిగా స్వీకరించి స్వరసంపన్నుణ్ణి చేసిన పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారిని దృష్టిలో పెట్టుకుని కె. విశ్వనాథ్ శంకరాభరణంలో శంకరశాస్త్రి పాత్రను రూపొందించారని చెబుతారు. సినీ సంగీత దర్శకుడిగా ఇవాళ మనం మననం చేసుకుంటున్న సుసర్ల దక్షిణామూర్తి స్వరప్రాభవం వెనుక అంతటి గొప్ప సంగీత వాతావరణ ప్రభావం ఉందిమరి.

# జూన్ 1 యస్వీ కృష్ణారెడ్డి పుట్టినరోజు సందర్భంగా...

**మంచి చిత్రాలు...అందులోనూ హాస్యానికి ఎంతో ప్రాధాన్యతనిస్తూ తీసిన చిత్రాలు, వాటితో పాటు సంగీతదర్శకత్వ బాధ్యత...ఇవన్నీ శ్రీ యస్వీ కృష్ణారెడ్డి చరాస్తులు. పెదవులపై ఎప్పుడూ మెదిలే చిరునవ్వు, ఎటువంటి ప్రశ్నకైనా ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా, తడుముకోకుండా ఎదుటివారు కన్విన్స్ అయ్యేలా చెప్పగల 'ర-సమయస్ఫూర్తి' ఇవి ఆయన స్థిరాస్తులు. అటు హాస్యాన్ని ఇటు సంగీతాన్ని సమశృతిలో మీటే కృష్ణారెడ్డి గారిని సినీ పరిశ్రమలో కొందరు మీటై కొన్ని ప్రశ్నలు అడిగితే ఎలా ఉంటుందన్న ఆలోచన వచ్చి కొందరు ప్రముఖుల నుంచి ప్రశ్నలు సేకరించి ఆయన ముందుంచాం. కరెక్ట్‌గా అయిదే అయిదు నిముషాలలో మొత్తం ప్రశ్నలన్నిటికీ ఆయన ఇచ్చిన సమాధానలివి. చదివిచూడండి. అర్థమవుతుంది ఆయన స్పాంటేనిటీ.**

మీ చిత్రాల్లో ఎక్కువగా స్త్రీ పక్షపాతం, వారిపట్ల గౌరవభావం, సానుభూతి ఉంటాయి. వాటినే ఎక్కువగా ఎందుకు బేస్ చేసుకుంటారు?



ఆదిశక్తితో సైతం స్త్రీ యే కనుక. 'ఓంకార శబ్దంతో సైతం స్త్రీ యే కనుక. అసలు స్త్రీ లేని ఈ భూమే లేదు. సాధారణంగా ఈ కుర్చీ ఉందా, పెన్ను ఉందా అని స్త్రీ వాచకంతో సంభోదన చేస్తారు. అంటే ఆలోచిస్తే వస్తువులతో సైతం మెజారిటి స్త్రీ కే. పైగా మన సమాజం ప్రారంభం నుండే స్త్రీకి సంబంధించిన సమాజం. స్త్రీకి ఎక్కువ గౌరవం ఎక్కడ లభిస్తుందో, వారు ఎక్కడ పూజింపబడుతారో అక్కడ సస్యశ్యామలంగా ఉంటుందని మన నానుడి. ఇవన్నీ కాకుండా బై నేచర్ పెంపకం వల్ల కావచ్చు... కారణం ఏదైనా కావచ్చు ప్రకృతిలోనే 'గివింగ్ రెస్పెక్ట్ టు ది లేడీస్' అనేది బేసిక్‌గా ఉన్న సూత్రం. అందువల్ల సినిమాలలో గాని, సినిమాల బయటగాని నా ప్రవర్తన అలాగే ఉంటుంది.



మీరు షర్ట్ వేసుకుంటే చేతులు పైకి మడత పెట్టుకుంటారు. ఆఖరకు సూట్ వేసినా అలాగే చేస్తారు. అలా మీకంటూ స్టయిల్ క్రియేట్ చేసుకున్నారు. దానికి ఓ కారణం అంటూ ఏమైనా ఉందా?



మనిషి ఎప్పుడూ ఇండివిడ్యువాలిటీ కోరుకోవాలి. అది నటుడుగాని, దర్శకుడుగానీ ఎవరైనా సరే. అంతెందుకు మన దేశానికి స్వాతంత్ర్యం తీసుకువచ్చిన గాంధీ గారి సంగతి ఆలోచించండి. ఆయనకో స్టయిల్ ఉంటుంది. చేతిలో కర్ర, బొడ్డుదగ్గర ఓ గడియారం, బోసినవ్వు... ఇలా గీత గీస్తే చాలు మనిషి దొరికేయాలి. అలాగే నెహ్రూగారు...చొక్కాకు గులాబి. అంతటి మహానుభావులకే ఓ స్టయిల్ ఉన్నప్పుడు వెనకాల వెళ్ళే మనలాంటి వాళ్ళం కూడా చిన్నచిన్న స్టయిల్స్ మనం చేసుకోలేమూ!? స్వార్థం కావచ్చు, ఇంకోటి కావచ్చు. 'ఐ వాంట్ మై ఇండిడ్యువాలిటి, ఐడెంటిఫికేషన్...అందువల్లనే ఇలాంటి చిన్న చిన్న పనులు చేస్తుంటాను. నచ్చితే సరదాగా తీసుకొండి, లేకపోతే 'చిలిపి' అనుకుని సరదాపడిపొండి.



మిమ్మల్ని చూస్తే పెళ్ళయిన ఓ కూతురుకి తండ్రిలా కాకుండా, మాతో సమానంగా, యంగ్ అండ్ ఎనర్జటిక్‌గా ఉంటారు. పైగా భావాల్లో కూడా ఛాదస్తంగా కాకుండా మాకన్నా ఫాస్ట్‌గా ఉంటారు. మీ ఆరోగ్య రహస్యం నాకక్కర్లేదు. ఇలా ఉంటే సక్సెస్‌ఫుల్ గా ఉంటామని మీరు ఏ సంఘటన ద్వారా తెలుసుకుని మిమ్మల్ని మీరు తీర్చి దిద్దుకున్నారు?

పర్టిక్యులర్ సంఘటన అని అంటే చెప్పలేను కానీ, నా కలవాటున్న పద్ధతి ఏమిటంటే ఎప్పుడూ పసితనాన్ని వదలనటువంటి ఆలోచనలు, ఎప్పుడూ చైల్డ్‌హుడ్ థింకింగ్ తప్ప, అంతకన్నా ఎదిగిపోయినటువంటి ఆలోచనలు నాదగ్గర ఏమీ ఉండవు. ఒకవేళ ఉన్నా గంభీరంగా తెచ్చిపెట్టుకున్నదే తప్ప, అవి కేవలం అప్పటికి అవసరం కనుక, లేదా వృత్తిరీత్యా కానీ లేకపోతే సన్నివేశపరంగా కానీ, లేకపోతే పసిపిల్లవాడి మెంటాలిటీ నా నుండి ఎక్కడికీ పోదు. దూరం కానీయను. అందుకే నా సినిమాలు యమలీల, మాయలోడు తీసుకుంటే చిల్డ్రన్ టచ్ గ్యారంటీగా ఉంటుంది. అది ఎదిగిపోనంతసేపూ మనిషికి ఏ ఇబ్బందీ ఉండదు. కొంతమంది పిల్లలు పెద్దవాళ్ళలాగా కనబడతారు ఎందుకంటే బాధల్ని కూడా తమ నెత్తిపైకెత్తుకుండటం వల్ల! ఇక అమ్మాయి, పెళ్ళి అంటారా! అది నా బాధ్యత, అందమైన బాధ్యత. అది ఎప్పుడు ఏ సమయంలో ఏది నెరవేర్చాలో అది అప్పుడు తండ్రిగా పూర్తి చేస్తాను. అది వేరు. ఇక్కడకు వచ్చేటప్పటికి పసిపిల్లవాడిలా మీతో గంతులేస్తాను.



మీరు ఏది సాధించాలని ఇక్కడకు వచ్చారో అది సాధించారా? రాబోయే పది ఏళ్ళలో మీ విజన్ ఏమిటి?

-ఏమి సాధించాలని ప్రారంభించానో అది సాధిస్తూ ఉన్నాను. ఇంకా పూర్తవలేదు. పూర్తి కానివ్వను. నేను స్టార్టింగ్ గుర్తు పెట్టుకున్నాను. ఇక్కడితో నేను సాధించాల్సింది పూర్తయిందని అనుకోను. దానిని బిగినింగ్‌గా తీసుకుని మరో గోల్ పెట్టుకుంటాను. పోయేదాకా మంచి చిత్రాలు చేయాలన్నదే నా ఆశ.

అందమైన దృష్టి, సవ్యమైన మంచి ఆలోచనలు, మంచి భావాలు తెరకెక్కించటం, ఎవరూ బాధపడకుండా, అందరూ మెచ్చుకునేలా, రాబోయే తరం కూడా శభాష్ కృష్ణారెడ్డి అనాలి. ఇప్పుడున్న తరం కె.వి.రెడ్డి, ఆదుర్తి, కె.విశ్వనాథ్‌గార్లను గురించి చెప్పుకున్నట్టే, రాబోయే తరం నా గురించి చెప్పుకుంటే నేను అనుకున్న దానిలో కొంతైనా సాధించినట్టే.





మీరు నన్ను ఎప్పుడూ ఎందుకయ్యా అంత వర్క్ చేస్తూ ఉంటావు. కొంత రిలాక్స్ అయి ఫ్యామిలీ లైఫ్ కూడా చూసుకో అంటుంటారు. కానీ మీరు మాత్రం ఎప్పుడూ పని చేస్తూనే ఉంటారు. పైగా దర్శకత్వం ఒక్కటే కాక మ్యూజిక్...ఇలా బోలెడన్ని డిపార్ట్‌మెంట్లు చూస్తూ ఉంటారు. అంత వర్క్ మీకు మాత్రం అవసరమా?

-డెఫినిట్‌గా అవసరం. ఎందుకంటే నేను వర్క్ చేస్తూనే నాకున్న సమయంలో నా ఇంటి దగ్గరే ఎక్కువ సమయం కేటాయిస్తూ ఉంటాను. నాకు తెలిసి మీరు కూడా మీ అమ్మగారి విషయంలో ఆవిడని కంటికి రెప్పలా కాచుకుంటూ, అనుక్షణం అంత జాగ్రత్త తీసుకోవడం నేను ఎరుగుదును. నేను అడిగేది ఏమిటంటే ఆ తల్లికి ఓ కోడల్ని ఇవ్వమని నేను చెప్పింది మీకు ఫ్యామిలీ అంటే అర్థం అది. 'బికాస్ మాన్ షుడ్ బికమ్ ఎ ఫుల్...నాట్ హాఫ్. యు ఆర్ నా హాఫ్...ప్లీజ్...బికమ్ ఫుల్' అప్పుడు ఆ తల్లి కూడా సంతోషిస్తుంది. ఆలస్యం చేయకుండా ముందు ఓ ఇంటివారు కండి. త్వరలోనే మీరు ఇన్విటేషన్ పంపిస్తారని ఆశిస్తున్నాను.



మనం మంచిది అనుకున్నది ప్రేక్షకులు తిరగగొడితే మనం అనుకున్న మంచిలో తేడా ఉందనుకోవాలా? లేక ప్రేక్షకుల అభిరుచిలోనా?

-తప్పకుండా మనం అనుకున్న మంచిలోనే తేడా ఉందని అనుకుని తీరాలి. దీనిలో సందేహం లేదు. ప్రేక్షకుల అభిరుచి మారిందని తప్పుపట్ట కూడదు. వారిని బట్టి మనం మారాలి. అలాకాక మన పాత పద్ధతిలోనే వెళితే వాళ్ళు తిప్పికొట్టే ప్రమాదం ఉంది. ఏమైనా ప్రేక్షకులను మార్చవలసిన బాధ్యత మనదే.



మీరు మీరుగానే పుట్టినందుకు మొట్టమొదట గర్వపడ్డ సందర్భం ఏమైనా ఉందా?

నేను నేనుగా పుట్టి మొట్టమొదటిసారిగా గర్వపడ్డ సందర్భం - నా అచ్చిరెడ్డి నన్ను గుర్తించడం. అప్పుడే నాకు - నేను ఎందుకు పుట్టానో తెలిసింది. అతనే నన్ను దర్శకుడిగా, స్క్రీన్ ప్లే రైటర్‌గా, సంగీత దర్శకుడిగా మారేలా చేసారు. నాలో ఉన్న స్కిల్స్‌ను బయటకు వచ్చేలా చేయగలిగిన మంచి స్నేహితుణ్ణి పొందగలగడం మొట్టమొదట గర్వపడ్డ సందర్భం. కృష్ణారెడ్డి స్టాండ్స్ విత్ అచ్చిరెడ్డి.

## ప్రేమకు వేళాయెరా!

రచన : చంద్రబోస్ గానం : శంకర్ మహదేవన్, హరిణి

ప: తళతళ తారకలాగ మెరుపుల మాలికలాగ (2)
కరుణించ వచ్చావే సిరులెన్నో తెచ్చావె కులుకా... ఆ ....
పంచవన్నెల రామచిలుకా,
నిధిలాగ దొరికావే తళుకా తళుకా
వదిలేసి పోమాకే మొలకా మొలకా...
పంచవన్నెల రామ చిలుకా పంచదారల ప్రేమ తళుకా...
చ: మాణిక్య వీణవు నువ్వే మలిసంధ్య వేణువు నువ్వే
నా మనసు మందిరాన మ్రోగుతున్న
అందమైన అందము నువ్వే
ఆరాధ్య దేవత నువ్వే గంధర్వ కాంతవు నువ్వే
స్వర్గాల దారిలోన నీడనిచ్చు పాలరాతి మేడవు నువ్వే
నీ గాలి సోకింది, నా కొమ్మ ఊగింది
నీ ప్రేమ లాగింది, నా గంగ పొంగింది ॥పంచ॥
చ: నా తేనె బిందువు నువ్వే నాలంకె బిందెవు నువ్వే
నా గుండె గంపలోన
ఒంపుకున్న అంతులేని సంపద నువ్వే
నా పొద్దు పొడుపువు నువ్వే, నా భక్తి శ్రద్ధవు నువ్వే,
చిననాడు దిద్దుకున్న ఒద్దికైన ఓనమాలు నువ్వే నువ్వే
నీ చూపు అందింది నా చెంప కందింది
నీ మెరుపు తెలిసింది నా వలపు కురిసింది॥పంచ॥॥తళ॥

## ఊయల

రచన : చంద్రబోస్ గానం : బాలు, చిత్ర

ప/అ: తారక దిగివచ్చి తళుక్కున మనసిస్తే... అ:కాదనగలనా (2)
ఆ: మెరుపే ఎదురొచ్చి చురుక్కున చుట్టేస్తే అ:కాదనగలనా (2)
అ: నిన్నటి వరకు కన్నులు కనని కలలే చెలిగా కలిసొస్తే...
కాదనగలనా (2) ఆ: ॥తారక॥
చ/అ:చందమామ వెన్నెలవదా కలువల మాటలు కాదనక
ఆ: చల్ల కాస్త వెన్న కాదా కృష్ణుని మాటను కాదనక
అ: ఏటి నీరు కాదనలేక మేఘమల్లె మారేనుగా
ఆ: మేఘమాల కాదనలేక వాగులాగ పారేనుగా
అ: ఈ ప్రేమన్నది నీ లీలేనని నా జన్మన్నది నీ ఒళ్ళోకని
ఆ దివి ఈ భువి ఔనంటే కాదనగలనా... ॥తారక॥
చ/అ:చల్లగాలి పాటకాదా వేణువు మాటను కాదనక
ఆ: పిల్లమొగ్గ పువ్వు కాదా తుమ్మెద మాటను కాదనక
అ పరిచయాలు కాదనలేక ప్రణయమల్లె మారేనుగా
ఆ: ప్రణయ కథలు కాదనలేక పరవశించి పోయేనుగా
అ: నీ సిగ్గున్నది నేనల్లేందుకు నీ బుగ్గున్నది నే గిల్లేందుకు
అనుకుని హత్తుకు పొమ్మంటే కాదనగలనా ॥తారక॥

## బడ్జెట్ పద్మనాభం

రచన : చంద్రబోస్ గానం : బాలు

ప: ఎవరేమి అనుకున్నా నువ్వుండే రాజ్యాన
రాజు నువ్వే బంటు నువ్వే మంత్రి నువ్వే సైన్యం నువ్వే
ఏమైనా ఏదైనా నువ్వెళ్ళే బడిలోన
పలకా నువ్వే బలపం నువ్వే ప్రశ్న నువ్వే బదులు నువ్వే
అన్నీ నువ్వే కావాలి అనునిత్యం పోరాడాలి,
అనుకున్నది సాధించాలి ॥ఎవరేమి॥
చ: అవమానాలే ఆభరణాలు అనుమానాలే అనుకూలాలు
సందేహాలే సందేశాలు ఛీత్కారాలే సత్కారాలు
అనుకోవాలి అడుగేయాలి ముళ్ళమార్గాన్ని అన్వేషించాలి
అలుపొస్తున్నా కలలేకన్న పూల స్వర్గాన్ని అధిరోహించాలి
ఎవరికి వారే లోకంలో ఎవరికి పట్టని శోకంలో
నీతో నువ్వే సాగాలి ॥ఎవరేమి॥
చ: బలము నువ్వే బలగం నువ్వే ఆటా నీదే గెలుపూ నీదే
నారు నువ్వే నీరు నువ్వే కోతా నీదే పైరూ నీదే
నింగిలోన తెల్లమేఘం నల్లబడితేనే జల్లులు కురిసేది
చెట్టుకైనా పూలు మొత్తం రాలిపోతేనే పిందెలు కాసేది
ఒక ఉదయం ముందర చీకట్లు,
విజయం ముందర ఇక్కట్లురావడమన్నది మామూలు ॥ఎవరేమి॥

## యమలీల

రచన : భువనచంద్ర గానం : బాలు, చిత్ర

ప/అ:ఆ... నీ జీను పాంటు చూసి బుల్లెమ్మోయ్
హో...నీ సైకిలు చైను జూసి పిల్లెమ్మోయ్ (2)
మనసు లాగేత్తంది లాగేత్తంది లాగేత్తంది హో
వయసు ఊగేత్తంది ఊగేత్తంది ఊగేత్తంది హో....
ఆ: ఆ... నీ బ్యాగీ పాంటు చూసి బుల్లోడోయ్
హో... నీ కురచా కోటు చూసి పిల్లోడోయ్ (2)
వలపు ఒలికేత్తంది (3) రో వయసు వణికేత్తంది (3) రో
కో: ఎయ్ ఎయ్‌రో సూత్తవేరో... (2)
చ/అ:ఆ ... అప్పరాల చెరువులోన అమ్మడూ కప్ప పిల్ల బుసకొడితె
అమ్మడూ ఒళ్ళు జివ్వు జివ్వుమంటు అమ్మడూ,
లవ్వు పుట్టుకొస్తదంట అమ్మడు
ఆ: తిమ్మరాజు రేవుకాడ పిల్లగో తొండ పిల్ల తొడగొడితే పిల్లడో
తాటిమట్ట తగులు కోని పిల్లడో తాటలేసి పోతదంట పిల్లగో
అ: కోపమేల బాల కొంగు చేరేవేళ కుర్రవాడి స్పీడు చూసుకో...
॥ఎయ్॥ ॥నీ జీను॥
చ/అ:ఆ... గౌలిగూడ సెంటర్లో పిల్లగో గొడవ గొడవ చేసేస్తే పిల్లగో
చిక్కడ్‌పల్లి సెంటర్లో పిల్లగో చింతకాయ తినిపిస్తా పిల్లగో
అ: ఒట్టి ఊకదంపుడేల అమ్మడు కొత్తపాట నేర్చుకోవే అమ్మడు
మడతపేచీ మానుకుంటె అమ్మడూ
తాళి బొట్టు కట్టిపెడతా అమ్మడూ
ఆ: తాళిబొట్టు మోజు పెళ్ళికొడుకు ఫోజు పక్కనెట్టి స్టెప్పులెయ్యరో
॥ఎయ్ ఎయ్‌రో॥ ॥నీ జీను పాంటు॥

## పెళ్ళిపీటలు

రచన : చంద్రబోస్ గానం : చిత్ర

జిల్ జిల్ జిల్ జిల్లని ఊగింది
ఏటినీళ్ళల్లో తడిసేటి ప్రాయం
ఝుంఝుం ఝుమ్మని మోగింది
కన్నెగుండెల్లో కాంభోజి రాగం
చిలకలు పరికిణీలు కాగా చుక్కలు హారమేసిపోగా
కోకిల కాలి గజ్జె తేగా పచ్చిక పాదరక్షలవగా
లేత గోరింటి చేతుల్లో పండగ ॥జిల్॥
పైవాడే ఎదురేవస్తే పదహారు ప్రాయంలోనే
వయసే నిలిచే చక్కని వరమిమ్మంటా
క్షేత్రయ్యే మళ్ళీ పుడితే నా రూపురేఖలపైనే
కాస్తోకూస్తో కవితను రాసిమ్మంటా
తెలుగు భాషలో అక్షరాలు యాభైఆరు
తెలుగు వనితలో ఎన్ని వన్నెలో ఎవరు చెప్పగలరు
వానకు మబ్బులెంత ముఖ్యం వీణకు తీగలెంత ముఖ్యం
తోటకు పువ్వులెంత ముఖ్యం పుడమికి పడతులంత ముఖ్యం
మగువే లేకుంటె ఏకాకి లోకం ॥జిల్॥
మెరుపేమో మబ్బుల సొంతం చురుకేమో చిరుతల సొంతం
చురుకూ మెరుపూ రెండూ నాకే సొంతం
పద్మానికి పగలే ఇష్టం పున్నాగకి రేయే ఇష్టం
రేయీ పగలూ రెండూ నాకే ఇష్టం
అంతరిక్షమే ఆటబొమ్మగా నన్ను చేరుకోదా
కల్పవృక్షమే కంటి చూపుకే నేల జారుకోదా
రాజుకు రాజ్యముంటె చాలూ లోభికి సంపదుంటె చాలు
యోగికి ప్రార్థనుంటె చాలూ నాకీ ప్రకృతుంటె చాలు
ఎంతో సంతోషం సందిట్లో వాలూ ఊ ... ఊ... ఊ. ॥జిల్॥

## మాయలోడు

రచన : భువనచంద్ర గానం : ఎస్.పి.బాలు, చిత్ర

అ: చలాకి చిలిపి వయసులో ఓహో
అదేమి వింత వున్నదో ఓహోయ్ ఆ॥చలాకి॥
అ: చలాకి చిలిపి వయసులో అదేమి వింత వున్నదో
సుఖాల వీణ మీటమన్నది ॥చలాకి॥
అ: కనులు కనులు కలుసుకున్న వేళలో
ఎన్నెన్ని ఊహలో ఎన్నెన్ని పులకరింతలో
ఆ: తనువు తనువు తడుముతున్న జోరులో
హుషారు హోరులో ఎన్నెన్ని జలదరింపులో
అ: పెదవి మధువులొలికెనెందుకో ... హోయ్
ఆ: పడుచు వయసునడిగి తెలుసుకో... హోయ్
అ: వరాల కౌగిలింతలోని వింత ఏవిటో... ॥చలాకి॥
ఆ: రేయి కురులు విప్పుకుంది రమ్మని
అదేదో ఇమ్మని అదేమో నీకే తెలుసని
ఆ: ఆశ తలుపు తెరుచుకుంది ఝుమ్మని
ఊపందుకొమ్మని ఉయ్యాలలూగి పొమ్మని
ఆ: సొగసు అలిసిపోయెనెందుకో... హోయ్
అ: హోయ్.. పసిడి పరువునడిగి తెలుసుకో హోయ్
ఆ: మజాల ముగ్గులోకి దించి నన్ను పంచుకో ॥చలాకి॥

## ప్రేమకు స్వాగతం

రచన : చంద్రబోస్ గానం : ఉదిత్ నారాయణ్, మహాలక్ష్మి

అ: అందాల యువరాణి ముందుందిగా
హైదరాబాదులో సైబరాబాదులో
అర్థమయ్యేలా ప్రతి పేటా చూపెట్టనా
అంబర్‌పేట అమీర్‌పేట మలక్‌పేట (2)
ఆ: చిననాడే చూశాను హోలెండు పోలెండు
చెలికాడే చూపాలి అంబర్‌పేట ॥అంబర్‌పేట ॥
ఆ: ఆకుపచ్చాని ఆ తోట పేరేంటయ్యా
అది వెచ్చాని లవ్‌పార్క్ సంజీవయ్య
అటు కనిపించి మురిపించె బృందావని
నువు పొరపాటు పడినావె అది లుంబిని
గట్టుపైన శిల్పాలే బుట్టలోన పల్లీలే
ఎన్.టి.ఆర్. గుర్తొచ్చే టాంకుబండులే
నెక్‌లెస్‌దారుల్లో చకచక సాగాలి
చివరకి చేరాలి మన జంట అంబర్‌పేట ॥అంబర్‌పేట॥
ఆ: అతి ఎత్తైన ఆ మేడ పేరేమిటీ
అది మన కీర్తి చాటించు హైటెక్ సిటీ
అరె ఆంధ్రాలో ఉందేంటి లాస్ ఏంజిల్స్
అది సినిమాల స్టూడియోల జూబ్లీహిల్స్
ఆకలేస్తు ఉందోయి హాట్‌కేక్ కొని తిందాం
హైద్రాబాద్ బిర్యానీ ఆరగించుదాం
బిర్లా టెంపుల్లో పూజలు చేసేసి పరుగున చేరాలి మన జంట
అంబర్‌పేట ॥అంబర్‌పేట॥ ॥అందాల॥

## మనసులో మాట

రచన : వేటూరి గానం : ఉదిత్ నారాయణ్

ప: ఈశ్వరా! నింగినేల హాండ్‌షేక్ చేసిన ఘనతే నీదిరా
ఈశ్వరా! సూర్య చంద్రులనొక్కటి చేసిన కథయే నీదిరా
తూర్పు పడమర ఫ్రెండ్‌షిప్ చేసిన ఘటనే నీదిరా
వన్ ఇన్‌టు ప్రాణేశ్వరా వన్ ప్లస్ వన్ జీవేశ్వరా
ఆల్ ద బెస్ట్ ఆత్మేశ్వరా ఆ మాటే ఆశీస్సురా
మండు టెండలు మల్లెలు చేసిన ఈశ్వరా!
ముళ్ళు మెత్తని పూలుగ మార్చిన ఈశ్వరా!
జానే దే సహోదరా జగడాలు లేవురా ॥ఈశ్వరా॥
చ: కూచిపూడినడగొచ్చులే ఒసిబిస
హాలివుడ్‌లో తీయొచ్చులే లవకుశ
మెడోన్నాకు నేర్పొచ్చులే పదనిస
కొండకేసి లాగొచ్చులే పురికొస
కోకిల పాటల్లో స్నేహమే కొమ్మకు సన్నాయి
కంటికి రెప్పల్లే కాచిన స్నేహం మనదోయి ॥జానే దే॥
చ: పార్లమెంటునడగొచ్చులే పెళ్ళికి
తాజ్‌మహల్‌నడగొచ్చులే విడిదికి
జాక్సనొస్తే అడగొచ్చులే జావళి
బాలమురళినడగొచ్చులే రాప్‌నే
కురిసిన మబ్బుల్లో స్నేహమే రంగుల హరివిల్లు
మురిసిన నవ్వుల్లో స్నేహమే మల్లెలు వెదజల్లు ॥జానే దే॥

## ఉగాది

రచన : సీతారామశాస్త్రి గానం : ఉన్నికృష్ణన్

ప: ఇన్నాళ్ళూ ఏ మబ్బుల్లో
దాగున్నావో వెన్నెల గువ్వా వెన్నెల గువ్వా(2)
ఇవ్వాళే చూసా నిన్ను బాగున్నావా వెన్నెల గువ్వా
వేచి ఉంది నవ్వుల నావా నడపమందువా
కాచుకుంది పూవుల త్రోవ చూపిస్తా నాతో రావా ॥ఇన్నాళ్ళూ॥
చ: కళ్ళు మూసుకోగానే ఎన్ని కలలు వస్తాయో
వాటి వెంట పోతూ రోజూ చూసానే నీ తోట...వెన్నెల గువ్వా(2)
కళ్ళు తెరుచుకోగానే దారి మరచిపోతానే
కోటి చుక్కలన్నిటి మధ్య నీ కోసం చూస్తుంట
కరిగేటి కలవో నిజంగానే కలవో
అనుమానం తీర్చేయాలని కళ్ళారా కనిపించేవా ॥ఇన్నాళ్ళూ॥
చ:ఊసుపోని ఊహల్లో ఊయలూగు వేళల్లో
పాడుకుంటు ఉంటే నువ్వా రాగాలే విన్నావా...వెన్నెలగువ్వా(2)
చుక్కలూరి వీధుల్లో ఒక్కదానివై ఉంటే
తోచుబాటు ఏమీ లేక ఈ వైపు రాలేవా
నువు రాక మునుపే నీ రూపు తెలుసే
ఎలాగంటె నాకేం తెలుసు
నా మనస్సుకి కబురంపేవా ॥ఇన్నాళ్ళూ॥

## వినోదం

రచన : సీతారామశాస్త్రి గానం : బాలు, చిత్ర

అ: ఆ(... మల్లెపూల వానా.... మల్లె పూల వానా
మల్లెపూల వానా జల్లుల్లోనా తడిసిన ఆనందాన
పలికెను మది వీణా...
అ: భయంలేదు పదరా అని పలికిందిరా నా మైనా
ఆ: మల్లెపూల వాన.....వాన...వాన...వాన...
అ: జయం మనది కదరా మనమనుకున్నది జరిగేనా
ఆ: మల్లెపూల వాన.....వాన...వాన...వాన...
అ: భయం లేదు పదరా అని పలికిందిరా నా మైనా
జయం మనది కదరా మనమనుకున్నది జరిగేనా
అ: దొరకును దొరకూనా..హో...ఎదురెవరురా మనకీవేళలోనా
ఆ: ॥మల్లె పూలవాన॥
ఆ: ఓయమ్మా ఈ రోజునా వద్దనకమ్మా ఏం చేసినా
నా పాదాలే పరుగులు తీసే గోదారి అలలౌతుంటె
ఆగేనా ఎవ్వరాపినా...
ఆ: అష్టసిరులు నిను ఇష్టపడెనురా కష్టపడితె జత కట్టవచ్చురా
అ: గ్రహాలన్ని మనకే అనుకూలిస్తున్నవి గనక
మహారాజులాగ వేశానుర కోటలో పాగా
పాచిక వేశాకా ... పారక పోదురా నూరారు అయినా
ఆ: ॥మల్లెపూల వాన॥
ఆ: మబ్బుల్లో ఆ జాబిలీ నా జతకోసం రావాలనీ
ఓ చిటికేసి పిలవంగానే ఇటుకేసి వస్తున్నాడె నా ఒళ్ళో చేరాలనీ...
ఆ: ప్రేయయాత్రలో పక్కదారులు ఎంత మాత్రమూ తప్పుకాదురా
అ: రథం నడుపుతారా మా మామను కూర్చోబెట్టి
ఎటెళ్ళాలో చెబుతా కళ్ళాలను చేత్తో బట్టి
అల్లుడినైపోనా... చల్లగ నా కాళ్ళు కడిగించుకోనా
ఆ: ॥మల్లెపూలవాన॥

## మాయలోడు

రచన : జొన్నవిత్తుల గానం : బాలు, చిత్ర

ప: చినుకు చినుకు అందెలతో చిటపట చిరు సవ్వడితో
నీలిమబ్బు కురుల ముడిని జారవిడిచి ఒళ్ళు మరిచి
వానజాణ ఆడింది వయ్యారంగా నీళ్ళపూలు జల్లింది
సింగారంగా ఆ:॥చినుకు॥
అ: నింగినేల ఈవేళ చలికి వణికిపోతుంటె
బిగి కౌగిలి పొదరింటికి పదపదమంది
ఈ కౌగిలింతలోన ఏలో... గుండెల్లో ఎండకాసె ఏలో
అ: అరె పైన మబ్బు ఉరిమింది పడుచుజింక బెదిరింది
వలపే ఇక సెలయేరై పెనవేసింది
ఆ: అరె..చినుకమ్మా మెరపమ్మా ఏలో....టికేసే బుగ్గ మీద ఏలో
అ: తలపూ తొలివలపు ఇక తక ఝుం తకఝుం
ఆ: వయసూ తడి సొగసూ అరవిరిసే సమయం
అ: ఆహో ఆ: ఊహోఁ.... అ:ఓహో హో హో ॥చినుకు॥
ఆ: మనసు పట్టు తప్పింది వయసు గుట్టు తడిసింది
ఎదలోపల చలిగాలుల సుడిరేగింది
అ: వానొచ్చే వరదొచ్చే ఏలో .... వయసంటె తెలిసొచ్చె ఏలో
ఆ: మేను చూపుపోయింది వాలు చూపు సైయ్యంది
చెలికోరిక అలవోకగా తల వూపింది
అ: అరె... సరసాల సిందులోన ఏలో... సరిగంగ తానాలు ఏలో
ఆ: ఒడిలో ఇక ఒకటై తక తకతై అంటే
అ: సరసానికి దొరసానికి ముడిపెడుతుంటె
ఆ: ఆహో అ:ఊహూఁ.... ఆ:ఓహో హో హో ॥చినుకు॥

## యమలీల

రచన : సీతారామశాస్త్రి గానం : బాలు, చిత్ర

ప: సిరులొలికించే చిన్ని నవ్వులే మణిమాణిక్యాలూ...
చీకటి ఎరగని బాబు కన్నులే మలగని దీపాలూ...
బుడిబుడి నడకల తప్పటడుగులే తరగని మాన్యాలూ...
చిటిపాటి పలుకుల ముద్దు మాటలే మా ధనధాన్యాలూ...
ఎదగాలి ఇంతకు ఇంతై ఈ పసికూనా...
ఏలాలి ఈ జగమంతా ఎప్పటికైనా...
మహారాజులా జీవించాలి నిండునూరేళ్ళూ... ॥సిరు॥
కో: జాబిల్లి జాబిల్లి జాబిల్లి మంచి జాబిల్లి జాబిల్లి జాబిల్లి ...
చ: నాలో మురిపెమంతా పాల బువ్వై పంచనీ
లోగో ఆశలన్నీ నిజమయేలా పెంచనీ
మహిలో మచ్చలేని చందమామే నువ్వనీ
ఊరూ వాడ నిన్నే మెచ్చుకుంటే చూడనీ
కలకాలమూ కనుపాపల్లే కాసుకోనీ
నీ నీడలో పసిపాపల్లే చేరుకోనీ ॥సిరు॥
చ: వేశా మొదటి అడుగు అమ్మ వేలే ఊతగా
నేర్చా మొదటి పలుకు అమ్మ పేరే ఆదిగా
నాలో అణువు అణువు ఆలయంగా మారగా
నిత్యం కొలుచుకోనా అమ్మ ఋణమే తీరగా
తోడుండగా నను దీవించే కన్న ప్రేమ
కీడన్నదే కనిపించేనా ఎన్నడైనా ॥సిరు॥

## ఎగిరే పావురమా

రచన : వేటూరి గానం : సునీత

మాఘమాసం ఎప్పుడొస్తుందో మౌనరాగాలెన్ని నాలో
మంచు మబ్బుకమ్ముకొస్తుందో మత్తు మత్తు ఎన్ని నెల్లో
ఎవరంటే ఎట్టష్మా వివరాలే గుట్టమ్మా
చికుబుకు చిక చిన్నోడోయమ్మా ॥మాఘ॥
తీపి చెమ్మల తేనె చెక్కిలి కొసరాడే నావోడు
ముక్కు పచ్చలు ఆరలేదని ముసిరాడే నా తోడు
నా... కౌగిలింతల కానుకేదని అడిగాడే ఆనాడు
లేత లేతగా సొంతమైనవి దోచాడే ఈనాడు
ఓయమ్మా.... హోయమ్మా వలపులే తొలిరేయమ్మా
వాటేస్తే చినవాడు నా సిగ్గు దోచేస్తే ॥మాఘ॥
తేనె మురళికి తీపి గుసగుస విసిరాడె పిలగాడు
రాతి మనసున ప్రేమ అలికిడి చిలికాడే చినవోడు
నా... కంటి పాపకు కొంటె కలలను అలికాడె అతగాడు
వంటి బతుకున జంట సరిగమ పలికించేదేనాడో
ఓయమ్మో.... ఒళ్ళంతా మనసులే ఈ తుళ్ళింత తెలుసులే
పెళ్ళాడే శుభలగ్నమేనాడో... ॥మాఘ॥

## నంబర్ వన్

రచన : సీతారామశాస్త్రి గానం : బాలు, చిత్ర

ఆ: ఛాంగుభళ బాగుంది కదా తమ జోరు
అ: చెంగుమని చెంగుచెంగుమని జత చేరు
ఆ: ఇది ఇన్నాళ్ళు ఎరగని తాకిడి
అ: ఎదురయ్యింది తొలకరి సందడి
ఆ: జోడుకమ్మంది వింత ఈడు
అ: ఈడు ఇమ్మంది వంతపాడు
ఆ: అబ్బబ్బా ఓయబ్బా చెప్పొద్దులే ॥ఛాంగు॥
అ: ఆఁ ... కంటి కొనలు ఎరుపెక్కగా
కనుగొంటి నిన్ను తగు జంటగా
ఆ: జుంటి తేనె తొణికించగా మునిపంటి పదును పెదవంటగా
అ: నులివెచ్చగా ఆ: చలిరెచ్చగా
అ: అబ్బబ్బ ఓయబ్బ చెప్పొద్దులే ॥ఛాంగు॥
ఆ: ఓ... కోడెయవ్వనము సాక్షిగా శతకోటి కోరికలు తీర్చనా
అ: కొంటె మన్మధుని కాంక్షగా జతనంటి తన్మయము పెంచనా
ఆ: దరిచేరనా ఆ: దరిచేర్చనా
ఆ: అబ్బబ్బ ఓయబ్బ చెప్పొద్దులే ॥ఛాంగు॥

## వినోదం

రచన : సీతారామశాస్త్రి గానం : బాలు, చిత్ర

అ: హోయ్ లైలా ప్రియురాలా వెయ్ నా.. మెడలో వరమాలా
ఆ: పిల్ల కలా పెళ్ళి కళా కన్నె కోరిన వరమియ్యవేలా
అ: లోకమంతా తెలిసేలా ఏకమయ్యే జతలీల
శుభలేఖలు రాసిన వేళ ॥హోయ్॥
ఆ: ఎటు చూస్తున్నా శుభశకునాలే కనబడుతున్నవి కదా
అ: ఎవరేమన్నా పెళ్ళి మంత్రాలై వినబడుతున్నవి కదా
ఆ: ప్రేమ గీమ చాలించేసి పెళ్ళాడేసే వేళయ్యింది
అ: ప్రేయసి కాస్తా పెళ్ళామయ్యే ఆ సుముహూర్తం వచ్చేసింది
ఆ: కళ్యాణ-వైభోగంతో కన్యాదానం కానీ అబ్బాయీ
అ: ఆ పైన నా ఒళ్ళోనే కాలక్షేపం చెయ్యాలమ్మాయి .... చిలకలా
॥హోయ్॥
అ: వరుడిని నేనై పరిణయమాడే పిల్లకి పల్లకి తేనా
ఆ: ఇదివరకెపుడూ పరిచయమవనీ సిగ్గుకి దగ్గర కానా
అ: పిల్లా మూకా పరివారంతో చుట్టాలంతా వస్తారంట
ఆ: చిన్నాపెద్దా సకుటుంబంగా చుట్టూచేరి చూస్తారంట
అ: మోగాలి డివ్విడివ్వి డివ్విట్టంటూ డోలూ సన్నాయీ
ఆ: మొగుడి వేషంలో నేను నిన్నే చూసి నవ్వేస్తానోయ్... కిలకిలా
॥హోయ్॥




జూన్ 3 టోనీ కర్టిస్ పుట్టినరోజు సందర్భంగా

# అందగాడైన హాస్యగాడు టోనీ కర్టిస్

సాధారణంగా అందంగా ఉన్నవాళ్ళు హీరోలగానే ఉండిపోదామనుకుంటారు. కానీ టోనీ కర్టిస్ అటువంటి నిబంధనలు పెట్టుకోలేదు. పాత్ర నచ్చితే హాస్యపాత్రయినా సరే హ్యాపీగా వేసేశాడు.

ఓ ఇద్దరు యువకులు ఓ హత్యను కళ్ళారా చూడడం వల్ల ఆ హంతకుల ముఠా వాళ్ళ వెంట బడుతుంది. వాళ్ళని తప్పించుకోవడానికి వాళ్ళిద్దరూ (జాక్ లెమ్మన్, టోనీ కర్టిస్) ఆడపిల్లల్లా



'సమ్ లైకిట్ హాట్'లో మేర్లిన్ మన్రో, జాక్‌లెమ్మన్‌లతో

వేషాలేసుకుని ఆ గాయనీమణుల ట్రూప్‌లో అమ్మాయిలను ఆకర్షించడానికి కాస్సేపు అమ్మాయిల క్రింద, కాస్సేపు అబ్బాయిల క్రింద మారిపోతూ ఉంటారు. (రిషీకపూర్ రఫూ చక్కర్ గుర్తుకొస్తోందా?) - ఇదీ "సమ్ లైకిట్ హాట్" (1959) కథాంశం.

పాతకాలంలో పాశ్చాత్యదేశాలలో 'ఛేస్టిటీ బెల్ట్' సాంప్రదాయం ఉండేది. యుద్ధరంగానికి వెళ్ళే సైనికులు తమ భార్యల మానరక్షణ కోసం వడ్డాణాలకు తాళాలు బిగించి వెళ్ళేవారు. యుద్ధం నుండి తిరిగివచ్చిన భర్త (టోనీ కర్టిస్) తన భార్యను చూసిన హడావుడిలో సముద్రపొడ్డున ముద్దాడుతూ ఆ తమకంలో తాళంచెవి ఇసుకలో జారిపోవడం గమనించడు. ఇక ఆ జంట పడే కష్టాలు ఏమిటి? - ఇదీ "ఛేస్టిటీ బెల్ట్" (1968) కథాంశం.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఓ సబ్‌మెరైన్ కెప్టెన్ (క్యారీ గ్రాంట్), అతని అసిస్టెంటు (టోనీ కర్టిస్) ఆధ్వర్యంలో నడుస్తూ ఉంటుంది. ఓ దీవి వచ్చేసరికి అయిదుగురు నర్సులు మేం ఇక్కడ ఇరుక్కుపోయాం రక్షించండి అంటారు. సరేనని ఎక్కించుకుంటే వాళ్ళు నానా తిక్క వేషాలు వేసి సైలర్స్‌ను అల్లరి పెట్టేస్తారు. - ఇదీ "ఆపరేషన్ పెట్టికోట్" (1959) కథాంశం.




ఇలా టోనీ కర్టిస్ వేసిన సినిమాలలో కామెడీలు ఎన్నో - ఫార్టీ పౌండ్స్ ఆఫ్ ట్రబుల్ (1963), గుడ్‌బై చార్లీ (1964), సెక్స్ అండ్ ది సింగిల్ గర్ల్ (1964). ది గ్రేట్ రేస్ (1965). బోయింగ్ బోయింగ్ (1965), నాట్ విత్ మై వైఫ్, యూడోన్ట్! (1966), డోన్ట్ మేక్ వేవ్స్ (1967).

హాస్య పాత్రలు వేశాక బోరు కొట్టి "ది బోస్టన్ స్ట్రాంగ్లర్" (1968) అనే సినిమాలో లేడీ కిల్లర్ పాత్ర వేశాడు టోనీ. ఆ తరువాత కూడా ఎన్నో రకాల పాత్రలు వేసి వైవిధ్యం గల నటుడిగా వాసికెక్కాడు టోనీ. అతని ఇద్దరు భార్యలూ సినీ తారలే. అతని కూతుళ్ళు కూడా సినీరంగంలోకి ప్రవేశించారు. "టోనీ కర్టిస్ - ది ఆటోబయోగ్రఫీ" అనే పేరుతో అతను రాసుకున్న ఆత్మకథ 1993లో వెలువడింది.

టోనీ రక్తంలోనే నటన ఉంది. అతని తండ్రి హంగరీలోని బుడాపెస్ట్‌లో నటుడుగా ఉండేవాడు. అమెరికాకు తరలివచ్చాడు. 1925లో జూన్ 3న న్యూయార్క్‌లో టోనీ పుట్టాడు. అప్పుడతని పేరు బెర్నార్డ్ స్క్వార్ట్జ్. రెండవ ప్రపంచ యుద్ధంలో నేవీలో పని చేశాక 1940 ప్రాంతాల్లో నటించడం మొదలుపెట్టాడు. యూనివర్సల్ స్టూడియోస్ వారి దృష్టి ఇతనిపై పడింది. ఏడేళ్ళకు కాంట్రాక్టు రాసుకుని అతన్ని "క్రిస్ క్రాస్" (1949) అనే చిత్రంలో ఓ చిన్న పాత్రలో నటింపజేశారు. అప్పుడే అతని పేరు ఆంథోనీ (దానికి హ్రస్వ నామమే టోనీ) కర్టిస్‌గా మారింది. "ది ప్రిన్స్ హూ వజ్ ఏ థీఫ్" (1951)తో నాయకపాత్రలు వేయ నారంభించాడు.

అతని సినిమాలలో చెప్పుకోదగినవి - బర్ట్ లంకాస్టర్, జీనాలోలాబ్రిగిడా (కమ్ సెప్టెంబర్ హీరోయిన్, షాలిమార్ సినిమాలో కూడా నటించింది)లతో నటించిన "ట్రెపీజ్" (1956), పత్రికారంగం నేపథ్యంగా బర్ట్ లంకాస్టర్‌తో నటించిన "స్వీట్ స్మెల్ ఆఫ్ సక్సెస్'' (1957) సిడ్నీ పాయిటర్‌తో నటించిన "ది డిఫయంట్ వన్స్" (1958) - దీనిలో కలిపి బేడీలు వేసిన ఇద్దరు ఖైదీలు తప్పించుకుని పారిపోతారు. కానీ ఇద్దరికీ ఒకరంటే ఒకరికి అసహ్యం. ఈ పాత్రకు టోనీకి ఆస్కార్ నామినేషన్ వచ్చింది.

ఇలా ప్రఖ్యాతులైన సహనటులతో టోనీ అనుభవాల్లో ఒకటి రెండు - క్యారీ గ్రాంట్ అంటే టోనీ కర్టిస్‌కు ఆరాధనే. అయినా "సమ్ లైక్ ఇట్ హాట్" వంటి అనేక సినిమాల్లో అతన్ని పారడీ చేసివున్నాడు. "ఆపరేషన్ పెట్టీకోట్"లో క్యారీగ్రాంట్‌తో బాటు అతను నటించవలసి వచ్చింది. జెర్రీలూయిస్‌తో కలిసి "బోయింగ్ బోయింగ్" సినిమాలో నటించాడు. దానిలో జెర్రీ చాలా గంభీరంగా వేశాడు. టోనీ ఎయిర్‌హోస్టెస్‌ల వెంటపడే రసికుడిగా నటించాడు. అన్నిటికంటె తమాషా అయినది 'సమ్ లైక్ ఇట్ హాట్' లో జరిగింది. ఆ సినిమాలో మార్లిన్ మన్రో హీరోయిన్‌గా నటించింది. ఆమె అందాల తార అయివుండవచ్చు గానీ సాటి నటీనటులకు మహా ఇబ్బంది కలిగించేది. డైరెక్టరు బిల్లీవైల్డర్‌తో సహా జాక్‌లెమ్మన్. టోనీ కర్టిస్ అందరూ ఆమె వల్ల చాలా అవస్థపడ్డారు. ఆ చిత్రంలో మార్లిన్‌కు, టోనీకు ఓ చుంబనదృశ్యం ఉంది. ఆ అనుభవం ఎలా ఉందని టోనీని అడిగారెవరో. "హిట్లర్‌ను ముద్దు పెట్టుకున్నట్టుంది'' - అని విసుక్కున్నాడు టోనీ.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

సీరియల్ 9

# [illegible]

-మల్లాది వెంకట కృష్ణమూర్తి

## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటో భాగాల వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండడం వలన ఆమెకు వచ్చిన పెళ్ళి సంబంధాలన్నీ తప్పి పోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేక పోవటం [illegible]



అదేం పేరని అనన్య అడగడంతో జవాబు చెప్పింది బామ్మ.

"మా నాన్నగారికి దైవభక్తి ఎక్కువని చెప్పాగా... బభ్రువాహనుడు మా రెండో అన్నయ్యకి పెట్టుకున్న పేరు. అతనెవరంటే.."

"తెలుసులే బామ్మ బభ్రువాహన అనే బ్లాక్ అండ్ వైట్ సినిమా టీ.వీ.లో సగం చూసాను. అతనికెంత మంది పిల్లలు బామ్మ?" అడిగింది బామ్మ. చిన్నగా

నిట్టూర్చింది బామ్మ.

"లేరు"

"నువ్వు చెప్పిన ఎక్స్‌ప్రెషన్‌ని బట్టి దాని వెనక ఏదో కథ వున్నట్లుంది బామ్మ. అవునా?" అడిగింది అనన్య.

"అవును. ఈ లోకంలో చాలామందికి పుట్టినే పిల్లలుండరు. కాని మా బభ్రువాహనుడి విషయంలో సాయిబాబా కారణంగా వింతగా వాడికి పిల్లలు లేకుండా పోయారు".

"సాయిబాబా ఎవరు?"

"సాయిబాబా ఎవరంటుందేమిటిరా బాబూ? రోజూ విజయచందర్ ఫొటోకి అగరువత్తులు వెలిగిస్తూ" విసుక్కుంది బామ్మ.

"ఓ! షిరిడీ సాయినాథుడి గురించా నువ్వు చెప్పేది?"

విజయచందర్ షిరిడిసాయి బాబాగా నటించిన ఫొటో ఒకటి సంపాదించి దాన్ని అనన్య పూజ గదిలో వుంచి రోజూ అగరువత్తులు వెలిగించడమే కాక, ప్రతీ గురువారం దానికి హారతి కూడా ఇస్తుంటుంది.

"అవును. సాక్షాత్తు షిరిడి సాయిబాబా వల్ల వాళ్ళకి పిల్లలు లేకుండా పోయారు".

"అదేమిటి? సంతానం లేని వారు కొలిస్తే వాళ్ళకి సంతాన భాగ్యం ప్రసాదించే బాబా వల్ల పిల్లలే లేకుండా పోయారంటే ఆశ్చర్యంగా వుంది బామ్మ"

"అందుకే వింతగా వుందన్నాను కదా".

"ఆ వివరాలు నాకు చెప్పవా బామ్మ" అడిగింది అనన్య.

***

బామ్మ తండ్రి వల్లభరావు ఆ రోజు ఇంటికి రాగానే చెప్పింది అతని భార్య కనకం చిరాగ్గా.

"చూడండి. నా చీరలు, నా వాలకం. ఎవరైనా చూస్తే నన్ను వంట మనిషనుకుంటారు".

"అలా అనుకునే వాళ్ళని పిలిచి ఓ పూట మనింట్లో నీ చేతి వంట పెట్టు. అప్పుడు వంట మనిషని కూడా అనుకోరు" నవ్వుతూ చెప్పాడు వల్లభరావు.

"చాల్లెండి హాస్యాలు. బట్టల కొట్లో మన ఖాతా బాగా పెరిగిపోయి ఏడాది నించి చీరలే కొనలేదు నేను. ఈ నెల పదిహేడో తారీకున నేను కొత్త చీర కట్టాల్సిందే. ఆ రోజు మన పెళ్ళి రోజని అసలు గుర్తుందా మీకు?"

"అదలావుంచు. అసలు మన రెండో అబ్బాయికి పెళ్ళీడు వచ్చిందని, అయినా సంబంధాలు రావడం లేదని తెలుసా నీకు? ఎందుకు రావడం లేదన్న బాధేమైనా వుందా నీకసలు?" కోప్పడ్డాడు వల్లభరావు.

"ఎందుకు రావడం లేదంటే, వాడికి మేనరికం వుందనుకుంటున్నారు కాబట్టి. ఒకరా ఇద్దరా? నలుగురు అత్తలు వాడికి. తలకి నలుగురు కూతుళ్ళు. మనకీ వాళ్ళకీ ఏదైనా తగువున్నా బావుండేది. పిల్లలంతా చనువుగా మనింటికి వస్తూనే వున్నారు కదా".

"అంతేనంటావా?"

"అవును. పిన్నిగారూ మీ అబ్బాయికో మంచి సంబంధం చెప్దామనుంది కానీ మీకు అయిన వాళ్ళలో చాలామందే పోటీ పడుతున్నారుగా అని చెప్పలేదు.' అని నీళ్ళ పంపుదగ్గర ఎంతో మంది నాతో అన్నారు".

"మాకు మేనరికం చేసుకునే ఉద్దేశం లేదని చెప్పలేక పోయావా వాళ్ళకి?".

"వాళ్ళకే పనికి రాకపోతే ఏం లోపం వుందో అని బయటి వాళ్ళు అనుకుంటున్నారండి. పైగా పెద్దాడికి మేనరికం చేసాం కదండి".

"ఖర్మ ఖర్మ. దానికో విరుగుడు ఆలోచించాలి".

"అందుకు కావలసిన సరుకు మీ దగ్గర లేదు కాని మీ పెద్దబావనడగండి. ఆయన చెప్తాడు" సలహా ఇచ్చింది కనకం భర్తకి.

వల్లభరావు తన పెద్దబావగారి దగ్గరికి వెంటనే ప్రయాణం అయ్యాడు. ఆయన మొత్తం విని నశ్యం ఓ పట్టు పీల్చి చెప్పాడు ఏం చెయ్యాలో. తిరుగు రైల్లో ఇంటికి వచ్చిన వల్లభరావు ఇంట్లోకి రాకుండా ఇంటి బయట ఓ బోర్డు కట్టాడు. అది ముందే రాసిన బోర్డు. దాని మీద 'వలయువారికి గమనిక: మాకు మేనరికం అచ్చిరాదు' అని వుంది.

ఆ బోర్డు కట్టిన గంట నించి బభ్రువాహనుడికి పెళ్ళి సంబంధాలు రావడం మొదలైంది.

తహసిల్ కోర్టులో పెద్ద గుమస్తాగా పని చేస్తూ స్వంత సైకిలున్న బభ్రువాహనుడు కొద్ది వారాల పాటు పిల్లని చూడడంతో కాలక్షేపం చేసాడు. అతనికి నచ్చినమ్మాయిల జాతకాలు అతని జాతకానికి నప్పలేదు. అతనికి నచ్చని అమ్మాయిలిచ్చే కట్నం అతని తండ్రికి నప్పింది. దాంతో ఇంట్లో 'ఎవరికి నిశ్చితార్థానికి కబురు చేయాలి?' అన్న విషయం మీద కొద్దిరోజుల పాటు తీవ్రవాగ్యుద్ధం జరిగాక తిరుమణి అనే పిల్ల వడ పోతలో తేలింది. అందం విషయంలో బభ్రువాహనుడు కొంత, కట్నం విషయంలో వల్లభరావు కొంత, ఆడపడుచు లాంఛనాలు, అలకపాన్పు, బంగారు కంచం విషయంలో కనకం కొంత కాంప్రమైజ్ అయినాక తిరుమణికి బభ్రువాహనుడికి నిశ్చితార్థం చేసారు.

ఆ వేడుకకి తిరుమణి ఇంటికి వెళ్ళారు మగ పెళ్ళి వైపు వారు. ఆ ఇంట్లోని వాళ్ళంతా పెళ్ళివారిని ఆదరంగా రిసీవ్ చేసుకున్నాక చెప్పాడు ఇంటాయన.

"శుభకార్యం ముందు కాసేపు బాబా భజన చేద్దాం".

"బాబా భజనా? అంటే?" అడిగాడు వల్లభరావు.

డజను అగరు బత్తులు వెలుగుతున్న సాయిబాబా నిలువెత్తు ఫోటోని చూసి పెదవి విరిచాడు వల్లభరావు.

"ఇతను మనలా మనిషే. ఇతన్ని కొలవడం ఎందుకు? ఏ రాముడి ఫొటోకో, శివుడు లేదా సత్యనారాయణ స్వామి ఫొటోకో సేవచేస్తే పుణ్యం"

"అమ్మమ్మ! ఎంత మాట -ఈయనే



వాళ్ళంతా"

ఆ అద్వైత సిద్ధాంతం బోధ పడని వల్లభరావు మరోసారి పెదవి విరిచి చెప్పాడు.

"పైగా బీదవాడిలా వున్నాడు. చిరుగుల చొక్కా, చింకి చాప..."

కనకం వారించి చెప్పింది భర్తకి. కొంతమంది సాయినాధుడ్ని పూజించడం గురించి తను విని వున్నదని, వాళ్ళ ఇల్లు కాబట్టి వాళ్ళ ఇష్ట ప్రకారం చేసుకోనీయమని.

అంతా హాల్లోని ఆ ఫొటో ముందు కూర్చున్నారు. "సాయినాథ మహరాజ్‌కి జై" అని మూడుసార్లు ఒకతను కంచుకంఠంతో అరిచాక ఆ ఇంటి వాళ్ళంతా సాయిబాబా భజన చేయసాగారు. అన్నీ సినిమా పాటల బాణీలో రాసినవే. కొన్ని హిందీ, కొన్ని తెలుగు. సి.కృష్ణవేణి నటించి పాడిన సినిమా కచదేవయానిలోనిది. తర్వాత 'తీయగా పాడనా ఓ రాయల వూపగా వూగనా' పాట స్టయిల్‌లో పాడసాగారు.

అప్పటికింకా సాయిబాబా తెలుగు వారిలో ఇంత పాపులారిటీ సంపాదించలేదు. విబూది, తేనెలు చిత్రపటాల నించి రాలడం వగైరాలు ఇంకా మొదలెట్టని రోజులవి. తిరుపతి తర్వాత షిరిడి తెలుగు వాళ్ళకి యాత్రా స్థలంగా మారని రోజులవి. దాంతో సాయిని నమ్మిన ఆ ఇంటి వాళ్ళకి ఆ భజనల్లో కలిగిన తన్మయత్వం, వల్లభరావు అండ్ సన్స్‌కి, డాటర్స్‌కి, వైఫ్‌కి, ఇతర జనాభాకి కలగలేదు.

ఆ భజన ముగిసాక సాయిబాబాకి నివేదించిన ప్రసాదం పంచారు. పాలకోవ రుచిచూసాక దేవుడెలా వున్నా ప్రసాదం ఘనంగా వుంది అనుకున్నాడు వల్లభరావు.

తిరుమణి, బభ్రువాహనుడి వివాహ మహోత్సవానికి తాంబూలాలు పుచ్చుకున్నాక పెళ్ళి ఫలానా మాసంలోగా చేసేయాలని అనుకున్నారు.

తిరుమణి తండ్రి, వల్లభరావు కలిసి పెళ్ళికి ముహూర్తాలు చూసుకోడానికి పురోహితుడి దగ్గరకు వెళ్ళారు. అయితే నాలుగు మంచి వాటిలో మూడింటిని రిజెక్ట్ చేసాడు తిరుమణి తండ్రి. కారణం రెండు గురువారాలు కావడం, మరొకటి పౌర్ణమి రోజు కావడం.

"నైజాంలో మంగళవారాలు అచ్చిరావు. గురువారాలు మీ ప్రాంతంలో అచ్చిరావా?" అడిగాడు పురోహితుడు.

"కాదు - గురువారం సాయిబాబాకి భజనచేసి హారతి ఇవాల్సిన రోజు. గత పదకొండేళ్ళుగా ప్రతీ గురువారం ఇంతదాకా మేం ఆ ఆనవాయితీని పాటిస్తూనే వస్తున్నాం".

"ఒకటి ఇందులో శుక్రవారం కదా?" అడిగాడు పురోహితుడు.

"అవును. కాని పౌర్ణమి కదా ఆ రోజు".

"ఏం మీకు పౌర్ణమి అచ్చిరాదా?" అడిగాడు వల్లభరావు.

"అది మామూలు పౌర్ణమా? సాక్షాత్తూ గురుపౌర్ణమి ఆ రోజు సాయి సప్తాహం, కుక్కలకి చపాతీ రొట్టెలు తినిపించడం, బీదలకి అన్నదానం... మీరు తప్పక రావాలి. తర్వాత పిలుస్తాం. ఇంకా ఎన్నో కార్యక్రమాలు ఉంటాయి మాకు".

వాళ్ళు పెళ్ళి కన్నా, సాయిబాబాకి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడం వల్లభరావుకి నచ్చలేదు.

"ఏ దేవుడూ మన నిత్య జీవితంలోని పన్లకి అడ్డురాకూడదండి. పైగా సాయి దేవుడు కూడా కాదు. కనుక్కున్నాను. తెలుగు కూడా రాని మహారాష్ట్రియన్ అట".

వెంటనే తిరుమణి తండ్రి చెంపలు వేసుకుని చెప్పాడు.

"అలా అనకండి. సాయినాధుడంటే, సాక్షాత్తూ శివుడు, సాక్షాత్తు రాముడు, సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు, పరబ్రహ్మం, అల్లా కూడా".

"అలా అని ఎవరు చెప్పారు మీకు?"

"సాయిబాబా పుస్తకంలో వుంది".

"ఓసారివ్వండి చదివిస్తాం"

"మీకు హిందీ రాదుగా. అది హిందీలో వుంది. ఇంకా ఎవరూ తెలుగులోకి అనువాదం చేయలేదు".

ఎట్టకేలకి ఓ సుముహూర్తం నిశ్చయించు కున్నారు. ఇరుపక్షాలు తమ ఇబ్బందులు చూసు కున్నాక.

పెళ్ళికి బంధువులు రాసాగారు. 'మేనరికం అచ్చిరాదు' బోర్డు బయట పెట్టమని సలహా ఇచ్చిన వల్లభరావు పెద్దబావ పెళ్ళికి బయలుదేరడానికి ముందే కొద్దిరోజులుగా వారి ఇంటి ఏరియాలో దొంగల భయం మొదలైందని తెలిసి అడిగాడు వల్లభరావు.

"ఇల్లు తాళం పెట్టి వచ్చేరా! ఫర్వాలేదా?"

"ఏం ఫర్వాలేదు. ఇంటి బయట 'టులెట్' బోర్డు పెట్టి వచ్చాను" బుర్రలో సమస్యని ఆయన నవ్వుతూ చెప్పాడు.

ఎట్టకేలకి ఓ సుముహూర్తం నిశ్చయించు కున్నారు, ఇరుపక్షాలు తమ ఇబ్బందులు చూసు కున్నాక.

ఒక్కతే కూతురని పెళ్ళిఘనంగా అయిదు రోజుల పాటు చేసారు. మధ్యలో ఓ గురువారం తగిలింది. పెళ్ళి పందిరిలో సాయి ఫొటో పెట్టి సాయిబాబా భజన చేసారు. మర్యాదకి వల్లభరావు తరపు వాళ్ళంతా కూడా అందులో కూర్చున్నారు.

అప్పుడప్పుడే ఏఎన్నార్ నాటకాల్లో పైకొస్తున్న రోజులవి. ఎన్.టి.ఆర్ ఇంకా సబ్ రిజిస్ట్రార్ ఉద్యోగంలో చేరని రోజులవి. ఇంకోలా చెప్పాలంటే, ఆడ పెళ్ళివారిని, మగపెళ్ళివారు 'అది తక్కువైంది' 'ఇది చాల్లేదు' అని హడలుగొట్టి ఏడ్పించే ఆచారం ప్రబలంగా ఉన్న రోజులవి. వివిధ సందర్భాల్లో పెళ్ళి పాటలు పాడటానికి ప్రత్యేకంగా కొందరు చుట్టాలు తర్ఫీదు పొంది వున్నారు.

"ఏలాగు భోంచేతమూ?" లాంటి హాస్య భోజనం పాటలతో ఆ పెళ్ళి పందిరి కళకళ లాడింది.

ఆ పెళ్ళికి వచ్చిన తిరుమణి చుట్టాల్లో ఒకరు



ఢిల్లీలో వైస్రాయ్ భవంతిలో పని చేస్తున్నారు. వాళ్ళ పిల్లలకి తెలుగు సరిగ్గా రాదు. కాని తెలుగు ఇష్టం కాబట్టి వినేవాళ్ళు అదిరిపోయేలా తెలుగులోనే మాట్లాడసాగారు. వాళ్ళు మాట్లాడే తెలుగుని, తెలుగులోకి అనువాదం చేసి చెప్పసాగింది ఆ పిల్లల తల్లి.

"మీరెక్కడ బతుకుతున్నారు?"

"ఎక్కడుంటున్నారని అడుగుతున్నారండి. వేర్ డు యు లివ్ అని".

"తొందరించకండి. ఆనందిస్తూ తినండి".

"తొందరపడకుండా నెమ్మదిగా తిన మంటున్నారు".

"మీ కంపెనీని నేను బాగా అనుభవిస్తున్నాను".

"మీతో కాలక్షేపం బావుందట. ఐ ఎన్‌జాయ్ యువర్ కంపెనీ అంటున్నారు".

"తర్వాత మిమ్మల్ని చూస్తాను".

"తర్వాత మిమ్మల్ని కలుస్తారుట. ఐ విల్ సీ యూ లేటర్ అని".

"అందరూ వినండి. మీ శ్రద్ధనిటు ఆకర్షిస్తు న్నాను". "అతను చెప్పేది వినమంటు న్నాడు. టు అట్రాక్ట్ యువర్ అటెన్షన్ అని.."

వారు, వారి ఢిల్లీ వేష భాషలు, అందరికీ చక్కని వినోదాన్నిచ్చాయి.

కొంతకాలం ఒకే ఆఫీస్‌లో పని చేసిన, పెళ్ళికొచ్చిన ఇద్దరు తారసపడి ఒకర్నొకరు తిట్టుకున్నారు.

"కొట్టానంటేనా? సర్వే నంబర్ కనిపించ కుండా పోతావు. ఏమనుకున్నావో".

"పట్టుకున్నానంటేనా, పెండింగ్ ఫైల్ అయి పోతావు" వారిద్దరూ రెవిన్యూ శాఖ ఉద్యోగస్తులు.

"నీకు బుర్రుంది కానీ ఫ్యూజ్ లేదురా".

"అలాగా? ఓసారి ఓల్టేజ్ చూడు షాక్ తింటావు"

వాళ్ళిద్దరూ విద్యుత్ శాఖ ఉద్యోగులు.

ఆ పెళ్ళికొచ్చిన ఓ పెద్దమనిషి ఎదురు పడ్డప్పుడల్లా మూడేళ్ళ పిల్లాడు 'ఆ' అంటూ నోరు తెరచి చూపించసాగాడు. 'ఇప్పుడక్కర్లేదులే బాబూ' అనసాగాడా పెద్దమనిషి

"ఏమిటో చోద్యం?" అడిగింది జాంబవతి అది గమనించి ఆ పెద్దమనిషిని.

"నేను ఆ పిల్లవాడి ఫేమిలి డాక్టర్ని. వాడికెప్పుడు జ్వరమొచ్చినా నోరు తెరవమని అడుగుతుంటాను" చెప్పాడు ఆ పెద్దమనిషి.

***

తిరుమణి ఇంట్లో వాళ్ళ ఫస్ట్‌నైట్ ఏర్పాటు చేసారు. ఆ గదిలో కూడా మంచం ఎదురుగా గోడకి సాయిబాబా ఫొటో వుండడం చూసి చికాకు పడ్డాడు బభ్రువాహనుడు.

"నీకు సాయిబాబా అంటే భక్తా?" అడిగాడు.

"మా ఇంట్లో అందరికన్నా, బాబా అంటే, నాకే ఎక్కువ భక్తి" గర్వంగా చెప్పింది.

"ఇక్కడ ఆయన ఫొటో వుంటే, మనం ఏకాంతంగా ఉన్నట్లు లేదు నాకు."

"పిచ్చివాడా. ఆయన లేనిదెక్కడ? అసలు ఆయన అనుమతి లేకుండా జరిగేది ఏది?"

"నీకు మీ ఇంట్లో అందరికన్నా సాయిమీద భక్తి ఎక్కువ అన్నది నిజమేనన్నమాట".

తిరుమణిని దగ్గరికి తీసుకోబోయాడు. "ఒక్కక్షణం" అని లేచి సాయిబాబా ఫొటో దగ్గరికి వెళ్ళి అక్కడ డబ్బాలో వున్న రెండు చీట్లు తీసి భక్తిగా కళ్ళకద్దుకుని కలిపి వేసి భర్తని పిలిచి చెప్పింది.

"ఒకటి తీయండి".

"దేనికి?"

"ముందుతీయండి. చెప్తాను".

తీసాడు

"విప్పి చదవండి'

చదివాడు.

"ఏం వచ్చింది?"

"వద్దు" కాగితం మీది అక్షరాలని చదివాడు.

"అయితే ఆగుదాం"

"ఎందుకు ఆగుదాం? ఏమిటి కథా?" ప్రశ్నించాడు బభ్రువాహనుడు సంభ్రమంగా.

"మన కలయికకి ఈ రాత్రికి బాబా అనుమతివ్వలేదు. ఇచ్చేదాకా ఆగుదాం".

బభ్రువాహనుడు తన చేతిలోని చీటి వంక, భార్యవంక బాబా ఫొటో వంక అయోమయంగా చూసాడు. తిరుమణి చెప్పింది అర్థమయ్యాక చెప్పాడు. "ఇదేం పిచ్చి? నేనెక్కడా ఇలాంటిది చూడలేదు".

"మా ఇంట్లో ఏ ముఖ్యమైన పని చేసినా ఇలా చీట్లు వేస్తాం. బాబా ఏం చెప్తే అదే చేస్తాం. అసలు మీ సంబంధం చేసుకోవాలా, వద్దా అని సాయి నడిగితే, ఆయన సరేనంటేనే మా నాన్న వప్పుకున్నాడు తెలుసా?"

తలుపు వైపు నడుస్తున్న తిరుమణిని విస్తుపోతూ చూస్తుండిపోయాడు. ఆమె బయటకి వెళ్ళాక ఖాళీ గదిని చూసి కాని జరిగింది నమ్మలేక పోయాడు. తలుపు అవతల నించి కాసేపు గుసగుసలు. తర్వాత అవీ ఆగిపోయాయి.

మర్నాడు, ఆ మర్రోజు, ఇంకోరోజు, మరో రోజు... అన్ని రోజులూ పడక మీదకి చేరబోయే ముందు రాత్రుళ్ళు, పగళ్ళు భర్త చేత చీటి తీయించసాగింది తిరుమణి. 'వద్దు' అనే చీటీనే బభ్రువాహనుడికి తగల సాగింది.

***

ఫక్కున నవ్వింది అనన్య.

"సాయిబాబా 'సరే' అననే లేదా?"

"ఊహూ... ఆర్నెలు గడిచినా 'పచ్చజెండా' చీటి తగల్లేదు. మా అన్నయ్య ముందు ఈ సంగతి మా అమ్మకి కాని ఎవరికీ చెప్పలేదు వాడు. తిరుమణి సాయిబాబా చెప్పింది తు.చ తప్ప కుండా చేసే రకం. పైగా మా అన్నయ్యకి బాబా మీద భక్తి లేక పోగా, అలక్ష్యం అని, అందువల్లే బాబా ఆశీర్వాదం తమకింకా లభించలేదని



తిరుమణి మా అన్నయ్యని హింస పెట్టేది".

"తిరుమణికి ఇష్టం లేక రెండు కాగితాల్లో 'వద్దు' రాసేదేమో?"

"ఆ అనుమానంతో ప్రతీసారీ మా అన్నయ్య రెండో చీటిని కూడా చెక్ చేసేవాడు. తను తీసిందానికి ఆపోజిట్ రాసి వుండేది".

"అన్ని వందల సార్లలో ఒక్కసారి కూడా 'సరే' చీటిని తీయలేదంటే నమ్మలేను నేను".

"కొన్నిసార్లు అదీ తీసాడు"

"మరింకేం?"

"కాని మా వాడు మొదట్లో 'వద్దు' చీటిని తీసి, తీసి విసిగిపోవడంతో 'ఇప్పుడు నేను తీసేది బాబా కిష్టం లేనిది. కింద వున్నది బాబా ఆశీర్వాదం' అని చెప్పితీస్తే 'సరే' చీటి వచ్చేది".

"షిట్"

"గురువారాలు ఎటూ పడకలు వేరు. చివరికి తిరుమణితో విసిగిపోయిన మా వాడు విషయం మా వాళ్ళకి చెప్పాడు. వాళ్ళు కొంతకాలం ఓపిక పట్టాక ఇక లాభం లేదని తిరుమణిని పుట్టింటికి పంపేసారు. 'వెళ్ళచ్చా? లేదా? అని దానికీ చీటి వేసుకుని చూసుకుని మరీ వెళ్ళింది" నవ్వింది బామ్మ.

"ఆమెని మెచ్చుకోవాలి" చెప్పింది అనన్య.

"దేనికి?"

"తన కాపురం కన్నా బాబా ఆజ్ఞ ముఖ్యం అనుకోవడం వల్ల. దీన్నే భగవద్గీతలో అనన్యభక్తి అన్నాడు శ్రీకృష్ణుడు. ఉదయం జెమిని టీ.వీ.లో సుందర చైతన్యానందస్వామి చెప్పాడు".

"కావచ్చు. ఆ రోజుల్లో బాబా గురించి ఎవరికి తెలుసు? ఇంత భయం భక్తి ఎవరికున్నాయి?"

"మీ అన్న బభ్రువాహనుడు మళ్ళీ ఇంకో పెళ్ళి చేసుకోలేదా?"

"లేదు. దాంతో వాడికి సంసారం అంటే ఓ విధమైన విరక్తి ఏర్పడింది. చివర్లో ఇంకో వారానికి పోతాడని తెలిసి సన్యాసం తీసుకున్నాడు కూడా. చివర్లో బాబాకి భక్తుడయ్యాడు చిత్రంగా".

"ఎందుకని?"

"తర్వాత తెలిసింది. ఆమెకి సంతాన యోగం లేదని, అది దాచి పెట్టడానికి దొంగ జాతకం రాయించారని, దాంతో అంతదాకా హేట్ చేసిన బాబా భక్తుడయ్యాడు.

"జాంబవతి, బభ్రువాహనుడి వివాహ కథలు తమాషాగా వున్నాయి. మిగిలిన వాళ్ళకి ఇలాంటి చిత్రమైన కథలున్నాయా" అడిగింది అనన్య.

"ఉన్నాయి".

"అవీ చెప్పు బామ్మ"

"మరోసారి"

"అందువల్ల ఈ ఆస్తికి వారసులు లేకుండా పోయారా బామ్మ?"

"అవును".

"తిరుమణిని పుట్టింటికి పంపకుండా ఉంటే ఎప్పుడో ఓ సారి 'సరే' చీటి తగిలి వుండేది కదా బామ్మ".

"ఈగో దెబ్బతిన్నాక ఆ తర్వాత ఎవరు భార్యని తాకమన్నా తాకుతారు చెప్పు? అదీకాక వాడు బాబా భక్తుడవడానికి కారణం తమని విడగొట్టినందుకే. లేకపోతే ఆమెకి పిల్లలు పుట్టక పోవడానికి వీడు కారణమని చాలామంది అనుకోవచ్చు కదా. బాబా మీది భక్తికి అసలైన కారణం అది".

"అదీ నిజమేలే"

డోర్‌బెల్ మోగింది.

"బామ్మగారు బావున్నారా?" అన్న లింగమయ్య కంఠధ్వని వినపడడంతో బామ్మ హటాత్తుగా లేచి జుట్టు చెరుపుకుంటూ బెడ్‌రూంలోకి నడిచింది.

"తెలుసుగా?" అడిగింది. గుమ్మం దగ్గర ఆగి అనన్యని, "తెలుసు. నువ్వు వారం రోజులుగా మోకాళ్ళు వాచి బాధపడుతున్నావు".

"అది కీళ్ళవాపు. గుండె జబ్బు వల్ల వచ్చిన కీళ్ళ వాపు".

బామ్మ బెడ్‌రూంలోకి అనన్య మెయిన్‌డోర్ వైపుకి నడిచారు.

(ఇంకా వుంది)

## జస్ట్‌ఫర్ ఫన్



తోకలేని కోతుల్ని పట్టి జంతు ప్రదర్శనశాలకు ఇవ్వటం కోసం ఒక వేటగాడిని నియమించారు. ఆ వేటగాడు ఓ వినూత్నమైన పథకాన్ని ఆలోచించి ఆ పద్ధతిలో వాటిని పట్టుకోదలచాడు. దానిక్కావలసిన సరంజామా కేవలం ఓ గోనెసంచి, ఒక తుపాకి మరియు చూడగానే మీద పడిపోయే స్వభావం గల ఓ కుక్క మాత్రమే! ఆ వేటగాడు తన అసిస్టెంట్‌తో కలిసి అడవికి వెళ్ళాడు. తోకలేని కోతులు ఎక్కువ సంఖ్యలో ఉన్న ఓ ప్రాంతానికి వెళ్ళారు వాళ్ళిద్దరూ. "నేను చెట్టెక్కి కొమ్మల్ని గట్టిగా ఊపుతాను..."అన్నాడు వేటగాడు. "ఆ చెట్టు మీద ఏవైనా తోకలేని కోతులున్నాయనుకో...అవి కింద పడతాయ్...వెంటనే మన కుక్క ఉంది కదా...అది ఉన్న ఫళాన వచ్చి వాటిమీద పడి, వాటిని కరిచి అవి శక్తిని కోల్పోయేలా చేస్తుంది. అప్పుడు వాటిని నువ్వు పట్టుకుని మనం తెచ్చుకున్న గోనెసంచిలో వేయవచ్చు...". పథకం వివరంగా చెప్పాడు వేటగాడు. "మరి ఆ తుపాకీ నా దగ్గర ఎందుకు?" అర్థంగాక అడిగేడు అసిస్టెంటు.

"ఒకవేళ నేను పట్టుదప్పి పొరబాటున చెట్టు మీదనుంచి కింద పడ్డానే అనుకో...నువ్వు ఆ తుపాకీతో కుక్కని కాల్చెయ్..." చెప్పాడు వేటగాడు.

# లలిత సంగీతం

## వేదంలా గోదావరి ప్రవహిస్తోంది



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ వేదంలా గోదావరి ప్రవహిస్తోందే
వెన్నెల వలె కృష్ణవేణి విహరిస్తోందే
వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లీ ప్రవహిస్తోందే॥

1. చ॥ విశాలాంధ్ర నలుమూలల వైవాహిక వైభోగం
జనుల కనుల వెలుగులలో జాజులు వారెడి రాగం
గెలవేసిన అరటిచెట్లు తీసుకురానా
ఎలమామిడి తోరణాలు కట్టనా

2. చ॥ గడప మీద చిగురుజల్లు గరిపొడిచెను శోభ
ముంగిట ముత్యాలు నవ్వి రంగవల్లి సుప్రభ
ఏరువాక పడవలా ఎద ఊగిసలాడునే
జోడెద్దుల బండివలె గుండెలొరిగిసాగునే

3. చ॥ జనావళికి సంతతం సంతోషప్రాప్తి
విశాలాంధ్ర నిండా వైవాహిక దీప్తి
తూత్తారామాదిరిగా తుంగభద్రనాదమే
పొన్నాయికి మల్లే పెన్నానది గానమే

రచన : ఆరుద్ర
గానం, సంగీతం : ఘంటసాల
రాగం : బిలహరి
29వ మేళకర్త ధీరశంకరాభరణ రాగజన్యం
తాళం : చతురస్ర జాతి ఏక (త్రిశ్రనడక)
-దాద్రా (హిందుస్తాని సంగీతం)
ఆరోహణ : స రి గ ప ద స
అవరోహణ : స ని ద ప మ గ రి స

ఈ రాగంలో ఆరోహణలో - షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి దైవతం

అవరోహణలో - షడ్జము, కాకలి నిషాదము, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, అంతరగాంధారం, చతుశృతి రిషభం.

కైశికి నిషాదం కూడా యీ రాగంలో ఉపయోగించ బడుతుంది.

ఉత్తమ సాంప్రదాయానికి సంస్కృతికి పెద్దపీట వేసే ఆంధ్రదేశంలో ఓ పండుగ వాతావరణాన్ని, గుండెల్లోంచి ఉవ్వెత్తుగా ఎగసిపడిన ఓ ఆనంద రూపాన్నీ, అక్షరాకృతిగా మలచారు ఆరుద్ర. "విశాలాంధ్ర నలుమూలల వైవాహిక వైభోగాన్ని" వివరంగా వర్ణించారు. పంచమ వేదమైన భారతాన్ని ఆంధ్రుల కందించిన ఆదికవి నన్నయ్య గోదావరి తీరవాసి. "వేదంలా గోదావరి" అనే మాటల్లో అల్పాక్షరాలలో అనల్పార్థ రచన వ్యక్తమౌతుంది. పాటలో ఔన్నత్యాన్ని, ఉత్సాహాన్ని బాణీలో ఘంటసాల వాణిలో కూడా పదిలంగా నింపుకున్న యీ పాట ఓ అమూల్యమణిగా వాసికెక్కింది. బిలహరి రాగంలో తెలుగుదనం ఉట్టిపడే యీ పాట

ఆకాశవాణి ద్వారా విస్తృత ప్రచారాన్ని పొందింది. ఈ రాగం యొక్క ఆరోహణలో మధ్యమం లేకపోయినా లలిత సంగీతానికుండే వెసులుబాటును బట్టి స్వతంత్ర స్వర సంచా రంతో ఆరోహణాక్రమంలో అక్కడక్కడా మధ్యమ స్వరాన్ని కలుపుకుంటూ సురుచిరమైన సంగీతాన్ని కూర్చారు స్వరకర్తగా ఘంటసాల.

ప॥ గపపాపా ధససాసస | రిగగా మాగా, సరిసా, |
వే. దంలా గో. దావరి | ప్రవహి స్తోం దే. . . . |

రిపపప దప మాపమ గసరి | గమగారిస సానిధాప |
వె. న్నెల వలె కృ ష్ణ. వే. ణి | విహరి స్తోం. దే. . . |

గపపాపా ధససాసరి | గమగారిస సా, రిగసరి, |
వే. దంలా గో. దావరి | ప్రవహిస్తోం. దే. చె.ల్లీ. . |
గమగారిస సా; ; |
ప్రవహిస్తోం. దే. . |

1. చ॥ గగప పాప పప దపపప | పదపామగ మప పాపా |
వి శా. లాంధ్ర నలుమూ. లల | వై. వాహిక వై. భోగం |

గపప దసని దనిదపపా | పదపమ గారిస రిసా |
జనుల కనుల వెలుగులలో | జా. జులు వారెడి రా. గం |

తరువాత పల్లవిలాగా పాడాలి యీ క్రింది పంక్తులు

గెలవేసిన అరటి చెట్లు తీసుకురానా
ఎలమామిడి తోరణాలు కట్టనా

తరువాత

గపపాపప ధసస సారి | గామగరిస సా; ; |
గెలవేసి న అరటి చెట్లు | తీసుకురా. నా. . |

మొదటి చరణంవలెనే మిగిలిన చరణాలు పాడాలి.

'త్వమేవాహం", "సినీవాలి" అనే అభ్యుదయ కవితారఖరుల ఖండ కావ్యాలను లోకానికందించిన ఆరుద్ర "సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర"ను విరచించి తెలుగుకవితా ప్రపంచానికి ఎనలేని సేవచేశారు. మొదట కొంతకాలం వరకు మేనమామయైన శ్రీశ్రీ బాటలో నడిచినా, ఆ తరువాత సొంత గొంతుకతో సాహితీ క్షేత్రంలో అనేక ప్రయోగాలు చేశారు. ఇవేకాక అనేకమైన లలిత గీతాలను ఆకాశవాణికి, చలన చిత్రరంగానికి అందించారు. ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో "గీతావళి" అనే లలిత సంగీత కార్యక్రమాలలో 1940, 50వ దశకాలలో ఘంటసాల, రాజేశ్వరరావు, బాలసరస్వతీదేవి, ఎం.ఎస్.రామారావు, ఎస్.వరలక్ష్మి, భానుమతి, రజని మున్నగువారు సుప్రసిద్ధ కవుల గీతాలను తరచుగా ఆలపిస్తుండేవారు. ఆరుద్ర రచించిన "తూరుపు దిక్కున అదిగో చూడు పొడిచె వేగుచుక్క", "సాగేను కారు రేగే హుషారు", "వేదంలా గోదావరి ప్రవహిస్తోందే" అన్న గేయాలను ఘంటసాల, "చలిగాలి వీచింది తెలవారబోతుంది ఇకనైన యిల్లు



ఆరుద్ర

చేరవాప్రియా", "నడిరేయి దాటింది వదిలేయి నా చేయి వస్తానులే రేపు ప్రియతమా" పాటలను బాలసరస్వతీ దేవి గానం చేయగా అవి చాల పాప్యులర్ అయినాయి. "ఎందుకింత సంతోషమో యీ తెలుగు వాళ్ళకి", "తెలుగు పాటకు నేడు కొత్తపల్లవి పాడుతూ - తెలుగు వాకిట కొత్త రంగవల్లిక చూడుమా", "ఆకాశవీధిలో ఎన్ని తారకలో అణగారె మనసులో అన్ని కోరికలు", "నిరంతరం మా హృదంతరంలో నిండి వెలుగుజ్యోతి - అంజలి చేకొనుమా బాపూ" మొదలగు పాటలు మంచాళ జగన్నాథరావు స్వరరచనతో ఆకాశవాణి ద్వారా తెలుగువారిని అమితంగా ఆకట్టుకున్న ఆరుద్ర విరియించిన సురుచిర సౌరభ సాహితీ కుసుమాలు.

ఇక చలన చిత్రాలలో ఆయన తుదిశ్వాసవరకూ ఎన్నో వైవిధ్య భరితమైన గేయాలను రచించారు. "కొండగాలి తిరిగింది గుండె ఊసులాడింది గోదావరి వరదలాగా

మే నెల 1-15 సంచికలో అలనాటి మహానటి శ్రీమతి పసుపులేటి కన్నాంబ గురించి చాలా విపులంగా వ్రాసేరు. అలనాడు ఆమె గానం చేసిన "లాలీ తనయా లాలీ - సందరనంద కుమారా!? (2) 'భారతభూమి మనదే కానీ ఫలితము మనకేదీ' అని ఆమె యిచ్చిన గ్రామఫోను రికార్డు మనకి స్వాతంత్ర్యం రాక ముందు చాలా ప్రఖ్యాతి గాంచింది. ఆమె గానం చేసిన కృష్ణంభజరాధా, దాని ప్రక్కన చదివిన పద్యం 'నిత్య సత్యప్రేజి - దరిణినేలిన - కన్నడ రాగంలో చాలా మధురంగా పాడారు. తదుపరి పద్మశ్రీ నాగయ్యగారు - ఆమె కలిసి పాడిన 'లలిత సంగీతం (అలనాటి) అందాలు' శీర్షికగా క్యాసెట్స్ రూపంలో ఉన్నాయని శ్రీ వి.వి.కె. రంగారావుగారు అన్నట్లుగా తెలిసింది. ఆ కేసెట్సు మాకు కూడా లభింప చేయగలరా! దయవుంచి యీ ఉపకారం చేయండి.

-యం.వి.కృష్ణారావు, కాకినాడ

(అరుదుగా దొరికే పాటల్ని సమకూర్చి 'హాసం' పాఠకులకు అందజేసే స్కీముల్ని రూపొందించనున్నాం. అదే కనుక ఫలించి కార్యరూపం దాలిస్తే 'హాసం' జన్మ చరితార్థ మయినట్లే! -ఎడిటర్)

మే 1-15 కన్నాంబ గారి వర్ధంతి సందర్భంగా రవిచంద్రన్ చక్కగా ఆమె గురించి వ్రాసారు. కాని ఆమె చివరి చిత్రం 'వివాహ బంధం' అని వ్రాసారు. అది కరెక్ట్ కాదు. 'వివాహబంధం'లో కొద్ది సీన్స్ తీసిన తరువాత ఆమె చనిపోయారు. ఆ తరువాత ఆమె స్థానంలో సూర్యకాంతంతో రీ షూట్ చేశారు. ఆమె చివరి చిత్రం "కీలుబొమ్మలు" అని గ్రహించగలరు. ఆమె నటించిన "వదిన, కార్తవరాయుని కథ, వచ్చిన కోడలు నచ్చింది, చరణదాసి, శ్రీకృష్ణకుచేల, ముగ్గురుకొడుకులు, కుటుంబ గౌరవం, ఉషా పరిణయం, ఆప్తమిత్రులు, పెళ్ళితాంబూలం, పెండ్లి పిలుపు, నువ్వా - నేనా" చిత్రాలు రవి చంద్రన్ పేర్కొనలేదు.

-పి.హెచ్.ఆర్.కృష్ణ, హైదరాబాద్.

శ్రీరామనవమి ప్రత్యేక సంచికలో ఆలిండియా రేడియో, హైదరాబాదు నుండి




పి.ఎస్.గోపాలకృష్ణగారు రాసిన లేఖలో త్యాగరాజస్వామి కుమార్తెకు సంతానం లేదు అని వ్రాశారు. అది వాస్తవం కాదు. స్వామి కుమార్తె అయిన సీతామహాలక్ష్మికి ఒక కుమారుడు కలుగగా అతనికి త్యాగరాజన్ అనే నామకరణం చేశారు. అతను వివాహానంతరం నిస్సంతుగా మరణించాడు. అతని భార్య గురువమ్మాళ్ స్వామి పట్ల కడుభక్తి శ్రద్ధలతో ఉండేది.

ఈ విషయం 1947లో ప్రచురించిన త్యాగరాజస్వామి శతవార్షికోత్సవ సంచికలో ఉంది. విస్సా అప్పారావుగారి సంపాదకత్వంలో రాజమండ్రి ఆంధ్రగాన కళా పరిషత్తు వారు ఈ సంచికను వెలువరించారు. సికింద్రాబాదు మల్కాజ్‌గిరిలో నివసించే సంగీతజ్ఞులు శ్రీ ఎం.ఆర్.వైద్యనాథన్ గారు ఈ విషయాన్ని త్యాగరాజస్వామి శిష్యులైన వాలాజీపేట వేంకట రమణ భాగవతార్ గారి వంశస్థులైన వాలాజీపేట రామస్వామిగారి విరచితమైన గ్రంథం చూచి ధృవీకరించారు. గమనింపగలరు.

-పి.లక్ష్మి, హైదరాబాదు.

ఎందరో గాయకుల గానాన్ని, ఎన్నోరకాల పాటలను అందించే హెచ్.ఎం.వి. వారు ఎందుకో "మంగళంపల్లి బాలమురళీకృష్ణ" గారి సినిమా పాటలను వెలువరించలేక పోవడం తెలుగు శ్రోతలకు తీరని లోటు. 'హాసం' వారు హెచ్.ఎం.వి వారిని సంప్రదించి బాలమురళీగారి సినిమా పాటలు వెలువరింప జేయాలని నా వంటి అభిమానుల కోరిక. వారు ఎన్నో పాటలు ఆణిముత్యాల్లా తెలుగు వారికి అందించారు. మచ్చుకు కొన్ని.

1. మౌనమె నీ భాష ఓ మూగమనసా (గుప్పెడుమనసు) 2. ఏటిలోని కెరటాలు ఏరు విడిచి పోవు (ఉయ్యాల జంపాల), 3. నీవూ నేను వలచితిమీ (కర్ణ), 4. వసంతగాలికి వలపులురేగ (శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు), 5. అదిగో మా రాధిక (కలసిన మనసులు), 6. పలుకే బంగార మాయెరా (అందాల రాముడు) 7. శ్రీరామజయ రామసీతారామ (ముత్యాలముగ్గు) 8. కరుణా మయీ శారదా (పవిత్రహృదయాలు) 9. సలలిత రాగసుధారససారం (నర్తనశాల) 10. జీవితమె కృష్ణ సంగీతము (శ్రీమద్విరాటపర్వం) 11. మేలుకో శ్రీరామా (శ్రీరామాంజనేయయుద్ధం) 12. తెరతీయరాతిరుపతిదేవరా (శ్రీవెంకటేశ్వర వైభవం), 13. శ్రీకృష్ణకృష్ణకృష్ణ (వీరాంజనేయ), 14. అరుణాయ (పాండవవనవాసము) ఇంకా ఎన్నో పద్యాలు, పాటలు పాడిన గంధర్వుడు బాలమురళి. వారి సినిమా పాటలు కలకాలం భద్రపరుచుకోవాలనే అభిమానులకు చేయూత నిస్తారని ఆశిస్తాను.

-ఆత్మూరి వెంకట సూర్యనారాయణ
విద్యానగర్, హైదరాబాద్

మీ ఉత్తరం చూశాక హెచ్.ఎం.వి. వారిని కాంటాక్ట్ చేశాము. 'పలుకే బంగారమాయెనా' అనే పేరు మీద రెండు సంవత్సరాల క్రితమే ఓ క్యాసెట్‌ని (సీరియల్ నంబరు 848548) విడుదల చేశామని హెచ్.ఎం.వి ప్రొడక్ట్ మేనేజర్ యస్.పి.శివప్రసాద్ తెలిపారు. ఆ క్యాసెట్‌లో మీరు ఉదహరించిన వాటిలో 9 పాటలతోపాటు భక్తప్రహ్లాద, దొరికితేదొంగలు, శ్రీమద్విరాటపర్వం వంటి చిత్రాలలోని పాటలతో కలిపి మొత్తం 16 పాటలున్నాయని, ప్రస్తుతం మార్కెట్లో ఆ క్యాసెట్ దొరుకుతోందని తెలిపారాయన. -ఎడిటర్

**పైన ప్రచురించిన ఉత్తరం చూశాక హెచ్.ఎం.వి. వారు 'హాసం'కు ఒక సూచన చేశారు.సంగీతప్రియులందరు ఆనందించ బోయే ఆ సూచన వివరాలు వచ్చే సంచికలో....**

కోరిక చెలరేగింది.... ప్రాప్తమున్న తీరానికి పడవసాగి పోయింది" - పెండ్యాల స్వరరచనతో మలయమారుత రాగఝరులతో గుబాళించింది. "ఊహలు గుసగుసలాడె నా హృదయము ఊగిసలాడె" (ఘంటసాల స్వరరచన) "శ్రీరామనామాలు శతకోటి ఒక్కొక్క పేరు బహు తీపి" (రమేష్‌నాయుడు సంగీతం) లాంటి రసగుళికలు తెలుగువారు ఎన్నటికీ మరువలేనివి.

## బిలహరి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఎవరు నేర్పేరమ్మ యీ కొమ్మకు | ఈనాటిబంధమేనాటిదో | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 2. | మాదీ స్వతంత్రదేశం | ప్రైవేట్ రికార్డు | టంగుటూరి సూర్యకుమారి | రజని |
| 3. | విరటుని రాణివాసమున (పద్యం) | భార్యాభర్తలు | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |

పౌరాణిక చిత్రాలలో చాలా పద్యాలకు బిలహరి రాగం ఉపయోగించబడింది.




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరు తెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు
నటుడు
**రావి కొండలరావు**
రాసిన వ్యాసమిది





# చమత్కారాల వల్లరి సాహిత్యంతో అల్లరి

# ఆరుద్ర

"నేను గడ్డం పెంచుకుంటున్న కొత్తలో, ఓ జర్నలిస్టు రోడ్డు మీద కనిపించి "ఈ చిరుగడ్డంలో మీరు షాజహాన్‌లా వున్నారు" అన్నాడు. "ఆ మాట గట్టిగా అనకయ్యా బాబూ - మా ఆవిడ వింటే తాజ్‌మహల్ కట్టించమంటుందీ" అన్నాను" అని చెప్పింది ఆరుద్రేనని, చదువరులు పసిగట్టి వుంటారనడంలో సందేహించవలసిన అవసరం లేదు. సాహిత్యంలోని ఏ ప్రక్రియనూ వొదిలి పెట్టకుండా రాసిన - ఆరుద్ర అని పిలవబడే - భాగవతుల శంకరశాస్త్రి సహృదయుడు, రసహృదయుడూ, సరస హృదయుడూనూ. చమత్కారీ, 'చమక్' చారీ. జోకు చెయ్యని సంభాషణ వుండదు, జోకు చెప్పని ప్రసంగం వుండదు. ముఖమెరుపు, గడ్డం నెరుపు, జుబ్బా పైజమా పైన శాలువాతో అడావుడిగా కనిపించే ఆరుద్ర - సినిమా రచయితగా ప్రసిద్ధుడు, సాహితీవేత్తగా సుప్రసిద్ధుడూ పరిశోధకుడూ. పట్టని ప్రక్రియ లేనట్టే చేపట్టని సబ్జెక్టూ లేదు - ఈ సమగ్ర ఆంధ్ర చరిత్రకారునికి! మాటలు 'పన్'నడంలో, విరవడంలో, కలపడంలో తొలినుంచి గట్టివాడు. 'ఆ' పెన్ - ఆపెన్, ఆ 'మెన్' -ఆమెన్ లాంటి ఆంధ్రాంగ్ల ప్రయోగాల గారడీలు, పారడీలు ఎన్నో సినిమాల్లో కూడా హాస్యగీతాలూ, పారడీలూ రాసినప్పుడు చేసిన తమాషాలూ వేసిన మసాలాలూ ఎన్నో. "అంత్యప్రాసకు ఆరుద్రను వాడుడు' అన్నట్టు ఎక్కువ పాటల్లో అంత్యప్రాసే కనిపిస్తుంది. కష్టపడి నేర్చుకున్న 'మాజిక్కు'ని పాటల మాటల్లో కూడా వాడి, 'లిరికల్ మెజీషియన్' అనిపించుకున్నారు. ఆయనకి నేను రాసిన కొన్ని పుస్తకాలు ఇచ్చి - ఒక దాని మీద "6ద్రగారికి" అనీ, ఒక దానిమీద 'Sixద్ర' గారికీ అని రాసిస్తే నవ్వుతూ 'మౌంటెన్స్ డు నాట్ కమ్' అని నా పేరుని ఇంగ్లీషుకి ఆరుద్రీకరించారు.

ముళ్లపూడి వెంకటరమణగారి పెళ్ళికి వెళ్లినప్పుడు చిన్న చిన్న ఇళ్లలోంచి వెళ్లవలసిరాగా, తలలు వంచి వెళ్తుంటే "పెళ్లి వారు మనకి తలవంపులు తెప్పిస్తున్నారు" - అని 'జోకౌక్యం చేసుకున్నారు ఆరుద్ర. ఇంకో పెళ్లి రిసెప్షన్‌లో పాప్ మ్యూజిక్ పాడుతుంటే - 'పుణ్యకార్యంలో పాపమ్యూజిక్'





అని చమత్కరించారు. అప్పుడే 'హిప్పీలు' అన్న మాటకి తెలుగులో ఏం చెప్పాలని అడిగితే, 'కుర్ర సన్నాసులు' అన్నారు రిపీమని. అలా రిపీమని చెప్పగలిగే ప్రజ్ఞావంతుడు గనక, నేను 1962లో నాటకం రాసి - ఏం పేరు పెట్టాలా అని ఎన్నో పేర్లు ఆలోచించి, మరి కొందర్ని అడిగి సతమతమై ఆరుద్ర గారిని అడిగి, నాటకం కథ నాలుగులైన్లు చెప్పేసరికి "నాలుగిళ్ల చావిడి" అని పెట్టండన్నారు వెంఠనే!



హైదరాబాద్‌లో ఓసారి సాలూరు రాజేశ్వర రావుగారు "మీకు ఈ వూళ్లో ఏవైనా భూము లున్నాయా?" అని అడిగితే, "ఆ-రుద్ర భూములన్నీ నావే" అని చమత్కరించినట్లు విన్నాం. కొన్ని సినిమాలకి తాపీ ధర్మారావుతో కలిసి ఆరుద్ర రచన చేసినప్పుడు - "రచన: తాపీ, ఆరుద్ర" అని వేసే వారు. అందుకు "ఒకరు తాపీ, ఒకరు ఆదుర్దా" అని ఆయనే చమత్కారం చేసి, అందరి దగ్గరా చెప్పేవారు. ఎప్పుడూ నవ్వుతూ, మెత్తగా మాట్లాడే స్వభావం.

ఆరుద్రగారు ఏ సభలో ఉపన్యసించినా, ఆయనకి ముందు మాట్లాడే వారు బహుజాగ్రత్తగా వుండాలి! ఏ మాత్రం పొరపాటు మాట రాకూడదు. దాన్ని వెంటనే ఆరుద్రగారు కరెక్ట్ చేస్తారు, లేదా ఖండిస్తారు. ఒక సభలో "తెలుగు భాష - పత్రికలు' గురించి పలువురు మాట్లాడిన తర్వాత ఆయన లేచారు. "దేశ భాషలందు తెలుగు లెస్స' అని కృష్ణదేవరాయలు అన్నట్టుగా చాలామంది చెప్పారు. కాదు, ముందుగా శ్రీనాథుడు ఆమాట అన్నాడు. తర్వాతనే కృష్ణదేవరాయలన్నారు" అన్నారు ఆరుద్ర. అలాగే "తెలుగులో వచ్చిన తొలి దిన పత్రిక ఆంధ్రపత్రిక" అని కొందరు మాట్లాడితే, తన ఉపన్యాసంలో ఆరుద్ర -" కాదు, అంతకుముందే కందుకూరి వీరేశలింగం పంతులుగారు రాజమండ్రి నుంచి "వివేక వృత్తాంతిని" అన్న దినపత్రిక నడిపారు. అలాగే తొలి తెలుగు వారపత్రిక 'మద్రాసు క్రానికల్' 1833లో వెలువడింది" అని సవరించారు.

మాండొలిన్ శ్రీనివాస్‌కి - రాజాలక్ష్మీ ఫౌండేషన్ అవార్డు లభించినప్పుడు వక్తలు ప్రసంగిస్తూ "మాండొలిన్ అనే విదేశీయ వాద్యం మీద కర్ణాటక సంగీతం వినిపించడం అతడికే చెల్లింది" అంటూ మాట్లాడగా ఆరుద్ర ఖండించారు. "మాండొలిన్ విదేశ వాద్యం కాదు. స్వదేశ వాద్యమే!" అని చెబుతూ, పూర్వరాజుల ఆస్థానాల్లో మాండొలిన్‌లు వుండేవనీ, "అజంతా ఎల్లోరా గుహల్లోని శిల్పాల్ని పరిశీలించే మాటుంటే - ఆ చిత్రాల్లో మాండొలిన్ వాద్యం స్పష్టంగా కనిపిస్తుంది" అనీ అందరూ విస్తుపోయేలా సర్ది చెప్పారు. "వయొలిన్ అనే మాటని 'వాయులీనం' అని తెలుగులో చెప్పుకుంటున్నట్టుగా, మాండొలిన్‌ని 'మందలీనం' అని చెప్పుకోడం సిగ్గుచేటు" అన్నారారుద్ర.

విజయనగరంలో 'హస్తబల్' అని ఒక నాటకశాల వుంది - మహారాజావారిది. ఆ స్టేజి మీద ఆరుద్ర గారికి వైభవోపేతమైన సన్మానం జరిగింది. దిగ్గజాల్లాంటి పెద్దలు మాట్లాడారు.



"మహారాజావారు ఏనుగుల్ని కట్టిన ఈ హస్తబల్ స్థలంలో, సాహిత్యంలో గజరాజు వంటి ఆరుద్ర గారికి సత్కారం జరగడం గొప్ప ఔచిత్యం!" అంటూ వక్తలు ప్రసంగిస్తే - సన్మానితుడు కొట్టిపారేశారు! "మహారాజా వారికి ఏనుగుల్లేవు. ఇక్కడ ఆయన ఏనాడూ ఏనుగుని కట్టలేదు. ఇది స్టేబుల్ - అంటే గుర్రాలశాల. ఇంగ్లీషులో 'ఎస్' ముందొచ్చే కొన్ని మాటలకి 'ఇ' కలుపుతాం. ఇస్కూలు, ఇస్పూన్ - అలా, అలాగే స్టేబుల్ - ఇస్టేబుల్ అయి, ఇస్తేబులయి అస్తబలయి, హస్తబలయింది" అని చరిత్ర చెప్పి చిత్తు చెయ్యగల చరిత్ర గలవాడాయన.

భరతనాట్యం గురించి క్షుణ్ణంగా పరిశోధన చేసి వ్యాసాలు రాసిన వాడు. అంచేతనే పద్మా సుబ్రహ్మణ్యం వంటి భరత నాట్య ప్రవీణురాలు కూడా ఆరుద్రగారిని అడిగి సందేహాలు తీర్చుకునే వారు. "మరి మీరు భరతనాట్యం ఎందుకు ప్రాక్టీసు చెయ్యలేదూ?" అని అడిగితే - " ఎన్నో డిటెక్టివ్ నవలలు రాశాను. డిటెక్టివునా? నాటికలు, నాటకాలూ రాశాను. నటుణ్ణా?" అని తిరిగి అడిగారు ఆరుద్ర.

సినిమా పాటల రచయితల్లో స్పీడ్ రైటర్‌గా కూడా ఆయనకి పేరుంది. తొందరగా పాట రాయడం, ఇంకో రచయితకి కుదరని పాటని టక్కున రాయడం - ఆయనకి వచ్చినట్టు ఇంకొకరికి రాదేమో! ఒక సినిమాకి ఆయన ఐదు నిమిషాల్లోనే పాట రాసి ఇస్తే అందరికీ "ఓకే" అయింది. "ఐదు నిమిషాల్లో రాసిన పాటకి కూడా ఐదు వందలు (అప్పుడే అంతే ఇచ్చేవారు) ఇవ్వాలా?" అని నిర్మాత గొణిగితే - "దీని వెనకాల నలభై ఏళ్ల అనుభవం వుంది. దానికిస్తున్నారు" అని ఛెళ్లుమనిపించారు ఆరుద్ర.

ఆరుద్రగారికి జరిగిన ఒక సన్మాన సభకి విశ్వనాథ సత్యనారాయణ గారు 'పౌరోహిత్యం' వహించారు. "శివాలయాల్లో జరిగేది రుద్రాభిషేకం. ఇవాళ ఇక్కడ జరుగుతున్నది ఆరుద్రాభిషేకం" అని కవి సమ్రాట్ చమత్కరించారు. "అంతకంటె నాక్కావల్సిందేముంది? ఐనా నేనూ శంకర శాస్త్రినే" అని ప్రతి చమత్కరించగల ప్రజ్ఞాశాలి ఆరుద్ర - అని వేరే చెప్పాల్సిందేముంది?




### జూన్ 4 ఆరుద్ర వర్ధంతి సందర్భంగా

# పొగడపూలు

-ముళ్లపూడి వెంకటరమణ

**దర్శకుడుగా బాపుకీ, నిర్మాతగా రమణకూ తొలి చిత్రం సాక్షి (1967). దాని పాటల కంపోజింగ్ కోసం బెంగుళూరు వుడ్‌లాం యడ్స్‌లో సిట్టింగ్సు పెట్టుకున్నాం. శ్రీ మహదేవన్, పుహళేంది, మైకేల్ (తబలా) రచయిత ఆరుద్ర, మేమిద్దరం కూర్చున్నాం... అంతకు ముందు నుంచి ఆరుద్రగారు మాకు రాత గీతల నేస్తం అయినా సినిమా పాటల సిట్టింగు దగ్గర కొత్త పరిచయమే...**

**లోగడ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నా సినిమా సమీక్షలు బాగున్నాయని నలుగురూ మెచ్చుకున్న రోజులలో మొలిచిన చిన చిన్న కొమ్ములను బులబులాగ్గా తడుముకుంటూ నేను కొంచెం గొప్పలు పోబోయాను-**

ఆరుద్రగారూ! మీరు పూర్వం 'అత్తా ఒకింటి కోడలే' లో ఒక పాట రాశారు, అశోక వనమున సీతా - శోకించె వియోగము చేతా - అని ప్రాస వేశారు గుర్తుందా... అలాంటి అంత్యప్రాసలు ఈ సినిమాలో మనకొద్దు.... ఎందుకంటే అప్పుడు నేను వాటిని విమర్శించాను - ఇపుడు అలాంటివి ఒప్పుకోలేను - అన్నాను.

ఆరుద్రగారు - అప్పటికింకా పెంచని రాగి రంగు గడ్డాన్ని నిమురుకుంటూ - నావంక చిరునవ్వుతో చూశారు - రాసుకోండి అన్నారు - అది వీధి నాటకంలో రాధాకృష్ణుల సరసాల ఘట్టం...

'దయ లేదా నీకు దయ రాదా' అంటూ పల్లెటూరి బల్లకట్టు కిష్టమూర్తి - రాధ గుమ్మంలో పాడుతున్న సన్నివేశం అది...

సత్యభామ యింట కాలితో తన్నులు తినివచ్చాడని తెలిసిన రాధ దెప్పుతూ - పొమ్మంది -

ఆలూ -

ఎర్రతేలూ

దాని కాలూ

నీకు చాలూ... అని చెప్పారు - ఆరుద్రగారు.

ఆ మాటల జోరుకీ చక్కదనానికీ నాకు దిమ్మదిరిగి పోయింది - వాగిన నాలుకను కటుక్కున కొరుక్కుని మూర్ఛపోయి - లేచి - నీళ్ళుతాగి - అద్భుతం - అని రౌడీఈలవేసి (అప్పుడీ అలవాటుండేది) చప్పట్లు కొట్టాను... ఒద్దన్నదాన్ని కావాలనిపించేలా చెప్పి ఒప్పించడం... దటీజ్ ఆరుద్ర...

*****

సినిమాలో పాటల రాసే రచయితలెందరో- దాదాపు అందరూ మాకు మిత్రులూ యిష్టులే అయినా తొలి చిత్రం సాక్షిగా ఆరుద్రగారే మాకు పరమ ఆప్తుడు - అయిపోయారు. సాక్షిలో ఒకటి తప్ప అన్నిపాటలూ ఆయనే రాశారు... ఆ చిత్రమే కాదు, 67 తరువాత నుండి 38 ఏళ్ళపాటు - ఒకటి తప్ప (వంశవృక్షం) - ఆయనే అన్నిటికీ ఎక్కువ పాటలు రాశారు - ఆయనని "మాస్థాన కవి" అని ముద్దుగా పిలుచుకునే వాళ్ళం - ఆయన తరువాత ఆయన వలెనే పాతిక ముప్ఫయి ఏళ్ళు - అంత గానూ దగ్గరయి ప్రేమ ఆదరం చూపిస్తూ పాటలు వ్రాసిన వారు మరి యిద్దరు ఉన్నారు - శ్రీ సినారే - శ్రీ కొసరాజుగారు...

*****

సాక్షిలో ఒక్కపాటకు మాత్రం ఆరుద్ర చాలా శ్రమ పడ్డారు... దారి దొరకలేదు - మాట కుదరలేదు- కుదిరినవి బాపు గారికి నచ్చలేదు... వారం తిరిగింది - బెంగుళూరు బడ్జెట్టు నిండుకునే దశకి చేరుకుంది.



సాక్షి (1967) - బాపూ రమణల తొలిచిత్రం

ఆరుద్రకి రోషం వచ్చింది - పంతం పెరిగింది. చివరిరోజు ఉదయం

- ఆయన ఆరుగంటలకే లేచి బయటకు వెళ్ళి వుడ్‌లాండ్స్ హోటల్ కాంపౌండు కలయ తిరుగుతున్నారు... హఠాత్తుగా గురువుగారు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు గుర్తుకొచ్చారు... వారు మా అందరికీ గురుదేవులే -

ఈ బాపూ రమణలు - ఈ పాటని గురువుగారికిస్తే - ఏం జరిగేదీ అని ఆలోచన వచ్చింది... అది పెళ్ళిపాట - చావు బతుకుల మధ్య గిలగిలలాడే కిష్టిగాడి చేత - చుక్కవాడిని కాపాడడానికోసం బలవంతాన తాళికట్టించుకుంటూ పాడేపాట - ఇలాటప్పుడు గురువుగారు ఏమంటారు-??..

'అమ్మ కడుపు చల్లగా అత్త కడుపు చల్లగా బతకరా బతకరా పచ్చగా'' - అనిపించింది... అంతే. అరగంటలో - పాట ప్రవహించింది.

ఆ పాటతోనే సాక్షి చిత్రం షూటింగు ఆరంభించాము - పులిదిండి గ్రామంలోని కోవెలలో - ఆరు నిముషాల పాటను డైరెక్టర్ బాపు, కెమెరామన్ సెల్వరాజ్ గారు మూడు గంటలలో చిత్రించి ముగించారు.

"ఆరుద్రా! సెబ్ బాష్ష్''
అనేవాడు లిమరిగ్వేది ఆగ్‌డెన్ నాష్-
"హియర్ హియర్''
అనేవాడు ఎడ్వర్డ్ - డియర్ లియర్ -
అమెరికాన్ టెలుగూస్ మీద
ఆరుద్ర ఈనాటి ఇంటింటి పజ్యాలు
ఆనాడు వాళ్లు చదివి - వుంటే గింటే
అయితే - కానీ -
ది గోల్డెన్ ట్రాషరీ ఆఫ్ ఆగ్డెన్ నాషరీ అంతా గాలించినా
లియర్ గారివిజర్డరీ వరల్డ్ శోధించినా
దొరికేది లిమరిక్కుల
పదసంపద ట్రిక్కులే
మరి నీ మాటల మాటో?
నీ అక్షర తూణీరం నుండి
మనసున్న మనుషులందరిలోకీ
అక్షర లక్షల అక్షరాస్త్రాలు ప్రయోగించి
కవితలూ కథలూ గాథలూ గేయాలూ
గాయాలూ నవలలూ నృత్త నృత్య
నాట్యనాటకాలూ సినిమాటలూ
ఆటలూ పేకాటలూ నుడికట్టులూ
గుడి (చేటి) కట్లూ వాక్ చతురంగాలూ...
ఓహో! పుంఖాను పుంఖాలుగా
ప్రయోగించి.... జయించి...
హౌరా!



అక్షర శరీరా!
పరిశోధన పరమేశ్వరా!
క్షరమైన దేహాన్ని
అక్షర శరీరంగా అనువదించుకుని
సాహిత్యాకాశంలో
ధ్రువ కవిరాజల్లే రంజిల్లే
ఆరుద్రా! సెహబ్బాష్ష్.

సంపూర్ణ రామాయణం ఒక చిత్రమైన అనుభవం.... నేను నిర్మాత వేషం కూడా పోషిస్తున్నందువల్ల స్క్రిప్టును ప్రధానంగా ఆయనే రాశారు - స్క్రీన్ ప్లే కూర్చుకున్నపుడు అనుకున్న పాటలూ సందర్భాలూ కాకుండా - వెడలెను కోదండపాణి లాంటి సుదీర్ఘ కథా కథన గీతంలో ఎన్నో కొత్త చరణాలూ పద్యాలూ మెలకువలూ ఆయన కలంలో నుంచి ప్రవహించాయి - వాటిలో అక్షరం తేడా లేకుండా స్వీకరించాము- అది ఆయన ఘనత...

మేము తీసిన రామకథా చిత్రాలలో కొన్ని మరుపురాని పరిమళ భరితాలయిన పొగడపూలవంటి సందర్భాలు ఉన్నాయి....

శ్రీ రామాంజనేయ యుద్ధం తీస్తున్నపుడు యయాతి కథను ప్రధానంగా నేపథ్యంలో చెబుతూ - రామ చంద్రుని మహిమను వర్ణించాలి - ఎన్నో ప్రయ త్నాలు చేసినా - కుదరలేదు - రికార్డింగు డేటు దగ్గరపడింది - శ్రీ ఎన్.టి.ఆర్ గారి కాల్‌షీట్! ఆయనకి కోపం వస్తే అంతా ఫటాఫట్! చివరి సమ యంలో ఆరుద్ర గారు దొరి కారు- అంత వరకూ - బహుశా ఇందు కోసమే నేమో ఆయన అందు బాటులో లేరేమో! రెండే రోజుల వ్యవధి - పిలిచి కథా సందర్భాలు చెప్పాము - శ్రీరామ నామం- శ్రీరామ పాదం -శ్రీరామ శపథం - శ్రీరామ బాణం అంటూ శ్రీరామ మహిమాన్వి తములైన నాలుగు కేంద్రాలను కల్పిం చారు. ఒక్క పూటలో పాట రాశారు.



'రామాంజనేయయుద్ధం'

**1. శ్రీకరమౌ శ్రీరామనామం**
**జీవామృత సారం....**
**పావన మీ రఘురామనామం**
**భవ తారక మంత్రం**

**2. శ్రీయుతమౌ శ్రీరామ పాదం**
**శ్రితజన మందారం...**
**పావన మీ రఘురామపాదం**
**పాప వినాశకరం**

**3. భీషణమౌ శ్రీరామ శపథం**
**వీడదు ధర్మపథం**
**ఇప్పటి ఈ రఘురామ శపథం**
**హృదయ విదారకం**

**4. భీకరమౌ శ్రీరామ బాణం**
**తిరుగులేని అస్త్రం**
**పావనమౌ రఘురామ బాణం**
**భక్త పరిత్రాణం**

*****

గోరంత దీపం తీస్తున్నప్పుడు ఒక ప్రయివేట్ రికార్డు విన్నాం-

**రాయినైనా కాకపోతిని రామపాదము సోకగా**
**బోయనైనాకాకపోతిని పుణ్యకావ్యము వ్రాయగా-**
**కాకినైనా కాకపోతిని ఘాతుకమ్ములు సేయగా**
**గరిక పోచను శరము చేసే ఘనత రాముడు చూపగా-**

అది విని ముగ్ధులమై - అది ఆరుద్రగారిదే అని తెలిసి - ఆశ్చర్యపోలేదు - అనితరసాధ్యం కనుక! అది ప్రయివేటు రికార్డుగా విడుదల అయి ప్రజాదరణ పొందిందని తెలిసినా గ్రామఫోను కంపెనీ వద్ద దానిపై హక్కులు తీసు -'కొని' సంగీతం - అప్పుడూ శ్రీ మామయే - ఆ చిత్రంలో అమర్చుకున్నాము...ఆ పాట విని డా॥సినారె గారు థ్రిల్లయిపోయారు-

"జన్మ మొత్తానికి ఇలాటి పాట ఒక్కటి రాస్తే చాలు - జన్మధన్యం అవుతుంది" అన్నారు. ఆడది మెచ్చిందే అందం అన్నట్టు సాటి కవి - అంతటి జోహారం వెయ్యడం - దానికదే సాటి...

*****

(సినారె వర్ణించిన అమృత గేయాలలో వటపత్ర శాయికీ వరహాల లాలీ...అనే పాట కూడా అన్ని విధాలా అంత గొప్పది అనిపిస్తుంది.)

*****

సీతా కళ్యాణం తీస్తున్నప్పుడు - సీతమ్మవారూ చెలులూ ఆటలాడు కోవడం సందర్భం వచ్చింది. బాపుగారు దాగుడుమూతలు ఆట గురించి చెప్పి - సీతకి ఇంత పెద్ద కన్నులు అయితే - వాటిని మూయడం ఎలాగమ్మా - దాగుడు మూతలు ఆడడం ఎలాగమ్మా - అని చెలులు సరసాలు ఆడేలా వ్రాయమని - ఆ పాట వ్రాయవచ్చిన కవిగారికి చెప్పారు. ఆయనకు అది పట్టినట్టు లేదు. "అద్దం మీద ఆవాలలా" అంటూ పరుగెత్తే చెలుల గురించి ఏవో ఉపమానాలు వేసారు. బాపుగారికి నచ్చలేదు. ఆ రచయిత కూడా సామాన్యుడు కాదు. అసాధారణ ప్రతిభాశాలి. మహాపండితుడు(కవి సేనాపతి). ఎంత పండితుడైనా అవసరమైన వేళ తేలు మంత్రం కూడా వచ్చి ఉండాలి. ఆయనకు కోపం వచ్చింది. "సినిమా పాటల్లోకి కూడా కాస్త కవిత్వం చొరబడనివ్వండి సార్" అని వ్యంగ్యం విసిరారు...

ఆ మర్నాడు ఆరుద్ర గారు వచ్చారు.

అదే సందర్భానికి ఆరుద్ర రాసిన పంక్తులు ఇవీ:

**సీతమ్మకు సింగారం చేతామురారమ్మ**
**సిరితల్లి ముచ్చటలు చూతాము రారమ్మ**
**రారమ్మా రారమ్మా**
**ఆటలలో హరినే తలిచి**
**మనలోకంలో ఉండదు**
**పంటల వేళ పరాకు వల్ల**
**పడతి జానకి పండదు**
**చెంపకు చారెడు**
**కన్నులు ఐతే ఎల్లాగమ్మా మూసేది (2)**
**సైయ్యా? సై**
**దాగినవారిని వెతకదు సీత**
**ఎల్లాగమ్మా ఆడేది...**



**అవునమ్మా అవునమ్మా (2)**
సీతమ్మవారితో చెలులు ఆటలాడుకునే



ఈ సన్నివేశానికే ఆరుద్ర గారు మరో చరణం కూడా రాశారు.

**బంతుల ఆటకు ఇంతిరావే**
**ఇదిగో బంతిపూల బంతి**
**ఇదిగో సన్నజాజి బంతి**
**ఇదిగో మల్లెపూల బంతి**
**ఇదిగో కలువపూల బంతి**
**చెలికత్తెలు విరిబంతులు రువ్వ**
**చిరునవ్వులు రువ్వును సీతమ్మ**



**ఆదిలక్ష్మికి పువ్వుల పూజలు**
**అలవాటే గద అవునమ్మ**
**అవునమ్మా అవునమ్మా**

ఆరుద్రగారు నాస్తికుడు అయినా
**'ఆదిలక్ష్మికి పువ్వుల పూజలు**
**అలవాటే గద అవునమ్మ'** అంటూ మా మనసుల్లోకి దూరి 'స్వరకాయ ప్రవేశం' చేశాడనిపించేలా రాశారు.

ఆరుద్రగారు నాస్తికుడే అయినా అయన ఇల్లాలు రామలక్ష్మిగారిని - ఎల్లప్పుడూ 'రామా''రామా' అని పిలిచేవారు.

*****

50లలో పెంకి పెళ్ళాం అనే సినిమాలో ఆరుద్రగారు ఒక పెంకి పాట రాశారు. "పడుచుదనం రైలుబండి పోతున్నదీ వయసు వాళ్ళకందులో చోటున్నదీ..."

"ఎక్కవలసిన రైలు ఎక్కాను - దిగవలసిన స్టేషన్ వచ్చింది - సీటు కాళీ చేయాలి - దిగిపోతున్నాను" అని చెప్పి మరీ దిగిపోయారు.

దిగే ముందు...చిట్టచివరిగా మళ్ళీ రామనామం! ఆయన అక్షరాలా మంచాన్ని ఆశ్రయించి విశ్రమించే వేళ - మేము - ఈటీవీ కోసం తీసే శ్రీ భాగవత కథలలో రామాయణ కథను తీస్తున్న వేళ - సుందరకాండను సమగ్రంగా వ్రాయమని కోరాము...అంపశయ్య మీద విశ్రమించిన కురు వృద్ధుడు భీష్ముడు - శ్రీ విష్ణు సహస్రనామం చెప్పినంత మహోజ్జ్వలంగా ఆరుద్రగారు సుందరకాండను గానం చేసారు. ఆ పాట అరవై నిముషాల పై మాట...ఆలిండియా రికార్డు అని రికార్డింగు రంగారావుగారు అన్నారు. మేము ధన్యులం...

### ఉన్నమాటే అన్నమాట

ఆనాడే చెప్పాడు మ.రా.రా. గిరీశం
ఎలా ఉంటుందో తన ఉద్దేశంలో అమెరికా దేశం
దేశమంటే మట్టి కాదు మనుష్యులు
అంటారు కదా గురజాడ ప్ర శిష్యులు
అమెరికాలో అంతా తలకిందు
అనడానికి తెలియాలి తలేదో తోకేదో ముందు
ఒక విషయంలో ఉండదు ఎవరికీ అభిప్రాయ భేధం
అమెరికాలో మిట్ట మధ్యాహ్నం ఇండియాలో నిశీథం
అందుకే కాబోలు భారతీయులు చేసే కొన్ని చీకటి తప్పులు
తెల్లవాళ్ళు పట్టపగలే చేసి వాయించుకుంటారు డప్పులు
అమెరికా యాత్ర చేశాను రెండు మారులు
అప్పుడు పరిశీలించాను అక్కడి వాళ్ళ తీరులు
నేను చూసింది తెల్లవాళ్ళకన్నా ఎక్కువగా తెలుగువాళ్ళను
కాబట్టి తెరుస్తున్నాను అమెరికాంధ్రుల పోకిళ్ళ వాకిళ్ళను
నేను కొంచెం బాగా రాయగలిగినవి పజ్యాలు
అవే చేస్తున్నాను మిత్రులకు నైవేద్యాలు
సమర్పిస్తున్నాను హోలు మొత్తం
స్వీకరిస్తారో కరుస్తారో మీ చిత్తం

### అభ్యాసము కూసువిద్య

అమెరికాలో కాపురానికొచ్చిన ప్రతి ముద్దరాలూ
అరణ్యవాసంలో సీతమ్మతో సమానురాలు
పంచవటిలో కనీసం పనులు చేయడానికుంటాడు సౌమిత్రి
ఇక్కడ తనకు తనే కూలీ; తనకు తనే మేస్త్రీ
చాలా పొద్దున్నే భర్త వెళ్ళిపోతాడు ఉద్యోగానికి
రోజల్లా ఆమె గురి అవుతుంది ఒంటరితనానికి
ఉన్న ఒక్క కారూ ఆయనగారు తీసుకుపోతారు
ఎక్కడికీ వెళ్ళలేక ఆమెకు గుండె బేజారు
అవురావురుమంటూ అతడొస్తాడు సాయంకాలానికి
అప్పటికి తాను సిద్ధం చేయాలి ఏదైనా ఫలహారానికి
ఇంటి దగ్గర పూర్వం నేర్చుకోలేదు వంటా వార్పూ
ఇప్పుడు తప్పనిసరిగా నేర్చుకొంటూంది ఓర్పు
కట్టుకున్నవాడికి పెట్టాలి కదా కడుపు నిండా తిండి
ఆమాత్రమైనా చేయకపోతే ఎందుకూ తాను ఉండి?
వంటల పుస్తకం చదివి చేస్తోంది ఎక్స్‌పెర్‌మెంటు
వెంటనే కాకపోయినా ఫలిస్తూంది ఆమె ప్రయోగం
వంటతో పాటు ఆవిడ చేస్తోంది ఇప్పుడు ఉద్యోగం
ఎన్నో వంటలు వండి నింపేస్తుంది ఫ్రిజ్
ఇంత తీరుబాటు ఎలా దొరికిందన్నదొక పెద్ద క్విజ్
ఇరవై సంవత్సరాలలో తాను ఒక ఎక్స్‌పర్ట్ కుక్
నిజం చెప్పాలంటే ఆమె సజీవ కుక్ - బుక్.

### ఇతి భావ: ఇత్యర్థ:

ఆడవారి మాటలకు అర్థాలే వేరు
అన్నారు పూర్వం ఒక సినిమా కవిగారు
అమెరికాలో తెలుగువారి కొన్ని మాటలకు ప్రతిపదార్థం
ఆరా తీయడం ఎంత మాత్రం కాదు వ్యర్థం
అన్నాడా వేల్చేరు నారాయణరావు:"మళ్ళా మిమ్మల్ని పిలుస్తాను"
అంటే అర్థం "ఇంకోసారి మీకు ఫోను చేస్తాను"
"అయ్యో టిక్కెట్టిచ్చాడు" అంటూ వాపోయిందా రాజామణి
అంటే 'ట్రాఫిక్ పోలీసు పట్టుకుని కోర్టుకు సమన్సు ఇచ్చాడ'ని
ఇంట 'డిష్‌లు చెయ్యడం' అంటే 'కడగడం అంట్ల గిన్నెలు'
బయట 'లాన్ చెయ్యడం' అంటే 'కత్తిరించడం పచ్చిక తిన్నెలు'
"ఫ్రెండ్స్‌ను విజిట్ చెయ్యడం' అంటే చుట్టపు చూపుగా వెళ్ళడం'
ప్రయాణంలో 'ఎగ్జిట్ తీసుకొనడం' అనగా 'దారి మళ్ళడం'
అమెరికాంధ్రానికి గ్రామరు డిక్షనేరి
ఏ 'చేరా' అయినా రాస్తాడా ఏరి కోరి?
విదేశాల్లో స్థిరపడ్డ వాళ్ళ భాష
స్వదేశీయులు వింటున్నప్పుడు తమాషా.

### మిమ్మల్నెక్కడో చూసినట్టుందే

అమెరికాంధ్రులలో కొందరు ఆలుమగలు
అసలు ఒకరినొకరు చూసుకొనరు పట్టపగలు
ఇద్దరూ వేరు వేరు చోట్ల చేస్తుంటారు ఉద్యోగాలు
పొద్దు పొడవక ముందే ఒకరు లేచి ముగిస్తారు కాలకృత్యాలు
రెండవవారు లేచే లోపునే ఇల్లు వదిలి ఆఫీసుకి బయలుదేరుతారు
ఎండా వానా మంచూ తుఫాను ఏదైనా సరే డ్రైవు చేసుకుపోతారు కారు
రోజుకెనిమిది గంటలు వారానికైదు రోజుల పాటు
రొటీనుగా ఉద్యోగం టైముకెళ్ళి చెయ్యాలి కాకూడదు లేటు
ఇంట్లో ఉన్న భార్యాభర్తలిద్దరూ ఇల్లు వదిలేస్తారు మార్నింగు
ఇంటికి మళ్ళా అలిసిపోయి చేరుకుంటారు ఈవినింగు
శని ఆదివారాలు సెలవన్న మాటేగాని చేయాలప్పుడు ఇంటి చాకిరీ
షాపింగు, క్లీనింగు, మాపింగు, స్టిచ్చింగు, వాషింగు, ఇస్త్రీ
అమెరికాలో ఆంధ్రులు అనుభవిస్తున్నారు భోగభాగ్యాలు
అనుకుంటుంటారు ఇండియాలో - ఇవీ వాళ్ళార్జించే సౌఖ్యాలు

### కూలీలందరు ఏకము కావలెరా!

ఇండియాలో కలవారి బిడ్డల చదువుకు కాన్వెంట్స్
ఇక్కడ అమెరికాలో ఆ బిడ్డలు కావాలి ఐవీలీగ్ స్టూడెంట్స్
శ్రీమంతులు కాపాడుకోవాలి హమేషా తమ క్లాసు
ఏ మాత్రం లోపం వచ్చినా సాటివారిలో చెల్లదు ఫేసు
మమ్మీ డాడీలకు ఉంటే ఉండవచ్చు డబ్బుగోటు
మామ్మూలుగా స్టూడెంట్స్ ఈవినింగ్ చేస్తారు పనీపాటు
అమెరికాలో ఎవ్వరూ ఏ పనీ చేయించుకోరు తేరగా
అమ్మాయిలూ అబ్బాయిలూ వర్కు చేస్తారు డబ్బుకు జోరుగా
ఒళ్ళు వంచి ఆర్జించే ప్రతి ఒక్క డాలర్
ఓపిగ్గా నేర్పుతుంది డిగ్నిటీ ఆఫ్ లేబర్
ఇండియాలో కలవారి బిడ్డలు కొందరు తిరుగుతారు గాలికి
అమెరికాలో పడుచు విద్యార్థులు పని చేస్తారు కూలికి.

## ఆరుద్ర ఇంటింటి పజ్యాలు

### త్యాగరాజ కీర్తన

మాటవరసకి మా ఇంట్లో నేను యజమాన్నే
మా అమ్మాయిల్నందర్నీ నేను ప్రేమించే నాన్నే
పేరుకైనా చెల్లదు నా యొక్క పెత్తనం
ఊరికే వస్తుందా నాకు ఉడుకుమోత్తనం
స్కూలుకెళ్ళే పిల్లలే ముందు చెయ్యాలి స్నానం
బాత్రూం క్యూలో నాన్నదే కడపటి స్థానం
నాన్నకి సమయానికి దొరకని వస్తువులు ఎవ్వన?
అమ్మాయిలు హడావుడిగా వాడిన తలనూనె ఆ దువ్వెన!
బాత్రూమ్లోకి మర్చిపోతేను పట్టుకెళ్ళడం తువ్వాలు
భార్యామణి చంటిదానికి అప్పుడే తినిపిస్తూంటుంది బువ్వాలు
అమ్మల్నావిడ స్కూల్బస్సెక్కించాలి ముందు
ఆ పిమ్మటే ఎక్కిస్తుంది మత్తైజమా బొందు
చిన్నారి నియంతల్ని సేవించే ఉద్యోగి
ప్రతి నాన్నా దినదినం మహావీర్ త్యాగి.

### లావొక్కింతయు లేదు చావొక్కింతయు రాదు

ముప్ఫయ్యేళ్ళు దాటాక మొగాడికి బొజ్జ
తప్పకుండా వస్తే రాకూడదు లజ్జ
కాలప్రవాహంలో ముప్ఫయ్యేళ్ళ రేవు
స్త్రీలు కూడా దాటగానే ఎక్కుతారు లావు
తగు మాత్రం లావెక్కితే మగువ
తగ్గడానికి చేస్తుంది తెగువ
ఉండాలనుకొంటుంది తాను తన మూడో చెల్లెలాగ
ఉద్దేశాలున్నా అవి జరగడమెల్లాగ
గొడ్డుకారంలో కూడా వేసుకోదు నెయ్యి
గోముగా రాజెయ్యదు ఓ పూట పొయ్యి
చారూ అన్నం చకచకా వండి
చక్కగా తింటుంది అర్ధాకలి తిండి
ఎన్ని ఉపోషాలున్నా తగ్గదు బరువు
ఎన్ని ఉద్దేశాలున్నా దక్కదు పరువు
ఎంత కడుపు కొట్టుకున్నా అంతే లావు
ఇంటాయనకు మాత్రం చచ్చిన చావు.

### ఇవి నా కళ్ళద్దాలేనా?

పరీక్ష ఫలితాల పేజీలలోని అన్ని నెంబర్లు
పనికట్టుకొని చదివే చదువర్లు
మొట్టమొదట ప్రూఫు రీడర్లు
కట్టకడపట తప్పిన కుర్రాళ్ళ ఫాదర్లు

### జలుబు

చచ్చిన చావులాటి రొంపా జలుబు
వచ్చిన వాళ్ళ ముక్కు వెలగని బలుబు

### అడగని యక్షప్రశ్న

రోజూ గీసుకోని మగాడి గడ్డం
మోజున్న సరసానికొస్తుందా అడ్డం?

## ఆరుద్ర కూనలమ్మ పదాలు

తాగుచుండే బుడ్డి
తరగుచుండే కొద్ది
మెదడు మేయును గడ్డి
ఓ కూనలమ్మ

ఆలి కొన్నది కోక
అంతరిక్షపు నౌక
అంతకన్నను చౌక
ఓ కూనలమ్మ

మనసు తెలుపని భాష
మంచి పెంచని భాష
ఉత్త సంద్రపు ఘోష
ఓ కూనలమ్మ

భార్య పుట్టినరోజు
భర్త మరచిన రోజు
తగ్గె ననుకో మోజు
ఓ కూనలమ్మ

'అతడు - ఆమె'ల ఫైటు
అతివ ఛాన్సులు బ్రైటు
ఆడదెపుడూ రైటు
ఓ కూనలమ్మ

ఏకపత్నీ వ్రతము
ఎలుగెత్తి మన మతము
వేల్పు భార్యలో? శతము!
ఓ కూనలమ్మ

తమలపాకులు నములు
దవడతో మాట్లాళు
తానె వచ్చును తమిళు
ఓ కూనలమ్మ

నూతిలోపలి కప్ప
పాతఘనతలు తప్ప
మెచ్చదితరుల గొప్ప
ఓ కూనలమ్మ

అయిదు రోజులు వేస్టు
అగుట కెయ్యది బెస్టు?
చూడు క్రికెట్ టెస్టు
ఓ కూనలమ్మ

## ఆరుద్ర ఖాతాఖూని

పాఠుక మహాశయులారా!

ఈ మధ్య మా పత్రికలో మచ్చు తప్పులు కోగుల్లలుగా పుట కరుస్తున్నవి. వాటిని కారణభూతాలుగా చూపెంచి ఒక పావక మహాశనుడు ఈ నిద్రారాక్షసాలకు ఒక పేచీ కాటాయించ నక్కరలేదంటున్నాడు. ఆ తుప్పులు మేము వాంచించని క్షుద్రా రాక్షసాలు. ఇవి కోవాలని పచనము చేస్తున్నవి :

కుషితో నాస్తి దుర్భిక్షం.

ఆశ లావు పీక సున్నం.

కొంతమంది ఉద్యోగులు ఒక లంచంలో తినే మిత్రులు.

వడగళ్ళ వాన పిల్లల్లకు హర్ష బుతువు.

దొంగ భక్తులు కామనామ స్మరణ చేస్తారు.

క్రూరమృగాల స్వభావాలు కొంతమంది మనుజాలలో కనబడతాయి.

తెల్లనివన్నీ పేలు కావు.

పేదవాడి కోపం పదవికి చేటు అని ప్రజాసామ్యంలో మంత్రులు గుర్తిస్తారు.

## ఆనంద నిలయం

సంగీతం : పెండ్యాల　　గానం : ఘంటసాల

ప: పది మందిలో పాట పాడినా - అది అంకితమెవరో ఒకరికే
విరితోటలో పూలెన్ని పూచినా - గుడికి చేరేది నూటికి ఒకటే
చ: గోపాలుని కెంతమంది గోపికలున్నా
గుండెలోన నెలకొన్న రాధ ఒక్కతే
ఆకాశవీధిలో తారలెన్ని ఉన్నా
అందాల జాబిల్లి అసలు ఒక్కడే ॥పది మందిలో॥
చ: ఏడాదిలో ఎన్ని ఋతువులున్నను
వేడుక చేసే వసంతమొక్కటే
నా కన్నులందు ఎన్ని వేల కాంతులున్నను
ఆ కలిమి కారణం నీ ప్రేమ ఒక్కటే ॥పది మందిలో॥

## ఇల్లరికం

సంగీతం : టి. చలపతిరావు　　గానం : ఘంటసాల, సుశీల

ఆ: నేడు శ్రీవారికి మేమంటే పరాకా
ఎందుకో తగని భలే చిరాకా
మొదట మగవారు వేస్తారు వేషాలు
పెళ్లి కాగానే చేస్తారు మోసం
అ: ఆడవారంటే శాంతస్వరూపాలే కోపతాపాలు రావండి పాపం
ఆ: కోరి చేరిన మనసు, చేత జిక్కిన అలుసు (2)
కొసకు ఎడబాటు అలవాటు చేస్తారు
అ: నేడు శ్రీమతికి మాతోటి వివాదం
తగువే భలే వినోదం - ఎందుకో తగువే భలే వినోదం
అ: వారి మనసైతే వస్తారు ఆడవారు చేర రమ్మంటే రానే రారు
ఆ: ఆ...తెలుసుకున్నారు స్త్రీల స్వభావాలు
తెలిసి తీర్చారు ముద్దు మురిపాలు
అ: అలుక సరదా మీకు - అదే వేడుక మాకు (2)
కడకు మురిపించి గెలిచేది మీరేలే
ఇ: ప్రణయ కలహాల సరసాలే వినోదం
నిజమే భలే వినోదం...నిజమే భలే వినోదం

## బావా మరదళ్ళు

సంగీతం : పెండ్యాల　　గానం : ఘంటసాల/జానకి

ప: నీలి మేఘాలలో గాలి కెరటాలలో
నీవు పాడే పాట వినిపించు నీ వేళ
చ: ఏ పూర్వ పుణ్యమో నీ పొందుగా మారి (2)
అపురూపమై నిలిచె నా అంతరంగాన ॥నీలి మేఘాలలో॥
చ: నీ చెలిమిలో నున్న నెత్తావి మాధురులు (2)
నా హృదయ భారమునే మరపింపజేయు॥నీలి మేఘాలలో॥
చ: అందుకోజాలని ఆనందమే నీవు (2)
ఎందుకో చేరువై దూరమవుతావు ॥నీలి మేఘాలలో॥

## అత్తా ఒకింటి కోడలే

సంగీతం : పెండ్యాల　　గానం : ఘంటసాల

ప: జోడు గుళ్ళ పిస్తోలు ఠా - నేను ఆడీ తప్పని వాణ్ణి - జీహో
హద్దు మీరు వారు శిక్షింపబడుదురు
బుద్ధిమంతులెపుడు రక్షింపబడుదురు ॥జోడు॥
ఆఫీసరు భార్యననే అహం కూడదు
అధికారం చెలాయిస్తే ఇంక చెల్లదు అత్తా
తొండ ముదిరితే ఊసరవెల్లి
హజం ముదిరితే హళ్ళికి హళ్ళి ॥జోడు॥
కాకి పిల్ల కాకికి కడు ముద్దు - అది అందుచేత
కాకూడదు మొద్దు - ఎవరి గొప్ప వాళ్ళ వద్ద - ఆగకున్నచో
దేహశుద్ధి కొండొకచో జరుగుట కద్దు ॥జోడు॥
నోరు మంచిదైతే ఊరు మంచిది
పోరు నష్టం - ఎపుడూ పొందు లాభము
ఇది కోర్టు కెక్కితే అంతా అభాసు - అత్తా
నీ జోరు తగ్గకుంటే కొంప కళాసు ॥జోడు॥

## దేశద్రోహులు

సంగీతం : యస్. రాజేశ్వరరావు　　గానం : ఘంటసాల

ప: జగమే మారినది మధురముగా ఈ వేళ
కలలూ కోరికలూ తీరినవి మనసారా
చ: మనసాడెను మయూరమై పావురములు పాడి -
ఎల పావురములు పాడి
ఇదె చేరెను - గోరువంక రామచిలుక చెంత -
అవి అందాల జంట
నెనరూ కూరిమి - ఈనాడె పండెను జీవితమంతా -
చిత్రమైన పులకింత ॥జగమే మారినది॥
చ: విరజాజుల సువాసన స్వాగతములు పలుక -
సుస్వాగతములు పలుక
తిరుగాడును తేనెటీగ - తీయదనము కోరి -
అనురాగాల తేలి
కమ్మని భావమే - కన్నీరై చిందెనే
ప్రియమగు చెలిమి - సాటిలేని కలిమి॥జగమే మారినది॥

## పవిత్ర బంధం

సంగీతం : యస్. రాజేశ్వరరావు　　గానం : ఘంటసాల

ప: గాంధి పుట్టిన దేశమా ఇది నెహ్రు కోరిన సంఘమా ఇది
సామ్యవాదం రామరాజ్యం సంభవించే కాలమా
సస్యశ్యామల దేశం అయినా నిత్యం క్షామం
ఉప్పొంగే నదుల జీవజలాలు ఉప్పు సముద్రం పాలు
యువకుల శక్తికి భవితవ్యానికి ఇక్కడ తిలోదకాలు
ఉన్నది మనకూ ఓటు - బ్రతుకు తెరువుకే లోటు ॥గాంధి॥
సమ్మె ఘోరావు దొమ్మి బస్సుల దహనం లూటీ
శాంతి సహనం సమధర్మం పై విరిగెను గూండా లాఠీ
అధికారంకై పెనుగులాటలో అన్నాదమ్ముల పోటీ
హెచ్చెను హింసాద్వేషం ఏమవుతుందీ దేశం ॥గాంధి॥
వ్యాపారాలకు పర్మిట్ వ్యవహారాలకు లైసెన్స్
అర్హతలేనీ ఉద్యోగాలు లంచం ఇస్తే ఓ యస్
సిఫార్సు లేనిదే శ్మశానమందు దొరకదు రవంత చోటు
పేరుకు ప్రజలది రాజ్యం - పెత్తందార్లకే భోజ్యం ॥గాంధి॥

## దేవదాస్

సంగీతం : రమేష్ నాయుడు　　గానం : బాలసుబ్రహ్మణ్యం

ప: ఇది నిశీథి సమయం - అది తిరుగులేని పయనం -
తిరిగి రాని పయనం - తిరిగి రాని పయనం
ఈ సమయం భ్రాంతి సుమా! ఆ పయనం మాయ సుమా!
అంటున్న నేను, వింటున్న నీవు
అంతా మాయ సుమా అంతా మాయ సుమా
అయిదు సరుకుల మేళవింపుతో తొమ్మిది తలుపుల భవనం
అందులోన నివాసం మాని - హంస చేరురా గగనం
తానే లేని సదనంలో - తలుపులు ఎందుకురా
తిరిగి రానే రాని పయనంలో పిలుపులు ఎందుకురా
మరలా పుట్టుక, మరలా చచ్చుట యిరుసే లేని చక్రం
వచ్చేవారూ పోయేవారూ జగతి పురాతన సత్రం
రాకడైనా, పోకడైనా కర్తవు కావురా నీవు
అన్ని అంచెలు దాటిన పిదప ఉన్నది కడపటి రేవు ॥ఇది॥

## ప్రేమలేఖలు

సంగీతం : శంకర్ - జైకిషన్　　గానం : జిక్కి

ఏకాంతము - సాయంత్రము ఎద నీకై వేగెను
చిగురాకుల సడి విన్నను ఏదో దడ రేగెనూ
ఏ దారి ద్వారా - నీ రాకయో ఆ దారి జాడే కనరాదయో
పేరాశలై నా కోర్కెలే - ఈ మంచుగ కరిగేనూ॥ఏకాంతము॥
ఇన్నాళ్ళ ప్రేమ కన్నీరుగ కన్నీరు మారే మున్నీరుగ
నన్నీగతి విడనాడితే - నా హృదయము పగిలేనూ॥ఏకాంతము॥

## బందిపోటు

సంగీతం : ఘంటసాల గానం : ఘంటసాల, సుశీల

ప: ఊహలు గుసగుసలాడె నా హృదయము ఊగిసలాడే
చ: వలదన్న వినదీ మనసు కలనైన నిన్నే తలచు
తొలిప్రేమలో బలముందిలే అది నీకు మునుపే తెలుసు ॥ఊహలు॥
చ: ననుకోరి చేరిన బేల దూరాన నిలిచే వేల
నీ యానతి లేకున్నచో విడలేను ఊపిరి కూడా॥ఊహలు॥
చ: దివి మల్లె పందిరి వేసే భువి పెళ్లి పీటను వేసే
సిరివెన్నెల కురిపించుచూ నెలరాజు పెండ్లిని చేసే॥ఊహలు॥

## ప్రతిజ్ఞ పాలన

సంగీతం : మాస్టర్ వేణు గానం : సుశీల, లత

రామచిలుక తెలుపవే ప్రేమ ఏమిటో
అనురాగమో సరాగమో అదేమి లోకమో
కలలో ఒక అందగాడు కన్ను కలిపి నవ్వెనే
కనుకలుపగ నా వన్నెలు కడలి పొంగు లాయెనే
కన్నెమనసు పొంగించిన వెన్నెల రాజెవ్వరే
భామరో తానెవ్వరో వరించు నాథుడే ॥రామచిలుక॥
ఒకచోటను నిలువలేను ఒంటరిగా ఉండలేను
ఊహలోని చెలికాని ఊసులాడి వేగలేను
జాబిలితో ఈ తారక జత గూడుట ఎన్నడే
భామరో నీ నోములు ఫలించునప్పుడే ॥రామచిలుక॥

## వీరాభిమన్యు

సంగీతం : కె.వి.మహదేవన్ గానం : ఘంటసాల, సుశీల

అదిగో నవలోకం - వెలసే మనకోసం (2)
నీలి నీలి మేఘాల లీనమై
ప్రియా నీవు నేను తొలిప్రేమకు ప్రాణమై
దూరదూర తీరాలకు సాగుదాం
సాగి దోరవలపు సీమలో ఆగుదాం
ఎచట సుఖముందో ఎచట సుధ గలదో
అచటే మనముందామా ॥అదిగో॥
పారిజాత సుమదళాల పానుపూ
మనకు పరచినాడు చెఱకువింటి వేలుపూ
ఫలించె కోటి మురిపాలూ - ముద్దులు
మన ప్రణయానికి లేవు సుమా హద్దులు
ఎచట హృదయాలూ ఎపుడు విడిపోవో
అచటే మనముందామా ॥అదిగో॥

## లేత మనసులు

సంగీతం : ఎమ్మెస్.విశ్వనాథం గానం : సుశీల

పిల్లలూ దేవుడూ చల్లనివారే
కల్లకపటమెరుగని కరుణామయులే
తప్పులు మన్నించుటే దేవుని సుగుణం - ఇది
గొప్పవాళ్ళు చెప్పినట్టి చక్కని జ్ఞానం ॥పిల్లలూ॥
పుట్టినపుడు మనిషి మనసు తెరిచియుండును
ఆ పురిటికందు మనసులో దైవముండును
వయసు పెరిగి యీసు కలిగి మదము హెచ్చితే
మనిషిలోని దేవుడే మాయమగునులే ॥పిల్లలూ॥
వెలుగుతున్న సూర్యుణ్ణి మబ్బు మూయును
మనిషి తెలివియనే సూర్యుణ్ణి కోపం మూయును
గాలివీచి మబ్బు తెరలు కదలిపోవులే - మాట
కలుపుకొన్న కోపమే - చెలిమి యగునులే ॥పిల్లలూ॥
పెరిగి పెరిగి పిల్లలే పెద్దలౌదురు - ఆ
పెద్దలేమొ కలహిస్తే చిన్నబోదురు
మాయమర్మమేమిలేని బాలలందరు
ఈ భూమి పైన వెలసిన పుణ్యమూర్తులే ॥పిల్లలూ॥

## చెంచులక్ష్మి

సంగీతం : యస్. రాజేశ్వరరావు గానం : ఘంటసాల

కరుణాలవాలా ఇది నీదు లీలా
అంతయును వింత పొగడగ నేనెంత ॥కరుణాలవాలా॥
నీ మాయ కానంగ లేరు - వేయి నేత్రాలు ఉన్నను ఎవరు
పరసతులను చెరపట్టే అంధుడు - ఇతడా
నరలోకము పాలించే ఇంద్రుడు
పదవి మీద ఆశ చేత - ప్రభువాయెను పశువు
పాపము తననేమి చేసె కడుపులోని శిశువు॥కరుణాలవాలా॥
బ్రహ్మ ఇచ్చిన వరములు తెచ్చెను - కర్మా - యీ కర్మ
దుష్కర్మల నాపుట బ్రహ్మ విష్ణులా తరమా - తరమా
తాను తీసిన గోతి లోపల పడునే తానే
తపోశక్తి జయించలేరు - దైవమైన పరదైవమైననూ ॥కరుణాలవాలా॥
ఏడేడు లోకాల ఏలికా - నీపైన పొడగా చాలదొక నాలికా
నీవు తలచిన చాలు మేరువే అణువు
నీ చేతిలో కలదు - అందరి పరువు మహిమన్న నీదేనులే -
ఏమైన దైవమన నీవేనులే ॥కరుణాలవాలా॥
శ్రీహరియే నటన సూత్రధారీ-కాని ప్రవేశించు కొత్త పాత్రధారీ
ఇది నీ వాడించెడు నాటకము
ఇక ఉండదు వింతలకే కొటకము ॥కరుణాలవాలా॥
అధినాథుని పత్ని కూడా విధికి బానిసే
జీవపథము మారిపోవ చిత్రహింసయే
పాలకడలిలోన పుట్టి వైకుంఠము మెట్టి
నేలపాలు అయినావా నేటికి మహాలక్ష్మీ ॥కరుణాలవాలా॥
కాంత చేతిలోపల ఏ మంత్రమున్నదో
ఎంత భీకరుడయినా శాంతమొందితీరునే
ఇంతి కంటి చూపుకి ఇనుమైనా కరుగునని
అంత ఉగ్రమూర్తివి ఇటుల మారినాడవా ॥కరుణాలవాలా॥

## ముద్దుబిడ్డ

సంగీతం : పెండ్యాల గానం : పి.లీల

ఎవరు కన్నారెవరుపెంచారు
నవనీతచోరుని,గోపాల బాలుని ॥ఎవరు॥
నోము నోచి నెలలు మోసి నీలమేఘ శ్యాము కన్నది దేవకీ
లాలపోసీ పాలుపట్టి
జోలపాడే కలిమి కలిగె యశోదకీ ॥ఎవరు॥
తడవ తడవకు కడుపు శోకము
తాళజాలక పెంచనిచ్చెను దేవకీ
తాను కనకయె తల్లి అయెను
తనయుడాయెను దేవుడే యశోదకీ ॥ఎవరు॥
ఎవరుకనినా ఎవరు పెంచిన
చివరికతడానంద మిచ్చిన దెవరికీ
అవనిలో తనపైన ఎన్నో ఆశలుంచిన వారికి -
తన నాశ్రయించిన వారికి ॥ఎవరు॥

## ఉయ్యాల జంపాల

సంగీతం : పెండ్యాల గానం : ఘంటసాల,సుశీల

కొండగాలి తిరిగింది గుండె ఊసులాడింది
గోదావరి వరదలా కోరిక చెలరేగింది
పుట్ట మీద పాలపిట్ట పొంగిపోయి కులికింది (2)
గట్టుమీద కన్నెలేడి గంతులేసి ఆడింది ॥కొండగాలి॥
పట్టపగలు సిరివెన్నెల భరతనాట్యమాడింది
పట్టరాని లేతవలపు పరవశించి పాడింది ॥కొండగాలి॥
మొగలిపూల వాసనతో జగతి మురిసిపోయింది
నాగమల్లి పూలతో నల్లని జడ నవ్వింది ॥కొండగాలి॥
పడుచుదనం అందానికి తాంబూలమిచ్చింది (2)
ప్రాప్తమున్న తీరానికి పడవ సాగిపోయింది ॥కొండగాలి॥

